# నిజాంరాజు
# అధికారం అంతమైన రోజు

నందనం కృపాకర్




శ్రీలేఖ సాహితి
వరంగల్

సత్యలీల పుస్తకమాల - ప్రచురణలు-05

ఇం. నెం. 24-482,
పంచశీలకాలని,
రంగారెడ్డి నగర్,
హైద్రాబాద్ - 37.

**నిజాం రాజు అధికారం అంతమైన రోజు** - నందనం కృపాకర్

| | | |
|---|---|---|
| సృష్ట్యబ్ది | : | 197,29,50,002 సం॥ |
| కలియుగాబ్ది | : | 5102 |
| ప్రథమ ముద్రణ | : | జూన్, 2001 |
| ప్రతులు | : | 1000 |
| సర్వస్వామ్యములు | : | రచయితవి |

ప్రతులకు :

1. ఆర్య సమాజ్ మందిర్, రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్.
2. ఆర్యసమాజ్ మందిర్, సుల్తాన్‌బజార్, హైదరాబాద్.
3. సాహిత్య నికేతన్, బర్కత్‌పుర్, హైదరాబాద్.
4. విశాలాంధ్ర - అన్ని బ్రాంచీలలో
5. కరుణాకర్, C3-472 హుడాకాలని, హైదరాబాద్
6. నందనం కృపాకర్, వైస్ ప్రిన్సిపల్
   సెయింట్ పీటర్స్ హైస్కూల్, హనుమకొండ, వరంగల్.

మూల్యం: 30/-

# ఆర్య సమాజ పోరాట చరిత్ర - ఆశ్చర్యం కలిగించే వాస్తవం

కృపాకర్ రాసిన " నిజాం రాజు అధికారం అంతమైన రోజు" అనే చరిత్ర రచన ఒక కథవలె సాగింది. చదువుకునే వాండ్లకు, ఆనాటి చారిత్రక వాస్తవాలు తెలియపరచటానికి ఈ చరిత్ర కథనం, చదవటానికి ఏ మాత్రం విసుగు పుట్టించకుండా సాగింది. ఇతైహదుల్ ముసల్మీన్ అధ్యక్షుడు బహద్దూర్ యార్‌జంగ్, తర్వాత ఖాసీంరజ్వీ ప్రతీ ముస్లీంలో కలిగించిన ముస్లీం ఆధిపత్య, అహంకార భావన చాలా ప్రమాదకరమైంది. ప్రతీ ముస్లీం మనస్సులో నాటేవిధంగా చెప్పిన "అసఫ్జాహీ ఆధిపత్యం ముస్లీం ఆధిపత్యానికి ప్రతీక" అనేమాట 'సియాసీ కల్మా' గా నేర్పబడింది. అంతేకాదు ప్రతీముస్లీంనోట "అనల్ మాలిక్" (నేనే రాజును) అనే నినాదం ఇచ్చేటట్లు చేయబడింది.

ఈ విషయం నిజాంకు కూడా నచ్చలేదు. ఎందుకంటే రాజ్యాధికారం అసఫ్జాహీ వంశానికి చెందినది, అది ముస్లీం ప్రజానీకానికి చెందినదికాదు. వంశపారంపర్యంగా అసఫ్జాహీ వంశీయులకు చెందవలసినది. ప్రతీ ముస్లీం నేనే రాజును అని అనుకోవడం వంశ పారంపర్య అధికార సంప్రదాయానికి విరుద్ధం. అందుచేత తన అధికారానికి ప్రమాదం అయినా తనవలన ముస్లీంల పేరు ప్రతిష్టలు నిలిచి ఉన్నాయి అనే భావన, అట్లాగే ముస్లీంల ముస్లీం అధికారానికి, రాజ వంశీకుల అధికారానికి తప్పనిసరి అనే విషయం మనసులో పెట్టుకుని ఏడవ నిజాం ఉస్మాన్ అలీఖాన్, ఇత్తెహదుల్ ముసల్మీన్ నిర్మించిన రజాకార్ బలగాలు సైనిక బలగాలుగా మారినా ఊరుకోవాలసి వచ్చింది. ప్రభుత్వాధికారులు, ప్రత్యేకించి పోలీసులు రజాకారు సైన్యం నిజాం రాజ్యమంతటా జరిపిన "హత్యాచార, అత్యాచార దురాగతాలు" ఏ విధంగా సాగినాయో సెప్టెంబర్ 3వ తేదీ 1947 నుండి 26వ సెప్టెంబర్ 1948 వరకు ఈ పుస్తకంలో కృపాకర్ సవివరంగా రాసారు. నాడు వేలాది సమరయోధులతోపాటు నేను కూడా జైల్లోనే ఉన్నాను. 3వ సెప్టెంబర్ 1947కు ముందు నిజాం రాజ్యంలో మతం పేరిట రాజ్యాధికారం పేరిట రజాకార్లు జరిపిన రాక్షస కృత్యాలను, దానికి తోడుగా వారికి నిజాం అందించిన ప్రత్యక్ష, అప్రత్యక్ష సహకారాన్ని, ప్రోత్సాహాన్ని 'నాగొడవ'లో చెప్పినాను.

"నల్గొండలో నాజీవృత్తుల నగ్న నృత్యమింకెన్నాళ్ళు పోలీసంరః
పోషణ పొందేదెన్నాళ్ళు" అని 1945లో.

అలాగే ....

"పట్టపగలే పట్టణములో పట్టి పౌరుల కొట్టి చంపిన
దుష్ట కూటమితో ప్రభుత్వం దొంగ బేరము జేసినట్లే
న్యాయమును పాటించనొల్లని ఆధిపత్యము అంత ఉన్న
హత్య, దోపిడి, మానభంగము నిత్యకర్మల జేరినట్లే
బూజు పట్టిన రాజ్యభారము మోయజాలక జానపదులు
రోజుచున్న దేశమేలెడి రాజు రోజులు నిండినట్లే"

అని 1946లో నిజాం రాజును సవాల్ చేస్తూ రాసిన నా
పంక్తులు.

రాణివాసములోన రంజిల్లు రాజా
రైతు బాధలు తీర్చి రక్షింపలేవా ?
పట్టణపు సొగసుకై పాటుపడు మా రాజా
పల్లె కందము గూర్చు బాధ్యతే లేదా ?
సామాన్య జనములకు చైతన్య మొదవ
చతురంగ బలముండ జంకేల రాజా
ప్రజలను హింసించు ప్రభువు మాకేల
వధియింప భక్షింప వనరాజు లేడా'.

పై గేయాల్లో పేర్కొన్న దురాగతాల వివరాలు కృపాకర్ రాః
చూసుకోవచ్చు. పై పంక్తులు నైజాం రాజ్యంలోని ఆ రోజుల స్థితిని ఎ
చూస్తూ ఎదిరిస్తూ రాసినవి. వాటన్నింటినీ చరిత్రగా సమకూర్చిన కృపా
వాస్తవాలే.

జనగామ తాలూకాకు చెందిన రెండు ఊళ్ళు ఆకునూరు, మా
పోలీసులు, రజాకార్లు జరిపిన దురాగతాలను

"మాచిరెడ్డి పల్లె, ఆకునూరులో దోచిన మానము చాలింక
పాలన పేరిట పల్లె పల్లెలో జరిపిన పాపము చాలింక
రాజుపేరిట అరాజకానికి జరిగిన పూజలు చాలింక
రక్షణకై ఏర్పడ్డ బలగమే చేసే భక్షణ చాలింక"

అని 1946లో ఆ దురాగతాలు జరిగిన రోజుల్లోనే రాసిన గేయం.

రక్షణకై ఏర్పడ్డ బలగాలు రజాకార్లతో కలిసి ఏవిధంగా దురాగతాలు జరిపినాయో వివరాలకు 50 సంవత్సరాల తర్వాత చరిత్రగా సమకూర్చినాడు కృపాకర్. అప్పటికప్పుడు తాజాగా రాసిన, సభల్లో చదివిన 'నా గొడవ' ఆనాటి సంఘటనలపై ఎప్పటికప్పుడు చేసిన రన్నింగ్ కామెంట్రీ. (ప్రత్యక్ష వ్యాఖ్యానం).

ఆనాడు జరిగిన వాస్తవ సంఘటనలన్నింటిలో నాకు ప్రత్యక్ష సంబంధమున్నది. ఇత్తెహాదుల్ ముసల్మీన్ తలపెట్టిన S.C. వర్గాల మతాంతరీకరణ, దానికి ఆనాటి ప్రభుత్వ పరోక్ష తోడ్పాటు, దాన్ని ఆర్య సమాజం ఎదుర్కొన్న తీరు మొదలగునవి ప్రధానంగా గమనించాల్సిన సంఘటనలు. ఆ విషయంలో కృపాకర్ ఇచ్చిన వివరాలు, చేసిన హెచ్చరిక గమనించదగినది. ఆర్య సమాజ నాయకుడు బలదేవ పతంగేతోపాటు నేను పెండ్యాల రాఘవరావు ఇంకా కొంతమంది మిత్రులు ప్రత్యక్షంగా పాల్గొన్నాం. వరంగల్ తాలూకా పల్లగుట్ట, రాజారాం గ్రామాల్లో ఇత్తెహాదుల్ ముసల్మీన్ వారు ఇస్లాం మతం స్వీకరింపచేసిన S.C. వర్గాలను తిరిగి శుద్ధి కార్యక్రమం నిర్వహించి హిందూ సమాజంలో చేర్చినాము. ఇటువంటి సంఘటనలు హైదరాబాద్ రాష్ట్రమంతటా జరిగినాయి. ఈ విషయంలో కృపాకర్ రాసిన చరిత్రకు ఓవిధంగా నేను ప్రత్యక్ష సాక్షిని. S.C. లను మత మార్పిడి చేసే ఈ కార్యక్రమం కన్నా ప్రమాదకరమైనది, చెన్న బసవేశ్వర అవతారాన్ని అని చెప్పుకుంటూ 'దీన్‌దార్' నాయకుడు (సిద్దిఖీదీన్‌దార్) చేపట్టిన కార్యక్రమం మరీ ప్రమాదకరమైంది. వరంగల్, నల్లగొండలో జరిగిన సంఘటనలే రాష్ట్రమంతటా జరిగినవి. అన్నిచోట్ల ఆ దురాగతాలను ఎదిరించడానికి ప్రజా ఉద్యమాలు సాగినవి. ఆ దురాగతాలను ఎదుర్కొన్న శక్తులలో ఆర్య సమాజం ముఖ్యాతి ముఖ్యమైంది. ఆ వివరణే కృపాకర్ రాసిన చరిత్ర.

ఈ చరిత్ర రాయడానికి, ఆధారాల కోసం ఎన్ని చారిత్రక గ్రంథాలను చదివినాడో ఆయన ఉపయుక్త గ్రంథసూచిక చూస్తే తెలుస్తుంది. ఆనాటి ప్రధాన మంత్రి పార్లమెంటులో చేసిన ప్రకటనలు హోంమంత్రి సర్దార్ వల్లభాయి పటేల్ అధీకృత ప్రసంగాలు ఇటు ఖాసీం రజ్వీ ప్రగల్భాలు, నైజాం రాజు ప్రభుత్వ పక్షపాత పూరిత చర్యలు .... ఈ చరిత్రలో వివరంగా .... ఆధారాలతో ఇవ్వబడ్డాయి. రచయిత కృపాకర్ ఈనాటి తరానికి ఆర్యసమాజం చేసిన కృషిని, ప్రజలలో అది కలిగించిన చైతన్యాన్ని సవిస్తరంగా ప్రామాణికంగా తెలియజేసినారు. అతనికి నా అభినందనలు.

నిజాం రాజ్యంలోని ఆర్య సమాజ నాయకుల, ప్రచారకుల పోరాట సైనికుల సాహసకృత్యాలు వర్ణనాతీతం. వారి ధైర్యసాహసాలు, ప్రమాదకర పరిస్థితులల్లో కూడా సమాచారం సేకరించి కేంద్ర ప్రభుత్వానికి అందజేసిన సంఘటనలు ఈనాడు మనం నమ్మలేకున్నా అవి వాస్తవాలు. వాటన్నింటి వివరం తెలుసుకోవాలనే ప్రతి భారతీయుడు చదువదగిన పుస్తకం కృపాకర్ రచించిన ఈ చరిత్ర.

మరోసారి రచయిత కృపాకర్‌ను మనసారా అభినందిస్తూ.

(కాళోజి నారాయణరావు)

27-7-2001
నక్కల గుట్ట
హనుమకొండ
వరంగల్.

# శుభాకాంక్షలు

ది. 25-5-2001
వరంగల్.

**భండారు సదాశివరావు,**
రాష్ట్రీయ అధ్యక్షులు
అఖిల భారతీయ సాహిత్య పరిషత్.

శ్రీ నందనం కృపాకర్‌గారు నాకు చిరకాలంగా తెలిసిన యువమిత్రులు. అతడు నిత్య అధ్యయన శీలి, విషయసేకర్త. తాను చదివింది నల్గురికి వినిపించి, జ్ఞానాన్ని పంచాలనే కోరిక గలవాడు. ఆ కోరిక ఫలంగానే హైదరాబాద్ సంస్థాన చరిత్రను “నిజాం రాజు అధికారం అంతమైనరోజు” అనే పేర సమకూర్చారు. ముఖ్యంగా ఆర్యసమాజ పాత్రకు ఈ పుస్తకంలో విశేష స్థానం ఉన్నది.

ఆర్య సమాజమేకాక, హిందు మహాసభ, రాష్ట్రీయ స్వయం సేవక సంఘ సభ్యులు, కాంగ్రెస్ తదితర సంస్థలు, నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో అహోరాత్రులు కష్టించినవాళ్ళే. అందులో ప్రజల మనోబలాన్ని, పోరాటశక్తిని, గ్రామ గ్రామాలకు, అన్ని వర్గాల్లోకి తీసుకొని వెళ్ళిన ఘనత ఆర్యసమాజానికే దక్కింది. నిజాం పరిపాలనలో, ప్రతి ముస్లింరాజు కాలంలో జరుగుతూ వచ్చినట్లుగానే మత విద్వేషం విషంలా వ్యాపించింది. మతం మార్పిడులు సహస్ర ముఖాల సాగుతుండేవి. నిజాం దర్బారులో, ప్రభుత్వంలో ఉద్యోగాలకు బిరుదులకు, పదవులకు, అధికారాలకు ప్రాకులాడే ప్రముఖ వర్గాలు స్వదేశ వేషభాషలు కూడా మార్చుకొని అదొక దర్పానికి, హోదాకు చిహ్నంగా భావిస్తుండేవారు. హిందువుగా బహిరంగంగా చెప్పుకోవడానికి సిగ్గుపడేవారు.

అలాంటి సందర్భంలో ఆర్య సమాజం, హిందూ మహాసభ ముఖ్యంగా నాటి హైదరాబాద్ సంస్థానంలో గణనీయమైన సాహస పాత్రను నిర్వహించాయి. అదొక చరిత్ర మాత్రమేకాదు జీవన్మరణ పోరాటగాథ.

ఈ విషయానికి సంబంధించిన అనేక పుస్తకాలు ఇదివరకే వెలుగులోకి వచ్చాయి. ఆ కాంతి రేఖల్లో ఈ గ్రంథం కూడా ఒకటిగా చేరుతుంది. నిలుస్తుంది. పరమేశ్వరుడు శ్రీకృపాకర్ కలంలో నిరంతరశక్తిని నింపుతూ, ఆశీర్వదిస్తూండాలని ప్రార్థిస్తున్నాను.

భండారు సదాశివరావు.

**కొత్తపల్లి జయశంకర్**
మాజీ వైస్ చాన్సలర్
కాకతీయ విశ్వ విద్యాలయం

4-8-112 కుమార్‌పల్లి
హనుమకొండ
506011
ఫోన్ : 08712 - 573822

ఈ పుస్తకం పేరు : నిజాం రాజు అధికారం అంతమైన రోజు.

ప్రధానాంశం : హైదరాబాద్ సంస్థాన విమోచనోద్యమంలో ఆర్యసమాజ్ పాత్ర.

సారాంశం : రాచరికం పోయినా వ్యవస్థ మారలేదు ; స్వతంత్రం వచ్చినా వెనకబాటుతనం పోలేదు చివరికి తెలంగాణా ప్రజలకు వంచనే మిగిలింది.

హైదరాబాద్ సంస్థాన విమోచనోద్యమంలో ఆర్యసమాజ్ నిర్వహించిన పాత్రతోపాటు, ఆనాటి సామాజిక, రాజకీయ, సాంస్కృతిక విషయాల గురించి సోదాహరణంగా వివరించినారు శ్రీ నందనం కృపాకర్ గారు. రచయిత వర్ణించిన నాటి స్థితిగతులతో నేటి పరిస్థితులను బేరీజు వేసి చూస్తే, నిజాం పాలన అంతంతో ఆనాడు తెలంగాణా ప్రజలు ఆశించిందేమిటో ఈనాడు వారికి మిగిలిందేమిటో అర్థమవుతుంది.

ఉదాహరణకు :

నాడు : ఉద్యోగస్తులు, అధికారులు, అత్యధికంగా ముస్లింలే. అది మతం పేరుతో ఆనాడు జరిగిన వివక్ష.

నేడు : ఉద్యోగస్తులు, అధికారులు అత్యధికంగా స్థానికేతరులే. ఇది నేడు ప్రాంతాల పేరుతో జరుగుతున్న వివక్ష.

నాడు : అనుమతి లేకుండా సభలు సమావేశాలు నిషిద్ధం. అది ఫ్యూడల్ వ్యపస్థలో జరిగింది కనుక ఆశ్చర్యపడవలసిందేమి లేదు.

నేడు : తెలంగాణా నలుమూలలో, ప్రత్యేకించి గ్రామీణ ప్రాంతాలలో సభలు సమావేశాల సంగతి అటుంచి, మాట్లాడే స్వేచ్ఛ కూడ లేదు. ఇది ప్రజాస్వామ్య వ్యవస్థ ముసుగులో నడుస్తున్న వ్యవహారం. ఎంత విడ్డూరమైనదో అంతే విచారకరమైన పరిస్థితి.

నాడు : తెలుగు భాషను, హిందువుల ఆచార వ్యవహారాలను అవహేళన చేయటం.

అవి ఉర్దూ అధికార భాషగా చలామణి అయిన రోజులు. వంశ పారంపర్యంగా మైనారిటీ వర్గానికి చెందిన ఒకే కుటుంబానికి రాజ్యాధికారం సంక్రమించిన వ్యవస్థ.

నేడు : తెలంగాణా భాష, యాస, నుడికారం, ఇక్కడి కట్టు, బొట్టు, ఆచార వ్యవహారాలు అవహేళనకు గురి అవుతున్నాయి. ఇవి తెలుగు అధికార భాషగా ఉన్న విశాల తెలుగు రాష్ట్రంలో, తెలంగాణా తెలుగువారికి ఇతర ప్రాంతాల తెలుగు 'సోదరులతో, ప్రజాస్వామ్యం పేరుతో రాజ్యాధికారాన్ని అనుభవిస్తున్న "తెలుగు వల్లభుల" సమ్మతిలో, ప్రతిరోజు ఎదురయ్యే అవమానాలు, అవహేళనలు.

నాడు : వందేమాతరం అనటంపై నిషేధం / స్వాతంత్ర్యానికి పూర్వం హైదరాబాదుతోపాటు దేశమంతటా ఇదే పరిస్థితి ఉండేది. అయినా ప్రజలు ఈ నిషేధాన్ని ఉల్లంఘించకలిగారు.

నేడు : రాష్ట్ర శాసనసభలో, ప్రజా ప్రతినిధులు 'తెలంగాణ' అనే పదాన్ని వాడరాదని సభాపతి రూలింగ్. ప్రజాపతినిధులు కిమ్మనలేదు. నాటి ఫ్యూడల్ వ్యవస్థకు నేటి ప్రజాస్వామ్య వ్యవస్థకు ఏమిటి తేడా ?

నాడు : వార్తాపత్రికలు మత విద్వేషాన్ని పెంచేవి. అది పూర్వ ఫ్యూడల్ వ్యవస్థ కదా, ఎక్కడైనా అలాగే జరిగేది.

నేడు : ప్రాంతీయ వార్తా పత్రికలు ప్రసార సాధనాలన్ని తెలంగాణా వ్యతిరేక ప్రచారానికి ప్రధాన ఆయుధాలు. తెలంగాణాను సమర్థించే వార్తలు వాటికి గిట్టవు. తెలంగాణాను వ్యతిరేకించే వార్తలు మాత్రం పతాక శీర్షికలలో దర్శనమిస్తాయి. ఇది ప్రజాస్వామ్య వ్యవస్థలో తెలంగాణాకు సంక్రమించిన గౌరవం.

నాడు : నగరాలకు, వీధులకు, సంస్థలకు ఒకే మతానికి చెందిన ప్రముఖుల పేర్లు పెట్టి ఇతర మతస్తులపై జరిగిన సాంస్కృతికదాడి రాచరిక వ్యవస్థలో, ఫ్యూడల్ సంస్కృతిలో ఇటువంటి సంఘటనలు ప్రపంచ వ్యాప్తంగా జరిగినవి.

నేడు : "మతం" అనే పదానికి బదులు 'ప్రాంతం' అనే పదాన్ని వాడితే చాలు. తెలంగాణా ప్రాంతంపై ఇప్పుడు జరుగుతున్న దాడి ఎంత దారుణంగా ఉన్నదో తెలుస్తుంది.

హైదరాబాద్‌లో వాడలకు, సంస్థలకు పెట్టిన పేర్లు : సంజీవరెడ్డి నగర్, పొట్టి శ్రీరాములు నగర్, వెంగళరావు నగర్, సంజీవయ్య పార్క్, బ్రహ్మానందరెడ్డి పార్కు, అయ్యదేవర కాళేశ్వరరావు భవన్, సుందరయ్య విజ్ఞాన కేంద్రం, మాకినేని బసవపున్నయ్య భవనం, యన్.టి.ఆర్. ఘాట్, యన్.టి.ఆర్. విమానాశ్రయం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, ఆచార్య యన్.జి.రంగా వ్యవసాయ విశ్వ విద్యాలయం ... ఇంకా ఎన్నో ! ఇందులో తెలంగాణా వారెవరు ? ఈపాటి ఘనులు తెలంగాణాలో ఎవరు పుట్టనే లేదా ?

అదే విధంగా విగ్రహాల కొస్తే : టంగుటూరి ప్రకాశం, పొట్టి శ్రీరాములు, దామోదరం సంజీవయ్య, కాసు బ్రహ్మానంద రెడ్డి, యన్.టి. రామారావు, పుచ్చలపల్లి సుందరయ్య ... ! ఇంకా ఎన్నో !

తెలంగాణాకు చెందిన ప్రముఖులు ఎవరికి జ్ఞాపకమే లేరు. బూర్గుల రామకృష్ణారావు, షోయె బుల్లాఖాన్, కొండా వెంకట రంగారెడ్డి, రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల కమలాదేవి ; ఇంకా ఎందరో మహానుభావులు, అందరినీ మరచిపోయాం. ఇక టాంక్‌బండ్‌పై చూస్తే శ్రీశ్రీ, జాషువా విగ్రహాల వరుసలో దాశరధి కృష్ణమాచార్య, వట్టికోట ఆళ్వార్ స్వామి విగ్రహాల నుంచాలనే సంస్కారం గూడ లేకుండా పోయింది మన తెలుగు సాహితీ ప్రియులకు. అల్లూరి సీతారామరాజుతో పాటు కొమురం భీం విగ్రహం కూడ లేకపోతే ఒక విప్లవవీరుణ్ణి అగౌరవ పరిచినట్లవుతుందనే ఇంగిత జ్ఞానం కూడా లేకుండా పోయింది. త్రిపురనేని రామస్వామి చౌదరిని మించిన మహానుభావులు తెలంగాణాలో ఎంతమంది పుట్టలేదు ?

తెలంగాణా మొత్తంలో యన్.టి.ఆర్. విగ్రహం లేని నగరం లేదు. పిల్ల కాలువల నుండి విమానాశ్రయాల దాక ఎక్కడ చూసినా ఆయన పేరు పెట్టని సంస్థే లేదు.

తెలుగు జాతి గౌరవాన్ని పెంచే మిషతో తెలంగాణా చరిత్ర సంస్కృతి, వారసత్వంపై ఇతర ప్రాంతపు తెలుగువారు చేస్తున్న దాడి ఇది. ఇదంతా ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజా ప్రతినిధులుగా చలామణి అవుతున్న పాలకుల ఆదరణ, ప్రోత్సాహంతో జరుగుతున్న 'దురాక్రమణ'.

ఇవన్నీ కేవలం మచ్చు తునకలు మాత్రమే. ఈ విధంగా రాస్తూపోతే ఒక ఉద్గ్రంథం తయారవుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే తెలంగాణా ప్రజలు నిజాం కాలంలో మాద్చే పెంకుపై ఉంటే ఆంధ్రప్రదేశ్‌లో మండే పొయ్యిలో పడినట్లయింది.

శ్రీ నందనం కృపాకర్ గారు రచించిన ఈ పుస్తకం, పాఠకుల నొకసారి చరిత్ర పుటల్లోనికి తీసుకుపోతుంది. గతాన్ని, వర్తమానంతో పోల్చి చూస్తే చరిత్ర ఎలా పునరావృతమవుతున్నదో అర్థమవుతుంది. అందుకే ఈ ప్రయత్నం. శ్రీ కృపాకర్ గారు ఇంకా ఇటువంటి గ్రంథాలు రాయాలని ఆశిస్తూ, వారికి నా శుభాకాంక్ష లందిస్తున్నాను.

(కె. జయశంకర్)

గత చరిత్ర పూర్వ వైభవం మహా పురుషుల విజయ పరంపరలను విస్మరించిన జాతి క్రమేపీ అది తన అస్తిత్వము, ఉనికిని కోల్పోయి కాల గర్భములో సమసిపోవుననుటలో ఎట్టి సందేహం లేదు. నేడు ప్రపంచంలో ఎన్నో జాతులు గత చరిత్రను విస్మరించుట వలన అవి సంపూర్ణముగ తమ అస్తిత్వమును కోల్పోయినవి.

దాదాపు పన్నెండు వందల సం॥రముల పాటు భారతదేశ ప్రజలు పరాయి పాలనలో అన్య పాదాక్రాంతమై తన స్వరూపమునే మర్చి దయనీయ స్థితిలో నిర్వీర్యమై జీవచ్ఛవంలా పడియున్ననాడు భారతీయ సంతతి హిందూ సమాజానికి పట్టిన దుర్గతిని గాంచి మహర్షి స్వామి దయానందులవారు దుఃఖితులైరి. నిర్వీర్యమై అవసాన దశకు చేరిన హిందూ సమాజాన్ని వెన్నుతట్టి లేపి పౌరుషాగ్నిని రగిలించారు. "ఎన్నటికిని విదేశీయుల రాజ్యము శిరోధార్యము కాజాలదని" ఘంటాపథంగా చెప్పిన ధీశాలి. అతని ద్వారా స్థాపింపబడిన ఆర్యసమాజం దేశ స్వాతంత్ర్య పోరాటానికి స్వధర్మ రక్షణకు చేసిన కృషి అమోఘము. అపారము.

హైదరాబాదు సంస్థానములో నూటికి తొంభై శాతం మెజారిటీ ప్రజానీకమైన హిందూ ప్రజలు శాంతి కాముకలు. వారిపైన మత దురహంకారియైన నిజాం నవాబు నిరంకుశ పరిపాలన, నీతి బాహ్య శాసనముల ద్వారా హిందువులాచరించే పండుగల పైన కూడ ఆంక్షలు విధించాడు. ఆనాడు వారి జాగీరుదార్లు, రజాకార్ల దోపిడీ దౌర్జన్యాలకు, నానా కిరాతకాలకు గురియై దయనీయ స్థితిలో పడియున్న స్థితిని గాంచి నాడు ఆర్యసమాజం యావత్ హిందూ సమాజానికి తోడుగ నిలచి వారిలో మనో ధైర్య సాహసములు రగిలించి నిజాం నవాబు నిరంకుశ పాలనకు వ్యతిరేకముగా హిందువుల ధార్మిక స్వాతంత్ర్యానికి, జాతి పరిరక్షణకు 'ఆర్య సత్యాగ్రహం నిర్వహించి' విజయం సాధించింది.

నాటి చారిత్రక ఘట్టాలను నేటి యువతరానికి అందించుటకు యువ రచయిత శ్రీ నందనం కృపాకర్ "నిజాం నవాబు అధికారం అంతమైన రోజు" అను పుస్తక రచన ద్వారా ఆనాటి స్థితిగతులు, ఉద్యమ పోరాట ఘట్టములను

పాఠకుల కందించటానికి సమగ్రముగా కృషిజేసాడు. తన ఉపోద్ఘాతములో చరిత్ర అంతగా చదవటం అలవాటు లేని కొత్త తరాలకు నాటి చరిత్ర చెప్పటం అవసరం లేదనుకునే నేటి ప్రభుత్వ విద్యావ్యవస్థకు ... ఇదంతా తెలియదని" తన ఆవేదనను వ్యక్తపరిచాడు. తెలుగు ప్రజలు విశేషముగా నేటి యువతరం ఈ చారిత్రక సత్యాన్ని గ్రహించవలసియున్నది. ..... గతాన్ని అవగతం చేసుకొని చరిత్ర పుటల నుండి గుణపాఠాల్ని నేర్చుకుని, భవ్యమైన భవిష్యత్తుకు బాటలు వేయాలని రచయిత ప్రబల ఆకాంక్ష. వారి ఆకాంక్ష సఫలీకృతము కావాలని కాంక్షిస్తున్నాము.

ఆర్. రామచంద్ర ఆర్య
సంపాదకులు
ధర్మధ్వజం మాసపత్రిక
సికింద్రాబాద్, హైద్రాబాద్.

# కృతజ్ఞతలు

అనుకోకుండా ఒకరోజు మానాన్న (డా॥ నందనం సత్యం) గారితో ఒక మహనీయుని ఇంటికి వెళ్ళాను. ఆమాట ఈ మాటలైన పిదప ఎందుకో మా మాటలు సామాజికాంశాల వైపు మళ్ళాయి. నిజాంతో ఆర్య సమాజ పోరాటంపై సుదీర్ఘంగా చర్చ జరిగింది. వారి గతానుభవాలు ఎన్నో మాకు చెప్పారు. నేనన్నాను ఇంతటి స్ఫూర్తిదాయకాంశాలు నేటి తరాలకోసం అందించడానికి మీరేమైనా ఆలోచించారా? అని. నేను జర్నలిజం చేసానని అప్పటికే కొన్ని పుస్తకాలు ప్రచురించానని తెలిసిన ఆయన వెంటనే ఇలా నన్ను ప్రశ్నించారు. మేము వృద్ధులమైనాము ఆ పని యువకుడివైన నీవే ఎందుకు చేయకూడదు, అంతే వారి ఆవేదనాపూరిత, ఆవేశ పూరిత వాక్యాలు నన్ను ఉత్తేజితుణ్ణి చేసాయి. ఆయనే శ్రీ వందేమాతరం రాంచంద్రరావు గారు.

గత నాలుగైదు సంవత్సరాల నుండి పలుసార్లు నాకు ఇంటర్వ్యూలు ఇవ్వడమేకాక ఈ గ్రంథరచన చేయడానికి కారణభూతులైన శ్రీ వందేమాతరం రాంచంద్రరావుగారికి,

నేను అడగ్గానే అనారోగ్యంగా ఉన్నా, నా మీద ఉన్న అవ్యాజానురాగం వల్ల, ఈ పుస్తకాన్ని ఆసాంతం చదివి, తమ అమూల్యాభిప్రాయాన్ని రాసి ఇచ్చిన శ్రీ భండారు సదాశివరావు (రాష్ట్రీయ అధ్యక్షులు జాతీయ సాహిత్య పరిషత్ వరంగల్) గారికి,

ఎనభై ఏళ్ళ పైబడ్డ నవ యువకులు పద్మశ్రీ కాళోజి నారాయణ రావు గారు ఎంతో ఓపిక తెచ్చుకుని పుస్తకాన్ని చదివి. నాతో పలు విషయాలు చర్చించి, తమ అమూల్యమైన అభిప్రాయాన్ని ఇచ్చినందులకు వారికి,

నేను కోరగానే ఈ పుస్తకాన్ని పరిశీలించి నాటి పరిస్థితులను నేటి పరిస్థితులతో పోలుస్తూ తమ అభిప్రాయాన్ని రాసి ఇచ్చిన శ్రీ కొత్తపల్లి జయశంకర్, మాజీ వైస్ ఛాన్సలర్, కాకతీయ విశ్వవిద్యాలయం వరంగల్ గారికి,

అలాగే నేను కోరగానే ఈ గ్రంథాన్ని నిశితంగా పరిశీలించి నాడు ఆర్య సమాజం చేసిన అవిరళ కృషిని ఉటంకిస్తూ..... తమ అమూల్య అభిప్రాయాన్ని రాసి ఇచ్చిన శ్రీ రాంచంద్ర ఆర్య ధర్మధ్వజం పత్రిక సంపాదకులు, ప్రధాన కార్యదర్శి సికింద్రాబాద్ ఆర్యసమాజం గారికి, నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

అలాగే నా గ్రంథ రచనలో, రచనాకాలంలో ప్రత్యక్షంగా పరోక్షంగా నాకు ఎంతగానో సహకరించిన నా తల్లితండ్రులు, సోదరులు, నా ధర్మపత్ని, మా పాప శ్రీతేజ, మిత్రులు ఇలా ఎందరో.... వారందరికి పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఈ గ్రంథాన్ని మరింత ఉపయుక్తంగా రూపొందించడానికి పాఠకులు చేసే సూచనలు, సలహాలు ఎల్లప్పుడు కృతజ్ఞతతో స్వీకరిస్తాను.

రచయిత.

# అంకితం

నిజాంల నికృష్ట చేష్టల్ని శతాబ్దాల పాటు సహించి

మహర్షి దయానందుని అనుయాయుల పిలుపుకు స్పందించి

వర్ణనా తీతమైన కష్టాల్ని, నష్టాల్ని భరించి

అమితమైన ధైర్యసాహసాల్ని ప్రదర్శించి

తమ తను మన ధన ప్రాణాలర్పించి

మనకందని ద్రాక్షగానే ఉన్న స్వాతంత్ర్యాన్ని సాధించి

మనకిచ్చిన త్యాగమూర్తుల పాదపద్మాలను స్పృశించి

నేటి, భావి తరాలకు నేనందించే విపంచి

నియంత నిజాంతో పోరాడి, అమరులైన ఈ భూమి పుత్రులకు

అంకితం

# విషయ సూచిక


- ఉపోద్ఘాతము. 1
- హైదరాబాద్ సంస్థానం - చారిత్రక నేపథ్యం 5
- హైదరాబాద్ సంస్థానం - భౌగోళిక స్వరూపం 7
- భారత్‌కు నిజాంల రాక 9
- ఏడవ నిజాం నవాబు - అపర ఔరంగజేబు 11
- సాంస్కృతిక దురాక్రమణ 21
- దీన్‌దార్ ఉద్యమం 29
- రజాకార్ల దురాగతాలు 32
- విప్లవ జ్యోతి - చైతన్యదీప్తి 40
- నిజాంను నిలువరించిన తేజం - ఆర్యసమాజం 44
- ఆర్య సమాజికులపై నిజాం అత్యాచారాలు 51
- ఆర్య సత్యాగ్రహోద్యమంలోని ముఖ్యఘటనలు 54
- ఆర్యవీరుల బలిదానాలు 75
- ఆఖరి పోరాటం 77
- నీతి తప్పిన నిజాం 83
- క్రాంతి విస్ఫోటనం 88
- నిజాం ఆఖరి యత్నాలు 96
- సైనిక చర్య (ఆపరేషన్ పోలో) 98
- నిజాంరాజు గద్దెదిగిన రోజు 100
- అపరాధికి బహుమతి 104
- పండిత నరేంద్ర జీ - నరేంద్రమే 109
- వందేమాతరమైన వావిలాల రామచంద్రారావు 112
- ఉపసంహారం 117

# 1 ఉపోద్ఘాతము

ఆవేశాన్ని ఉత్తేజాన్ని కలిగించి, ఆత్మవిశ్వాసాన్ని ఇనుమడింపజేసేవే పూర్వ వృత్తాంతాలు. స్వాతంత్ర్య సముపార్జనా సమర ఘట్టాల్లో ఆఖరిది, మన హైదరాబాద్ స్వాతంత్రోద్యమం. హైద్రాబాద్ సంస్థాన ప్రజానీకానికి 1947 ఆగస్టు 15న స్వాతంత్ర్యం రాలేదని, హైదరాబాద్ సంస్థానంలో మరో స్వాతంత్ర్య సమరం మహోధృతంగా కొన్ని దశాబ్దాలపాటు కొనసాగిందని, లక్షలాదిగా మనపూర్వజులు చేసిన అసమాన త్యాగాల ఫలంగా .......... 1947 ఆగస్టు 15 తర్వాత మరో పదమూడు నెలల రెండు రోజులు ఆలస్యంగా అంటే సెప్టెంబర్ 17, 1948న మనకు స్వాతంత్ర్యం వచ్చిందని మనలో ఎంత మందికి తెలుసు?

చరిత్ర చదవటం అంతగా అలవాటు లేని కొత్త తరాలకు, నాటి చరిత్ర చెప్పడం అవసరం లేదనుకునే నేటి ప్రభుత్వాలకు, విద్యావ్యవస్థకు, ఇదంతా తెలియదు కాని, అదంతా తెలంగాణా ప్రజానీకానికి వినేందుకే వళ్ళు జలదరిస్తుంది. ఇంద్రియాలు మొద్దుబారిపోతాయి.

1947 ఆగస్టు 15న యావద్భారతం (హైదరాబాద్ స్టేట్ తప్ప) బ్రిటీష్ వారి కబంధ హస్తాల నుండి విముక్తి నొంది ఆనందహేలలో ఓలలాడుతున్న అద్వితీయ క్షణాలలో ..... మన పూర్వజుల అమరత్యాగాలకు, అపూర్వశౌర్యాలకు ప్రతీకయైన జాతీయ పతాకాలు సర్వత్రా రెపరెపలాడు తుండగా..... ప్రభాతభేరీలతో... వందేమాతర గీతాలతో భారతమాతకు జయజయధ్వానాలు పలుకుతూ, ఆసేతు హిమపర్యంతం అమితంగా పులకించిపోతున్న ఆ తరుణంలో .....

హైదరాబాద్ సంస్థానం నిజాం నియంత యొక్క క్రూరపైశాచిక పదఘట్టనల క్రింద నలిగిపోతూ నిట్టూర్పులు విడుస్తోంది. నిజాం నిరంకుశ సేనల నికృష్ట చేష్టలు ఒకవైపు బహదూర్ యార్జంగ్, ఖాసీం రజ్వీ రాక్షస రజాకార్ మూకలు, దీన్‌దార్, బేల్చాహౌస్ ముఠాలు ఇంకొకవైపు పట్టి పీడిస్తుండగా....

బానిస సంకెళ్ళతో బ్రతుకలేక, చావలేక, జీవచ్ఛవంలా పడిఉన్నది నాటి మెజారిటీ ప్రజానీకమైన హిందూ సమాజం. హత్యాచారాలు, అత్యాచారాలు, వెట్టిచాకిరి, కట్టు బానిసత్వం, దోపిడీలు, దౌర్జన్యాలు, మతకల్లోలాలు, మతాంతరీకరణలతో 224 సంవత్సరాలపాటు కొనసాగిన సప్తనిజాంల నియంతృత్వ పాలనలో పైవన్నీ నిత్యకృత్యాలు.

పత్రికలపై నిషేధం, పండుగలపై నిషేధం, సత్సంగాలపైన నిషేధం, సమావేశాలపైన నిషేధం, పెళ్ళి ఊరేగింపుల కైనా చావు ఊరేగింపులకైనా .. అనుమతి తప్పనిసరి. మెజారిటీ హిందూ సమాజం తమ భాష, సంస్కృతులను, వేషాన్ని మార్చుకోవాల్సి వచ్చింది. ఆచార వ్యవహారాలు, పూజాపునస్కారాలు మానుకోవాల్సి వచ్చింది. ఇటువంటి విషమ, విపత్కర పరిస్థితుల్లో చిక్కుకుని నిర్వీర్యమై, నిస్తేజమై పడిఉన్న సమాజంలో జవసత్వాలను నింపి, సంఘటనను నిర్మించి, స్వాతంత్రేచ్ఛను కలిగించి, సమాజాన్ని సమరోన్ముఖులుగా చేసి, బానిస సంకెళ్ళనుండి బంధవిముక్తుల్ని చేయడానికి ....

1892 నుండే తన కృషిని ప్రారంభించింది ఆర్యసమాజం. ఆర్యసమాజం అందించిన స్ఫూర్తితోనే ..... పలు సంస్థలు, పలువురు వ్యక్తులు దీర్ఘకాలంగా కొనసాగుతున్న శోషణ నేపథ్యంలో, జనజాగరణకోసం తమ తమ పంథాలో కృషిని ప్రారంభించా(యి)రు.

- 'శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం' శ్రీ కొమర్రాజు లక్షణరావు ప్రోత్సాహంతో సెప్టెంబరు ఒకటి 1901 న మొదలైంది.

ఆ పిదప భాషావమానాన్ని సహించలేని కొందరు శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ కొండా వెంకటరెడ్డి గార్ల ఆధ్వర్యాన ఆంధ్ర జనకేంద్ర సంఘాన్ని స్థాపించారు. 1922 ఏప్రిల్ 4న.

1930లో ఆంధ్ర మహాసభ అవతరించింది. 1930 నుండి 1946 వరకు మొత్తం పదమూడు సభల్ని జరుపుకుంది. ఆపిదప ఆంధ్రమహాసభ చీలిపోయి మితవాదులు స్టేట్ కాంగ్రెస్ లోను, అతివాదులు కమ్యూనిష్టుల్లోను చేరారు. వేరు వేరుగా వేరు వేరు పంథాలలో ఉద్యమించారు. వీటితోపాటు యంగ్‌మన్ ఇంప్రూవ్‌మెంట్ సొసైటి, హిందూమహాసభ, హిందూ స్వయం సేవక్ సంఘ్,

హిందూసివిల్ లిబర్టీస్ యూనియన్, రైతు సంఘాలు వ్యాపారసంఘాలు, విద్యార్థి సంఘాలు ఇలా .... ఎన్నో సంఘాలు, ఎందరో వ్యక్తులు ఉద్యమాల్ని సాగించారు. అయితే పలు అంశాలపై దృష్టి సారించి బహుముఖీనంగా ఉద్యమాల్ని లేవదీసింది ఆర్యసమాజం. విద్య, వ్యాయామం, ఆలయ ప్రవేశం, కుల నిర్మూలన, అంటరానితన నిర్మూలన, గోహత్యా నిషేధం, జీవరక్షాసమితి జాతీయ భాషోద్యమం, స్వభాష, స్వధర్మ, స్వవేష ఉద్యమాలతో బాటు స్వీయరక్షణకై ఆర్యవీర్ దళాల నిర్మాణం, నిజాం కార్యకలాపాలపై నిఘా, హైదరాబాద్ సమస్యను జాతీయ సమస్యగా మార్చడం, యావద్భారతాన హైదరాబాద్ 'డే'ను జరుపడం, తొమ్మిది నెలలపాటు అతివిస్తృతంగా మహోధృతంగా ఆర్య సత్యాగ్రహాన్ని జరుపడం, నిజాం దిగివచ్చేట్లు చేయడం, రజాకార్ల దోపిడీని ఎదుర్కోవడం, భారతప్రధాని, ఉపప్రధానులకు విషయావగాహన కలిగించడం, భారతీయ ఏజెంట్ శ్రీమున్షీకి అన్ని విధాల సహకరించటం, ఆయుధాలు చేపట్టడం, ఆఖరికి నిజాం హత్యకు ప్రయత్నించడం,, సరిహద్దు క్యాంపులు నిర్వహించడం, పునరావాస శిబిరాలు నెలకొల్పడం, జాతీయ పతాకాలు ఆవిష్కరించడం, ఆఖరున భారత యూనియన్ సేనకు ఇక్కడ పూర్తిగా సహకరిస్తూ మార్గదర్శనం చేయడంతో పాటుగా ....

నిజాంపాలనకు చరమగీతం పాడిన పిదప మతాతీతంగా హైదరాబాద్‌లో శాంతిస్థాపనకు విస్తృతంగా ప్రయత్నించడం ఇలా .. ఆర్యసమాజం సర్వస్పర్శి, సర్వవ్యాపిగా, సకలసమస్యల సాధనకై ఉద్యమించిన ఏకైక సంస్థ అనడంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు. సుదీర్ఘకాలం హైదరాబాద్ సంస్థానానికై విరామమెరుగక ఉద్యమించిన సంస్థ.

కీర్తికాంక్షకొరకు కాక సమాజహితం కోసం కాంగ్రెస్ లాంటి సంస్థలకు అడుగడుగున సంపూర్ణమైన సహకారం అందించిందీ సంస్థ. కాని కీర్తి కండూతితో వ్యక్తులూ, సంస్థలు ప్రచురించుకున్న సాహిత్యంలో ఆర్యసమాజం చేసిన కృషిని నామమాత్రంగా చిత్రించినా .... నాటి చరిత్రావగాహనా లోపంతో ఆర్యసమాజాన్ని మినహాయించి హైదరాబాద్ సంస్థానం గూర్చి రాసేవ్యక్తులు, ప్రచురించే పత్రికలున్నా... ఉద్యమ క్రెడిట్ అంతా మాదే అని స్వంత డబ్బా కొట్టుకునే

సంస్థలున్నా ....... ఇవన్నీ చూస్తూ మిన్నకున్నద
.. కాదన్నా సుదీర్ఘకాలం కొనసాగిన హైదరా
అసాంతం (1892 నుండి) సారధ్యం వహించి
సంస్థ ఆర్యసమాజమనే సంగతి చరిత్రను పరి

ఎలాగైతేనేం హైదరాబాద్ సంస్థాన
శంఖారావం నిజాంసేనల, రజాకార్ మూకల,
వంచకుల అరాచకాలకు అడ్డుకట్టవేసింది. ఉక్కు
పటేల్ సమయోచితమైన చొరవతో భార
కదంతొక్కాయి. సర్దార్‌పటేల్ హెచ్చరిక నిజాం
సెప్టెంబర్ 13 నుండి 17 వరకు నలు మూలల
నాలుగే నాలుగు రోజుల్లో నిజాం సేనల, రజ
మదమడచింది. గత్యంతరం లేని పరిస్థితుల్లో హై
చేసాడు నిజాం.

హైద్రాబాద్ సంస్థాన స్వాతంత్ర్య ప్రదా
ధైర్యసాహసాలు ప్రదర్శించిన భారతసైన్యం చే
ముగిసింది. ఉద్యమలక్ష్యం నెరవేరింది. తర
రాజుల ఏడుతరాల శనిపీడ విరగడైంది. రెం
స్వేచ్ఛావాయువుల్ని తనివితీరా ఆస్వాదించి, ప
పావనమైంది సంస్థానప్రజానీకం.

మనపూర్వుల అసమానత్యాగాల ఫల
ఫలాల్ని అనుభవిస్తున్న మనం, గతాన్ని అవ
నుండి గుణపాఠాల్ని నేర్చుకుని, భవ్యమైన
నడిపించే దిశలో మన ప్రయత్నాన్ని కొనసాగిం
ఘటించే నిజమైన శ్రద్ధాంజలిగా భావిస్తూ .....
చూపినట్లుగా .....

నాశక్తి సామర్థ్యాల మేరకు ప్రయత్నించి లభ్యమైన సమాచారాన్ని ఇందులో పొందుపరిచాను. ఈ నాకృషి ఒక విభిన్నమైన కోణంలో కొనసాగింది. (వినూత్నతను సంతరించుకున్నది.) అయితే అనేక ముఖ్య సంఘటనలు, దేశభక్తులు నిర్వహించిన పాత్ర, అమరవీరులపేర్లు, నాస్మృతి పథానికి అందియుండక పోవచ్చును. కనుక అటువంటి సమాచారం మున్ముందు నాదృష్టికి వచ్చినా, ఎవరైనా తెచ్చినా, సలహాలు, సూచనలు చేసినా మలిముద్రణలో మార్పులు చేర్పులు చేయడానికి ఆస్కారం కలుగు తుందని సవినయంగా తెలుపుకుంటు సెలవు తీసుకుంటున్నాను.

.....రచయిత




నేటి తరానికి హైదరాబాద్ తప్ప హైదరాబాద్ సంస్థానమంటూ ఒకటి ఉండేదని, అందులో మన పూర్వజులు 'దినదినగండం - నూరేళ్ళ ఆయుష్షు' గా, కట్టు బానిసల కంటే కడుహీనంగా నికృష్టమైన జీవనం గడిపారని, ఆగస్టు 15, 1947న మనకు స్వాతంత్ర్యం రాలేదని, మన స్వేచ్ఛకోసం మరోస్వాతంత్ర్య సమరం కొనసాగిందనే విషయాలు (అంతగా) తెలియవు.

లక్షలాది మంది త్యాగధనుల అవిరళ కృషి వలన, వేలాది మంది ప్రాణార్పణల వలన దాదాపు పదమూడునెలల రెండురోజుల ఆలస్యంగా.... 1948 సెప్టెంబర్ 17న మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. ఐదు దశాబ్దాలపాటు కొనసాగిన హైదరాబాద్ సంస్థాన పోరాటాన్ని అర్థం చేసుకోవడానికి మనం ఓ ఐదు శతాబ్దాల కాలం చరిత్రలో వెనక్కి వెళ్ళాలి.

గోలకొండ రాజ్యమేర్పడిన పిదప 1518లో అది కులీకుతుబ్షా ఆధీనం లోకి వెళ్ళింది. 1867 వరకు కుతూబ్‌షాహీల పాలన కొనసాగింది. చార్మినార్,

హుస్సేన్‌సాగర్, మూసీనదిపైన వంతెన (పురానాపూల్), మక్కామసీద్ తదితర నిర్మాణాలు అప్పుడు జరిగినవే. కాలక్రమంలో భాగ్యనగర్ హైదరాబాద్‌గా మారింది.

1687లో ఔరంగజేబు గోలకొండ రాజ్యాన్ని జయించి తన రాజ్యంలోని దక్కన్ సుబాలో కలుపుకున్నాడు. ఔరంగాబాద్ దక్కన్ కేంద్రంగా (వింధ్యకు దక్షిణప్రాంతం) సుబేదార్ పాలనలోకి వచ్చింది. దీనితో కుతూబ్‌షాహీల పాలన ముగిసింది. 1713లో దక్కన్ ప్రాంత సుబేదారుగా నిజాం-ఉల్-ముల్క్ -అసఫ్‌జాహి నియమితుడైనాడు.

1707లో ఔరంగజేబు మరణించడంతో మొగల్ సామ్రాజ్య పతనం ప్రారంభమైంది. సైన్యాధిపతులు సుబేదారులు వీలయిన ప్రాంతాలన్నిటా స్వతంత్రం ప్రకటించుకున్నారు. ఆతరుణంలోనే దక్కన్ సుబేదారుగా ఉన్న నిజాం ఉల్‌ముల్క్ చక్రవర్తికి విధేయుడుగా తనను ప్రకటించుకున్నాడు. కాని ఆపిదప 1724లో నిజాం స్వతంత్రతను ప్రకటించుకున్నాడు. అప్పటినుండి **అంటే 1724 నుండి 1948 వరకు దాదాపు 224 సంవత్సరాలపాటు హైదరాబాద్** సంస్థానంలో నిజాంల ఆటవిక పాలనను ప్రజలు భరించాల్సి వచ్చింది. ఏడుగురు నిజాంలు ఈ సంస్థానాన్ని పాలించినారు. అడపాదడపా, అనుకోకుండా పొరపాటున చేసిన ఒకటి రెండు మంచి పనులు తప్ప ప్రత్యేకంగా విశాల దృక్పధంతో చెప్పుకోదగిన స్థాయిలో చేసిన ప్రజాహితాంశాలు అంటు పెద్దగా వీరిపాలనలో కనిపించవు.

ఏడవ నిజాం అయిన మీర్ ఉస్మాన్ అలీఖాన్ మరీ విజృంభించి పాలించాడు. అత్యధిక ప్రజానీకంగా ఉన్న హిందూ ప్రజానీకాన్ని క్రూరంగా హింసించాడు. అందమైన స్త్రీల మానాల్ని దోచడం, అనేకుల్ని అవమానాలకు గురిచేయడం, అనవసరంగా ప్రాణాలు తీయడం ప్రాతిపదికన కొనసాగిన ఈయన పాలన ఔరంగజేబును మించిపోయింది. దుర్భరమైన ఆ పరిస్థితుల్లో, అంటే 1892లో అంధకార బంధురంలో అచేతనంగా పడిఉన్న ప్రజానీకాన్ని ఉద్ధరించేందుకు ఆవిర్భవించిన సంస్థ ... నాటి చీకట్లను చీల్చిన తేజం - ఆర్యసమాజం.

# 3 హైదరాబాద్ సంస్థానం-భౌగోళిక స్వరూపం

హైదరాబాద్ సంస్థానం భారతదేశంలోని సంస్థానాలన్నింటికన్నా పెద్దది. దీని విస్తీర్ణం 82, 698 చ॥ మైళ్ళు. జనాభా ఒకకోటి ఎనభైలక్షలు. ఇందులో తెలంగాణా వైశాల్యం 49,502 చ॥ మైళ్ళు. మొత్తం జనాభాలో ఒకకోటి వరకు తెలుగువారుండేవారు. 50 లక్షలు మరాఠీలు, 20 లక్షలు కన్నడీలు, కేవలం పదిలక్షల మంది ముస్లింలుండేవారు.

హైదరాబాద్ సంస్థానాన్ని మూడు భాషాప్రాంతాలుగా విభజించ వచ్చు. (1) వరంగల్ (2) ఖమ్మం (3) కరీంనగర్, (4) ఆదిలాబాద్ (5) ఇందూరు (నిజామాబాద్) (6) మెదక్ (7) పాలమూర్ (మహబూబ్‌నగర్) (8) అత్రాఫ్‌బల్దా (రంగారెడ్డిజిల్లా) అనే ఎనిమిది జిల్లాలు తెలుగువారితో కూడిన తెలంగాణ మొదటిభాగం. ఔరంగాబాద్, బీడ్, పర్భనీ, నాందేడ్, ఉస్మానాబాద్ అనే ఐదు జిల్లాలు మరాట్వాడాగా పిలువబడే రెండవభాగం. రాయచూరు, గుల్బర్గా, బీదరు, అనే మూడు కర్నాటక జిల్లాలు మూడవ భాగం. వెరసి హైదరాబాద్ సంస్థానం.

నిజాం హైదరాబద్ సంస్థానాధిపతి మాత్రమేకాదు. ఒకపెద్ద జాగీర్దారు కూడా. ఈయన స్వంత జాగీరును సర్ఫేఖాస్‌గా పిలిచేవారు. దీని వైశాల్యం 8,100 చ ॥ మైళ్ళు. అంటే దాదాపుగా 5 లక్షల 30 వేల ఎకరాల భూమి, ఇందులో నేటి రంగారెడ్డి జిల్లా మొత్తం ఇంకనూ ఇతర జిల్లాల్లోని 173 గ్రామాలు, 18 తాలూకా లుండేవి. (నిజాం స్వంత జాగీరును అత్రాఫ్‌బల్దా అనికూడా వ్యవహించేవారు). ఈ సర్ఫేఖాస్ ఆదాయం ఏడాదికి రెండుకోట్ల యాభైలక్షలు. దీనిలో నుండి ఒక్కపైస కూడా ప్రజాహితకార్యక్రమాలకై వినియోగించడానికి వీలులేదు. అది పూర్తిగా నిజాంకే చెందుతుంది.

నిజాం బంధువుల ఆస్తుల్ని 'పాయెగాలు' అనేవారు. ఈ పాయేగాల విస్తీర్ణం 3,282 చ॥ మైళ్ళు. వీరుకాక సంస్థానంలో మరో 2,600 మంది జమిందార్లు, జాగిర్దార్లుండేవారు. వీరి ఆధీనంలో 11,000 చ॥ మైళ్ళ భూభాగం

ఉండేది. పదివేల గ్రామాలుండేవి. ఇదీకాక మిగిలిన భూమి అంతా 'దివానీ' పేరుతో ప్రభుత్వాధీనంలో ఉండేది. మొత్తం సంస్థానంలో 21,697 గ్రామాలుండగా అందులో 10,095 గ్రామాలు తెలంగాణాలోనివి.

ఇక్కడ జాగీర్దారులు, భూస్వాముల గూర్చి మనం నిష్పాక్షికంగా ఆలోచించినపుడు ఒక సందేహం కలుగక మానదు. ఈ హైదరాబాద్ సంస్థానంలో కమ్యూనిష్టులు నడిపింది భూస్వామ్య వ్యతిరేకోద్యమమా లేక హిందూ భూస్వామ్య వ్యతిరేకోద్యమమా ? అనే అనుమానము కలుగడానికి కారణమేమిటంటే .....

(1) సాలార్‌జంగ్ బహదూర్ ఆధీనంలో 1126 చ॥మైళ్ళ భూభాగం, 359 గ్రామాలు. (2) నవాబ్‌ఖాన్ ఖనాన్ ఆధీనంలో 197 చ॥ మైళ్ళ భూభాగం 69 గ్రామాలు (3) నవాబ్‌ఫఖరుల్‌ముల్క్ ఆధీనంలో 274 చ॥ మైళ్ళ భూభాగం ఆధీనంలో 113 గ్రామాలు (4) మెహదీయార్ జంగ్ ఆధీనంలో 211 చ॥మైళ్ళ భూభాగం 75 గ్రామాలు, (5) జాగేర్‌నవాబ్ సురయ్యాజంగ్ ఆధీనంలో 34 గ్రామాలు, ఇక నిజాం బంధువుల్లో జాగీర్దార్లను చూస్తే వీరిని పాయేగాలనేవారు. (6) అస్మాన్‌జా బహదూర్ ఆధీనంలో 1634 చ॥మైళ్ళ భూభాగం 407 గ్రామాలు, (7) ఖుర్షీద్‌జాకు 1555 చ॥మైళ్ళ భూభాగంలో 396 గ్రామాలు, (8) కారుల్ ఉమ్మాకు 1163 చ॥ మైళ్ళ భూభాగం 397 గ్రామాలు ఇలా పెద్ద పెద్ద భూస్వాములు (ముస్లింలు) ఉండేవారు కాని .......

వారు హతమార్చిన భూస్వాముల్లో అత్యధికులు హిందూభూస్వాములే అనేది వాస్తవం. (గణాంకాలు కూడా చూపెడుతున్నదదే) అలా అని భూస్వాముల్లో ఎక్కువమంది హిందూ భూస్వాములున్నారా అంటే కాదు. నాడు సంస్థానంలో మొత్తం 2,600 మంది భూస్వాములుండేవారు. ఇందులో....

1,982 మంది ముస్లీం భూస్వాములు కాగా

0,618 మంది హిందూ భూస్వాములుండేవారు.

సామాన్యప్రజల సంక్షేమార్థం కొనసాగిన భూస్వామ్య వ్యతిరేకోద్యమం సమర్థనీయమే. అయితే అది కేవలం ఒక వర్గానికి చెందిన భూస్వాములకు వ్యతిరేకంగా కొనసాగిన వైనమే బాధాకరం. అలాకాక వర్గభేదాతీతంగా భూస్వామ్య వ్యతిరేకోద్యమం కొనసాగి ఉండినట్లయితే ఎంతో బాగుండేది.

స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వం జమిందారీ వ్యవస్థను రద్దు చేయడం, భూపరిమితి చట్టాన్ని తీసుకురావడం, వినోభాభావే ఆధ్వర్యంలో కొనసాగిన భూదానోద్యమం మొదలగునవి అన్నీ సామాన్య ప్రజల సంక్షేమం కోసం, సామ్యవాద స్థాపనకోసమే అనే విషయం అందరికీ తెలిసిందే.. కాకపోతే పై కార్యాలవల్ల కావాల్సినంత సాఫల్యత లభించలేదు. ఇంకా వీటి ఆనవాళ్ళు పూర్తిగా సమసిపోలేదు. దోపిడీ వ్యవస్థ మారనూలేదు. సంస్థానంలో సంపూర్ణక్రాంతిగాని, శాంతిగాని ప్రజలకు అందలేదు.

స్వతంత్రం వచ్చింది.. - వెనుకబాటుతనం అలానే ఉంది !

రాచరికం పోయింది ... - వ్యవస్థ అలాగే మిగిలింది !




1656వ సంవత్సరంలో టర్కీ (తుర్కిస్తాన్) లో బతుకు దెరువు లేక టర్కీలోని భొఖారాపట్టణం నుండి ఖలీజ్ ఖాన్ అనే వ్యక్తి భారతదేశానికి బతకడానికి వచ్చాడు. మొగల్ రాజు షాజహాన్ కొలువులో చేరాడు. ఆయన మనుమడే ఖమ్రుద్దీన్. ఈయనకు నిజాం-ఉల్-ముల్క్ అనే బిరుదు లభించింది. అసఫ్‌జాహి అనేది వారి వంశనామం.

ఈ అసఫ్‌జాహి నిజాం-ఉల్-ముల్క్ షాజహాను కుమారుడు ఔరంగాజేబుకు సన్నిహితునిగా మసలినందున, వింధ్యకు దక్షిణంగా ఉన్న దక్షిణ (దక్కన్‌కు) ప్రాంతానికి సుబేదారుగా నియమింపబడ్డాడు. 1707లో ఔరంగజేబు మరణానంతరం కొంతకాలానికి స్వతంత్రం ప్రకటించు కున్నాడు.

1724 నుండి అసఫియా వంశ పరిపాలన మొదలైంది. అయితే మొగలురాజులు వీరి స్వతంత్రతను గుర్తించలేదు. 1800 సంవత్సరంలో ఈస్టిండియా కంపెనీతో అక్టోబర్ 12న నిజాం చేసుకున్న సంధిపత్రంపైన

నిజాం అలీఖాన్ 'దక్కన్ సుబేదారు' గానే సంతకం చేసాడు. హైదరాబాద్‌ను పాలించిన ఏడుగురు నిజాంలను గూర్చి ఆలోచించనట్లయితే..

- 1724 నుండి 1748 వరకు మొదటి నిజాం పాలన కొనసాగింది. తదనంతరం నిజామలీఖాన్, సలాబత్‌జాహల మధ్య రాజ్యాధికారానికై సమరం కొనసాగింది. 1761 నుండి 1803 వరకు నిజామలీఖాన్ పాలించాడు.

1803 నుండి 1828 వరకు మూడవ నిజాం సింకిందర్ జాహ

1828 నుండి 1856 వరకు నాలుగవ నిజాం నాసిరుద్దౌలా

1856 నుండి 1868 వరకు ఐదవ నిజాం అప్సలుద్దౌలా

1868 నుండి 1911 వరకు ఆరవ నిజాం మీర్‌మహబూబ్ ఆలీఖాన్

1911 నుండి 1948 సెప్టెంబర్ 17 వరకు ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ పరిపాలించాడు. ఈయన 1967లో మరణించాడు.

ఈ నిజాంల పరిపాలనాతీరు సంక్షిప్తంగా చూసినట్లైతే.... గోలకొండ పతనం నుండి నిజాం లొంగుబాటు వరకు హైదరాబాద్ సంస్థానం అట్టుడికి పోయింది.

ఆసఫ్‌జాహీల పాలనలో హైదరాబాద్ సంస్థానంలో... నిరంకుశ నికృష్ట రాచరిక వ్యవస్థ, ఫ్యూడల్ దోపిడి, అణచివేతలు, హత్యాచారాలు, అత్యాచారాలు, వెట్టిచాకిరీలు, మతమదాంధత సర్వత్రా ప్రబలిఉండేది. హిందువులంతా బానిసలు, ముస్లింలంతా పాలకులు అనే భావన కేవలం పాలకులకు మాత్రమే పరిమితం కాలేదు. నిజాం రాజులో, వారి సంతతిలో, రాజు బంధువర్గంలో, జమిందార్లలో, జాగీర్దార్లో, మక్తేదార్లలో, దేశ్‌ముఖ్‌ల్లో, దేశపాండ్యాలు, పటేల్‌లు, పట్వారీలు ఆఖరుకి సామాన్య ముస్లిం ప్రజానీకంలో కూడా ఈ భావం తొణికిసలాడేది. ఇలా ......... నిజాం సంస్థానం నిండా ఎందరో చిన్నా పెద్ద పాలకులుండేవారు. ప్రజాపీడకులుండేవారు.

దాదాపు రెండున్నర శతాబ్దాలపాటు కొనసాగిన ఈచరిత్రలో నిజాంలు ప్రజోపయోగ కార్యలపై శ్రద్ధచూపింది. ప్రజల్ని పట్టించుకుంది చాలాతక్కువే. ఇక చివరి ఐదు దశాబ్దాల్లో మాత్రం ప్రజాపీడన పరాకాష్ఠకు చేరింది. దేశవ్యాప్తంగా

బ్రిటీష్ వ్యతిరేకోద్యమం ప్రబలమవుతున్నకొద్దీ హైదరాబాద్ సంస్థానంలో నిజాం నియంతృత్వం కొత్త పుంతలు తొక్కింది.

నిజాం నియంతృత్వాన్ని విలువరించడం కోసం, దానిక్కావలసిన ఉద్యమ నేపథ్యాన్ని 1892 నుండే ఆర్యసమాజం సృష్టించడం మొదలుపెట్టింది. ప్రజలకు అన్నింటా అండగా నిలిచింది. నిజాం వ్యతిరేకోద్యమానికి ఊపిరిలూదింది ప్రప్రథమంగా ఆర్యసమాజమే. ప్రజా పక్షాన నిలిచిన ఆర్యసమాజాన్ని నిజాంప్రభుత్వం తమకు ప్రతిపక్షంగా, వ్యతిరేకంగా భావించింది. ఆర్యసమాజ కార్యకలాపాలపై అడుగడుగున ఆంక్షలు విధించింది. నిజాం ఎంత ఎక్కువగా ఆంక్షల్ని విధించుకుంటూ పోతే ఆర్యసమాజం అంత అధికంగా విజృంభించింది. అయితే సంస్థానంలో విప్లవం వచ్చింది. ఏడవ నిజాం కాలంలో కనుక ఆయన యొక్క (పాలనా) తీరును గూర్చి కొంత వివరంగా తెలుసుకుందాం.

## 5 ఏడవ నిజాం నవాబు - అపర ఔరంగజేబు

సాధారణంగా ఓ వ్యక్తికి సంబంధించి "ఏడేళ్ళ శనిపట్టింది" అంటుంటారు. హైదరాబాద్ సంస్థానానికి మాత్రం ఏడుగురు నిజాంల ఏడుతరాలశని పట్టింది. ఆ శనిప్రభావం 224 ఏళ్ళుంది. అందులో 1911 నుండి 1928 వరకు శనిప్రభావం తీవ్రంగా ఉండింది.


మీరా ఉస్మాన్ అలీఖాన్

అసఫ్ జాహీల ఆఖరి వారసుడు, బ్రిటీష్ సామ్రాజ్యవాదుల తొత్తు అయిన ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ పచ్చిమతత్వవాది, అధికార పిపాసి, స్త్రీ లోలుడు పరమలోభి, ప్రపంచంలోనే నాడు అతి ఐశ్వర్యవంతుడు ఈయన 1911లో గద్దెనెక్కాడు.

హిందువులను క్రూరాతి క్రూరంగా హింసించిన ఔరంగజేబును తలదన్నే విధంగా, అతిహేయంగా, నీచాతినీచంగా దాదాపు 37 సంవత్సరాల పాటు పరిపాలన కొనసాగించాడు. ఆయనలోని ప్రధాన (అవ) లక్షణాల్ని కొంత వీక్షిద్దాం.

**పచ్చి మతతత్వవాది :** అధికారం తన చేతికి రాగానే తన తండ్రికాలం నాటి నుండి ప్రధానమంత్రిగా పనిచేస్తున్న మహారాజ సర్‌కిషన్‌ప్రసాద్‌ను తొలగించి ఆయన స్థానంలో ఒక ముస్లింను నియమించాడు.

• అనతి కాలంలోనే ఆయన్ని కూడా తొలగించి తనేరాజై తనే మంత్రై పాలన కొనసాగించాడు. (జర్మనీలో హిట్లర్ లాగ) 1914 నుండి రాజుగా తనే ఉన్నా ప్రధాన మంత్రి జీతాన్ని కూడా తానే తీసుకునేవాడు.

• ఇక్కడ పేర్కొన్న నిజాం స్వయం విరచిత కవితా పంక్తులు ఆయన చిత్తవృత్తికి, మనస్తత్వానికి అద్దం పడుతాయి.

మైపాన్‌బానేదీన్‌హూం !

కుఫర్‌కా జల్లాన్ హూం !

అంటే నేను ఇస్లాం రక్షకున్ని, ముస్లింకాని వాని తల నరికేవాన్ని.

ఇలాంటిదే మరోకవిత ఈయన రాసారు.

బందే నాకూన్‌హువా మనకే నారాయేట్ బీర్ !

జల్‌ఝలా ఆహీ గయా రిస్తయే జున్నార్ పర్ ! !

అంటే అల్లాహోఅక్బర్ అన్నా కల్మాధ్వని వినబడటంతోనే శంఖానాదం ఆగిపోయింది.

హిందువుల జంధ్యాల్ని, మతచిహ్నాల్ని భూకంపం నుండి లేచిన మట్టి కప్పేసింది.

ఇవండీ నిజాం యొక్క పిచ్చి మతతత్వ మనస్తత్వానికి మచ్చుతునకలు. పోలీసు చర్య పిదప సర్దార్ పటేల్‌తో హిందువులు, ముస్లింలు నాకు రెండు కళ్ళలాంటివారు అని నిజాం బొంకినపుడు పైన తెలిపిన కవితాపంక్తుల్ని సర్దార్ పటేల్ తన కార్యదర్శి మీనన్ చేత చదివించి వినిపించారుట. (ఖండేరావు కులకర్ణి హైద్రాబాద్ చరిత్రపుటలు)

ముస్లీం మత తత్వవాదులు ఖాక్సార్ పార్టీని ప్రారంభించారు. దీని సభ్యుల్ని బేల్చాఫౌజ్ (బేల్చాలంటే గొడ్డలి) అనేవారు. వారంతా గొడ్డళ్లను ధరించేవారు. హిందువులపై హింస, దోపిడి కొనసాగించేవారు. దీనికి నిజాం సంపూర్ణమద్దతు ఉండేది. అనే దానికి ఉదాహరణ ఏమంటే.... నిజాం ప్రభుత్వంలో విద్యాశాఖాధికారిగా పనిచేస్తున్న అల్లమామశ్రకి దీని కార్యకలాపాల్ని పర్యవేక్షించేవాడు.

• 1927లో ఇత్తెహదుల్ ముస్లిమీన్ సంస్థ ఆవిర్భావం జరిగింది. దీని వ్యవస్థాపకాధ్యక్షుడు బహదూర్‌యార్జంగ్ తదనంతరం కాశీం రజ్వీ ఆధ్వర్యంలో ఇత్తెహదుల్ ముస్లిమీన్ రజాకార్ల సైన్యంగా మారింది. నిజాం సైన్యంతో కలిసింది. హిందువులపై దురాక్రమణ చేయడం ఇస్లాం రాజ్యస్థాపన చేయడం తన లక్ష్యాలుగా ప్రకటించింది. ఈ లక్ష్యసాధనకై హత్యాచారాలు, అత్యాచారాలు తమ నిత్యకృత్యాలుగా మార్చుకుని రెచ్చిపోయారు. దీనికి నిజాం పూర్తిగా వత్తాసుపలికాడు.

• దీనికి తోడుగా 1929లో సిద్దిక్ దీన్‌దార్ ఉద్యమం హైదరాబాద్‌లోని అసిఫ్‌నగర్ కేంద్రంగా ప్రారంభమైంది. సిద్దిక్ తనకు తాను చెన్న బసవేశ్వరుని అవతారంగా ప్రచారం చేసుకుంటూ వేలాది హిందువుల్ని మోసం చేసి మత మార్పిడి చేసాడు. ఈ మతమార్పిడులకు నిజాం యొక్క చేయూత ఉండేది. అంతటితో ఆగక ఈ సిద్దిఖీ నిజాంను కూడా పాండురాజు అవతారంగా చిత్రించాడు. ఇటువంటి పలు నీచ కార్యాలకు నిజాం యొక్క ఆర్థిక, హార్థిక సహకారం దండిగా ఉండేది.

• ఈ దేశంలోని ముస్లిం స్త్రీలు పనికి రారనేమో టర్కీనుండి అమ్మాయిని తెచ్చి తనకొడుక్కిచ్చి పెళ్లిచేసాడు.

• ముస్లిం జనాభాను పెంచడానికి అన్ని రకాల ప్రయత్నాలు చేసాడు. ఎనిమిది లక్షలమంది అరబ్బులను దిగుమతి చేసుకుని వారిని పెంచి పోషించాడు. హిందువులపైకి ఉసికొల్పాడు.

• హిందువుల సొమ్ము తింటూ వారి చెమటను త్రాగుతూ పరమలోభిగాను అతి ఐశ్వర్యవంతునిగాను మారిన నిజాం హిందువుల

సంక్షేమంకోసం ఒక్కపైస ఖర్చు చేయలేదు గాని . . . .హైదరాబాద్ సంస్థానంలోని ముస్లింలకు ప్రపంచంలోని ఇతర ముస్లింలకు భారీగా ధన సహాయం (అత్తసొమ్ము అల్లుడు దానం చేసినట్లు) చేసాడు. మచ్చుకు కొన్ని చూద్దాం.

• మక్కా, మదీనాలకై, టర్కీ, పాలస్తీన, ఇరాక్, బాగ్దాల్లోని ముస్లింలు వివిధ కార్యాలకై అడిగిందే తడవుగా విరాళాలిచ్చేవాడు.

• ఢిల్లీలోని జామా మసీదు ప్రాంగణంలో రాళ్ళు పరిపించడానికి

• ఆలీఘడ్ ముస్లీం యూనివర్శిటీకి

• అజ్మీరులోని ముజావర్లకు

• మఫలాబార్ రిలీఫ్ ఫండుకు

• భావనగర్‌లోని కరువు పీడితులైన ముస్లింలకు

• బల్ఖాన్ యుద్ధంలో క్షతగాత్రులైన ముస్లింల సహాయార్థం

• అమరావతిలోని మహమ్మద్ హైస్కూల్‌కు ఇలా . . . . తన ఇష్టం ెచ్చినట్లు ప్రజాసొమ్మును ఖర్చుచేసేవాడు.

ఇక్కడ తొంబైశాతంగా ఉన్న హిందూప్రజానీకం అష్టకష్టాలు పడుతుంటే, ుతం పేరున భారత్‌ను విభజించడానికి రక్తపాతం సృష్టించైనా పాకిస్థాన్‌ను ుస్లీంలు సాధించుకోవడానికి కృషి చేసిన జిన్నాకు ఇరవైకోట్ల రూపాయలు ఆకాలంలో) సహాయం అందించాడు.

ఇంతవరకు చెప్పినవన్నీ 1911 నుండి 1920 మధ్యకాలంలో చేయబడిన దానధర్మాల్లో కొన్నిటిని మాత్రమే ప్రస్తావించడం జరిగింది.

సర్‌వాల్టర్ మాంక్టన్ అనే బ్రిటీష్ వ్యక్తి నిజాం రాష్ట్రానికి రాజ్యాంగ సలహాదారుగా ఉండేవాడు. ఇతనికి సంవత్సరానికి ఏడు లక్షల రూపాయల వేతనం లభించేది. దీన్ని సంస్థాన ప్రభుత్వమే భరించేది. ఇది చాలదన్నట్లు నిజాం తన స్వంత జాగీరు సర్ఫేఖాస్ ఖజానానుండి ఏడాదికి ఏభైవేల వేతనం అదనంగా చెల్లించేవాడు. ఇంత వేతనంతో సర్‌వాల్టర్ మాంక్టన్ హైద్రాబాద్‌లో హాయిగా ముప్పయి ఏళ్ళు జీవించాడు. 1948లో పోలీసు చర్య అనంతరం లండన్‌కు వెళ్ళిపోయాడు.

**అధికార పిపాసి :** 1911 ఆగష్టు 29న అప్పటి ప్రధానమంత్రి మహారాజ సర్ కిషన్ ప్రసాద్ సహాయంతో ఏడవ నిజాంగా మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ అధికారంలోకి వచ్చాడు. 1914 నుండి తానే రాజై, మంత్రై అన్ని సౌకర్యాల్ని అనుభవించడం మాత్రమే కాక తన పెద్దకొడుకైన మొజంజాహను నగరాభివృద్ధిశాఖకు, సహకార సంఘాల సమాఖ్యకు అధ్యక్షునిగా చేసి పెద్ద మొత్తంలో జీతాన్ని ఇచ్చాడు.

• నిజాంకు, రజాకార్లకు ద్వేషమున్నది హిందువులపైన, ఆలాగని తమను, తమ దుష్టకృత్యాల్ని ఎవరు విమర్శించినా చివరికి ముస్లీంలనైనా సరే వదిలిపెట్టేవాడుకాదు.

**ఉదా : 1948 ఆగస్టు21 నాటిరాత్రి** : రయ్యత్ పత్రిక సంపాదకుడు షోయబుల్లాఖాన్ హత్యోదంతం.

తన అధికారాన్ని ప్రశ్నించిన, నియంతృత్వాన్ని ఎదిరించినా, స్వేచ్ఛ గురించి మాట్లాడినా, పోట్లాడిన వేలాది మంది విద్యార్థుల్ని సత్యాగ్రహుల్ని, సాయుధ దేశభక్తుల్ని అతి కర్కశంగా హత్యలు చేయడం జరిగింది,

• **1947 జూన్ 12న** ఒక ఫర్మానా జారీ చేస్తూ బ్రిటీష్ వారు ఈ దేశం విడిచి వెళ్ళిన వెంటనే హైదరాబాద్ రాష్ట్రం స్వతంత్ర మవుతుందని ప్రకటించాడు.

• **1947 ఆగస్టు 14న** బ్రిటీష్ రెసిడెంట్‌కు వీడ్కోలు విందు ఇస్తూ నిజాం తన ఉద్దేశ్యాన్ని పునరుదీటించాడు.

• **1947 ఆగస్టు 17న** హైదరాబాద్ సంస్థానాన్ని స్వతంత్ర రాజ్యంగా ప్రకటించాడు. దీనికోసం భారీగా అంతర్జాతీయ మద్దతు కూడగట్టు కోవడానికి తీవ్రంగా ప్రయత్నించాడు. అతని కొన్ని ప్రయత్నాల్ని చూద్దాం.

• 1947 జనవరి 26న సుబా-ఎ-దక్కన్ అనే ఉర్దూ పత్రికలో హైదరాబాద్ సంస్థానం భారతదేశంలో అంతర్భాగమవుతుందను కోవడం అర్థరహితం అని ప్రకటించాడు.

• పాకిస్థాన్ విదేశాంగ మంత్రి జఫరుల్లాఖాన్ చేత బాహటంగా హైదరాబాద్ రాష్ట్రానికి మద్దతు ప్రకటింపచేసాడు.

• 1948 జూలై 30న బ్రిటీష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ కూడా హౌస్ ఆఫ్ కామన్స్‌లో ప్రసంగిస్తూ . . . ఐక్యరాజ్య సమితిలోని 52 దేశాల్లో 20దేశాలు హైదరాబాద్ కంటే చిన్నవని, 16 దేశాలు హైదరాబాద్ కంటే తక్కువ ఆదాయం కలవని అంటూ నిజాం అంతరంగాన్ని సమర్థించాడు.

• 1948 పోలీసు చర్యకు ముందు నిజాం జ్యేష్ఠపుత్రుడు బిరారు యువరాజు అజంజాకు 8వ నిజాం కావాలనే కోరికతో హైదరాబాద్ సంస్థాన సేనను సరిహద్దు నుంచి వెనకకు రప్పించాలనుకున్నాడు. దాన్ని పసిగట్టిన నిజాం ఆజాంజాకు కావల్సినంత డబ్బుఇచ్చి ప్యారిస్‌లాంటి ప్రదేశాలకు విహారయాత్రకు పంపించాడు. వ్యసనలోలుడైన అజంజా సర్వసేనాధికారి పదవి వదలుకొని జల్సాలు చేసుకుంటూ ప్రపంచ పర్యటనలో ఉన్నాడు. ఇక్కడ పోలీసు చర్య జరిగే సమయంలో . . .

• చివరి బ్రిటీష్ రెసిడెంటు స్వతంత్ర హైదరాబాద్‌ను సమర్థించాడు.

• అర్జెంటీనాకు చెందిన జోన్ ఆర్సెస్ భద్రతామండలిలో ప్రసంగిస్తూ స్వతంత్ర హైదరాబాద్‌ను సమర్థించాడు.

• పలు బ్రిటీష్ పత్రికలు హైదరాబాద్‌ను సమర్థిస్తూ వ్యాసాలు రాయగా 'ది స్పెక్టేటర్' అనే పత్రికయితే ఏకంగా ఎడిటోరియల్‌నే రాసింది.

• మిలటరీ చర్య జరిగే క్షణం వరకు కూడా తన అధికారాల్ని రక్షించుకోవడం కోసం అంతర్గతంగా, అంతర్జాతీయంగా ఉన్న అన్ని అవకాశాల్ని వినియోగించుకోవడానికి శాయశక్తుల ప్రయత్నించాడు మీర్ ఉస్మాన్ అలీఖాన్.

**స్త్రీలోలుడు** : తన క్రూర కామ పైశాచిక ప్రవృత్తిని సంతృప్తి పరచుకోవడానికి 360 మంది అందమైన స్త్రీలను తన రాజసౌధంలోనే ఉంచుకున్న ఘనుడు. అందమైన స్త్రీలను నజరానాగా స్వీకరించడం వారికి పుట్టిన సాహెబ్‌జాదాల్ని (రాజకుమారుల్ని) రాజ్యం మీదకు వదిలేయడం ఆయనకలవాటు.

అటు నిజాం, నిజాం కుమారులు, ఇటు నిజాం బంధువర్గం, సైన్యం రజాకార్లు కనపడ్డ కన్నె, వివాహిత, పిల్లలు, వృద్ధులు అనే వయోభేధం లేకుండా

ఎత్తుకొని పోవడం, మానభంగం చేయడం ఇష్టమైతే ఉంచుకోవడం, లేకపోతే చంపివేయడమనేది నిజాం రాజ్యంలో అతి సామాన్యమైన విషయం. హిందూస్త్రీల నెందరినైనా సరే నిఖా కట్టుకోవడం, వారితోపాటు వారి బంధువర్గాన్ని మతాంతరీకరణ చేయడం జరుగుతుండేది.

**పరమలోభి** : సాధారణ ప్రజానీకం యొక్క శ్రమ దోపిడితో సంతృప్తి చెందని నిజాం, సందర్శకులనుండి, ఉద్యోగులనుండి ప్రతీ సంవత్సరం సాల్గిరా (పుట్టినరోజు) జరుపుకుంటూ కానుకల్ని స్వీకరించేవాడు. ఇది ఒక ఆచారంగా మారింది.

చివరికి నిజాం లోభత్వం ఎంతగా ముదిరిందంటే తన ఇష్టం వచ్చినప్పుడుల్లా ఎవరినో ఒకరిని పిలిచి బిరుదులిచ్చేవాడు. బిరుదులు పొందినవారు అందుకు ప్రతిగా కొంత నజరానా తప్పనిసరిగా ఇచ్చుకోవాల్సి వచ్చేది.

• ఆఖరికి ఎవరైనా రెండు అష్రఫీలు (ఒక తులం బంగారు నాణెం) నజరాన ఇచ్చినటువంటి వారికి జంగ్, నవాబ్ జంగ్ యార్‌జంగ్‌లాంటి బిరుదులిచ్చేవారు.

• రాజదర్శనం నజరానా చెల్లించుకుంటేనే లభించేది.

• అంతేగాక తరుచు అమీర్లు, జమిందార్ల ఇండ్లకు మీరు ఉస్మాన్ అలీఖాన్ స్వయంగా వెళ్ళి ఇంటిల్లిపాది నుండి నజరానాలు స్వీకరించేవాడు.

• సర్ఫేఖాస్ తోటనుండి మామిడి, అరటి పండ్లను ఒక్కొక్క కచేరికి పంపేవాడు. దానితోపాటు ఒక చీటికూడా రాసిపెట్టి పంపేవాడు. ఆ చీటిలో పండ్లు పంపబడిన కచేరి ఎంతడబ్బు నిజాంకు పంపించాలో రాసి ఉండేది.

• భూమిశిస్తు (మాల్గుజారి తోపాటు ప్రతీ రూపాయికి ఒక అణ చొప్పున లోకల్‌ఫండ్‌కోసం, అర్ధ అణా బంచరాయి కోసం, ఒక అణ నిజాంకు నజరాన కోసంగాను ప్రజల దగ్గరినుండి పట్వారీలు వసూలు చేసి నిజాంకు పంపించేవారు.

• జాగిర్దారు లెవరైనా చనిపోతే వారి వారసులపేర ఆస్థి మార్పిడికి పెద్దమొత్తంలో నజరాన ఇచ్చుకోవాల్సి వచ్చేది. వారసులు లేనట్లయితే ఆ ఆస్థిమొత్తం నిజామే ఉంచుకునేవాడు.

• కమాల్‌ఖాన్ అనే పెద్ద జాగీర్దార్ తనకొరకు హైదరాబాద్‌లోని కోఠీ ప్రాంతంలో ఒక అందమైన బంగళాను కట్టించుకొని ప్రతీచోట తన పేరును సూచించే కె.కె. అనే అక్షరాల్ని చక్కగా చెక్కించుకున్నాడు. గృహప్రవేశం కూడా జరిగింది.

నిజాంను ప్రత్యేకంగా విందుకు ఆహ్వానించి పెద్ద తప్పిదం చేశాడు కమాల్‌ఖాన్. నిజాం వచ్చి ఆతిథ్యాన్ని స్వీకరించి అందమైన ఆ భవనాన్ని ఆసాంతం చూసి . . . ఈ భవంతి నాకు బాగా నచ్చింది దీన్ని మేం రాజభవనం చేసుకుంటాం అన్నాడు. చేసేదేంలేక కమాల్‌ఖాన్ తన స్వప్నసౌధాన్ని నిజాంకు నజరానాగా అర్పించుకున్నాడు. నాటి ఆ కె.కె.భవనమే ఆ పిదప కింగ్‌కోఠీగా నామంతరం చెందింది.

• అంతేనా రాజ్యంలోని ప్రతీవ్యక్తి రాజుకోసం కొంత డబ్బు చెల్లించాలనేది ఒక నియమంగా ఉండేది. ఆ డబ్బు వసూలు చేయడానికి ప్రజల్ని ఎంతగానో హింసించేవారు.

• ఒకవేళ ఎవరైనా డబ్బు చెల్లించక పోయినట్లైతే ఆడ, మగ, దరిద్రుడు, ధనవంతుడు, వృద్ధులు అనే తేడా లేకుండా చెవులకు పెద్ద పెద్ద బరువులు కట్టి హింసించేవారు. ఛాతిపైన పెద్ద బండలు పెట్టేవారు. సలసలకాగే నూనెలో చేతుల్ని ముంచేవారు. ఈ విధంగా చిత్రహింసల్ని పెట్టేవారు. ఇటువంటి విషయాల్ని వివరంగా సర్‌జాన్ మాల్కం తన 'రైజ్ అండ్ ఫుల్‌ఫిల్‌మెంటు ఆఫ్ బ్రిటీష్ రూల్ ఇన్ ఇండియా' అనే గ్రంథంలో రాసాడు.

• ఇలా ప్రజల్ని పీడించి వసూలు చేసిన ధనాన్ని పొరపాటున కూడ ప్రజాహితానికై వెచ్చించని పరమలోభి నిజాం.

**ప్రపంచంలోనే ఐశ్వర్యవంతుడు** : నిజాం తన స్వంత ఆస్తిగా సర్ఫేఖాస్ 8,100 చ॥మైళ్ళు (5,30,000 ఎకరాల) భూమిని ఉంచుకున్నాడు.

• సంవత్సరానికి 70లక్షల రూపాయల్ని ఖజానా నుండి తన స్వంత ఖర్చులకోసం తీసుకునేవాడు.

• తనకు అనేక ప్యాలెస్‌లు, రాణివాసాలున్నాయి.

• రాష్ట్రంలో ఐదు బట్టల మిల్లులుండేవి. 1) వరంగల్‌లోని ఆజం జాహిమిల్లు 2) నాందేడ్‌లోని ఉస్మాన్ షాహిమిల్లు 3) గుల్బర్గాలోని మహబూబ్‌ఖాన్ షాహిమిల్లు 4) సికింద్రాబాద్‌లోని రాంగోపాల్ మిల్లు 5) ఔరంగాబాద్ మిల్లు. వీటిలో దాదాపు 20వేల మంది కార్మికులు పనిచేసేవారు. వారిలో 15వేలకు పైగా ముస్లింలే.

- 60వేల ప్రభుత్వ ఉద్యోగాల్లో 46 వేల మంది ముస్లింలు
- 52వేల పోలీసు ఉద్యోగాల్లో 46 వేలమంది ముస్లింలు
- ఉన్నతాధికారుల్లో దాదాపుగా ముస్లింలే ఉండేవారు.
- సింగరేణి బొగ్గుగనులు
- నిజాంస్టేట్ రైల్వేస్
- షాబాద్ సిమెంట్ ఫ్యాక్టరీ
- నిజాంస్టేట్ రోడ్‌ట్రాన్స్‌పోర్టు అలాగే
- బ్రిటీష్‌వారి వజీర్ సుల్తాన్ టుబాకో కంపెనీలోను
- ఆల్విన్ కంపెనీలోను
- బోధన్ షుగర్ ఫ్యాక్టరీలోను
- సిర్పూర్ పేపర్స్ మిల్స్ లోను నిజాం వాటాదారు.
- స్వంత కరెన్సీ (హాలిసిక్కా)
- స్వంత సైన్యం
- పోస్టల్, టెలిగ్రాఫ్
- రేడియో

• సరిహద్దు సుంకం తదితర హంగులు, ఆదాయమార్గాలు నిజాంకు ఉండేవి. లేనిదల్లా . . . . ప్రజలకే . . .

**భాషాదురభిమాని** : 90 శాతానికి పైగా ఉన్న హిందువుల మాతృభాష తెలుగు అయినప్పటికి నిజాం రాజ్యంలో అధికార భాష ఉర్దూ, ఉర్దూభాషా ప్రాబల్యం వలన తెలుగు భాషకు గ్రహణం పట్టింది.

• ప్రభుత్వ గస్తీ నిషాన్ 53 ప్రకారం 1917 నుండి తెలుగును బోధనా భాషగా పాఠశాలల్లో నిషేధించారు.

• పత్రికలపై కూడా చాలావరకు నిషేధం ఉండేవి.

• ఉర్దూ తర్వాత ఆంగ్లభాషకు ప్రాధాన్యత ఉండేది.

• ఉర్దూ మాధ్యమంగానే విద్యావ్యవస్థ కొనసాగేది. హిందువులైన ముస్లింలైనా ఉర్దూలోనే చదువుకోవాలి.

• అనుమతి లేకుండా హిందువులు సభలు, సమావేశాలు, సత్సంగాలు ఊరేగింపులుగాని చివరకు పెళ్ళి ఊరేగింపైనా చావు ఊరేగింపుకైనా సరే చేసుకోకూడదు.

• తెలుగు ప్రజలపై ఉర్దూ పెత్తనం చెలాయించేది. తెలుగు భాషలో నేడు కూడా అనేకంగా ఉర్దూభాషా పదాల్నే వాడుతున్నాము.

• కాకతీయులు పాలించిన గడ్డలో, పోతన జన్మించిన భూమిలో తెలుగు తేలంగి అయ్యింది. దిక్కులేని భాషగా మారింది. ఆర్థికంగా, సామాజికంగానేకాక భాషాపరంగా కూడా పెద్ద దెబ్బతగిలింది. ఆ విపత్కర పరిస్థితుల్లోనే తెలుగు భాష పరిరక్షణకై ఆంధ్ర జనసంఘం, గ్రంథాలయోద్యమాలు మొదలైనాయి.

**మతదురహంకారి :** ముస్లిమేతర ప్రజానీకం యొక్క ధన, మాన, ప్రాణాలపై ముస్లింలకు సంపూర్ణ హక్కులుండేవి. బ్రతుకుదెరువు కోసం నాడు హిందువుల ముందున్న ఏకైక మార్గం, ముస్లింలుగా మతం మారడం. 1948 సెప్టెంబర్ 7నాడు పార్లమెంట్‌లో భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ హిందువులపై నిజాం యొక్క నియంతృత్వ హత్యాచార, అత్యాచార దోపిడీలకు సంబంధించి ఒక ప్రకటన చేసాడు

• మెజార్టీ వర్గమైన హిందూ జనశ్రమపైననే నిజాం రాజ్య పునాదులు నిలుబడి ఉన్నాయన్న విషయాన్ని మరచి, హిందూ ప్రజానీకం యొక్క ఆచార వ్యవహారాల్ని, సాంప్రదాయాల్ని, పూజావిధానాన్ని, విద్యావిధానాన్ని ఇలా ఒక్కటేమిటి పూర్తిగా హిందూ జీవన విధానాన్ని అస్తవ్యస్తం చేయడానికి, తన అదుపులో రాజ్యాన్ని పెట్టు కోవడానికి అనుసరించని మార్గంలేదు. చేయని దుర్మార్గం లేదు. ఆనాటి చరిత్ర పుటల్ని తిరగేస్తే మనకు కనిపించే నిజాం యొక్క నైజం ఇది.

# 6 సాంస్కృతిక దురాక్రమణ

శతాబ్దాలపాటు కొనసాగిన విదేశీయ, విధర్మీయ విపరీత పాలన వారిలో రాజ్యాధికార పిపాసను అధికతరం చేసింది. ఫలితంగా ఇక్కడి ప్రజానీకంపైన సాంస్కృతిక దురాక్రమణ, మత ప్రచారం, మతాంతరీకరణ వెర్రితలలు వేసింది. దక్షిణాపథం దక్కన్‌గా మారింది.

అందమైన హిందూస్త్రీలను పట్టుకోవడం, ఆకట్టుకోవడం ఆపైన కట్టుకోవడం, వారిపేరును ఏ పట్టణానికో, కట్టడానికో పెట్టడం, తదనంతర కాలంలో ఆ హిందూస్త్రీల సంస్కృతీ సభ్యతలకు సమాధికట్టి వారిని, వారిపేర్లను, వారిపేర్లు పెట్టిన కట్టడాల పట్టణాల పేర్లను సైతం మార్చడం జరిగింది.

ఇది ఆయాచితంగా జరిగిన సంఘటన అనుకుంటే పెద్ద పొరపాటే. ఒక ప్లాన్ ప్రకారం, పకడ్బందిగా, పట్టుదలతో కొనసాగించిన సాంస్కృతిక దురాక్రమణ, ఇస్లామీకరణ అనే విషయం ఏమాత్రం ఆలోచించినా అర్థమవుతుంది. అటువంటి కొన్ని సంఘటల్ని ఇక్కడ ప్రస్తావించడం సమయోచితంగా ఉంటుంది.

మూడవ నిజాం ఇబ్రాహిం కులీకుతూబ్‌షా భాగీరథీ అనే అందమైన హిందూ యువతిని పెళ్ళి చేసుకున్నాడు. ఆమెపై మోజుతీరగానే ఆ భాగీరథీ 'మహమ్మదుబి' గా మార్చబడింది.

మహమ్మద్ కులీకుతూబ్‌షా 'భాగమతి' అనే మరో హిందూ సుందరిని ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. ఆమె పేరున 1591లో భాగ్యనగరాన్ని నిర్మించాడని చెబుతుంటారు. కాని ఆరుసంవత్సరాల కాలం గడవగానే అంటే 1597లోనే ఆ అతిశుద్ధమైన ప్రేమ ఎందుకు ఆవిరయిపోయిందో ఏమోగాని భాగమతి హైదర్బీగా మారాల్సివచ్చింది భాగ్య నగరం హైదరాబాద్ అయింది. నేటి మన ఏకపక్షసెక్యులర్ వ్యవస్థలో ఇటువంటి అంశాల్ని మనం పట్టించుకోవద్దని కాబోలు చరిత్రలో అటువంటి వాటికి అంతప్రాధాన్యత నీయక సమాజాన్ని మోసం

చేసారు. ఇంకా విచిత్రమేమిటంటే వాళ్ళ పాలనలో కొన్ని ప్రాంతాల పేర్లు మారాయి. వాటి పూర్వపు పేర్లను తిరిగి వాడితే నిజాంల ఆత్మ శాంతించదనో, లేక సెక్యులర్ వ్యవస్థకు విఘాతమనో ఏమోగాని అవినేటికి అలాగే వ్యవహరించ బడుతున్నాయి.

**ఉదా** : పాలమూరు - మహబూబ్‌నగర్

ఇందూరు - నిజామాబాద్

ఇలా తెలంగాణా ప్రాంతంలోని ఎన్నో ప్రాంతాల పేర్లు. నిజాం పాలనలో మార్చబడినాయి. అయినా నిజాం వారసులు నేటికి ఉన్నారనే భయంతో కాబోలు నేటి ప్రభుత్వం కూడా పాతపేర్లను పునరుద్దరించే ప్రయత్నంచేయలేదు.

ఇండియా దటీజ్ భారత్ అనే వాక్యాన్ని భారత రాజ్యాంగ సాక్షిగా, బ్రిటీష్ పరిపాలనా తీపిగుర్తుగా నేటికి మనం దాన్ని మార్చకుండా గౌరవిస్తూనే ఉన్నాం కదా ! దేశంపేరు విషయంలోనే అంతగా సర్దుకుపోగా లేనిది ఆప్టరాల్ చిన్న చిన్న ప్రాంతాల పేర్ల విషయాల్ని పట్టించుకోవడమా . . . . . ఎంత చిన్నతనం.

1920లో జారీ అయిన 46వ నెంబర్ ఫర్మానా ప్రకారం హిందూ సార్వజనిక కార్యక్రమాలన్నింటిపైన నిషేధం విధించింది నిజాం ప్రభుత్వం. జాతీయ నాయకులైన లోకమాన్య బాలగంగాధర్ తిలక్, బిపిన్ చంద్రపాల్ లాంటి వారి ఫోటోలపైన, వందేమాతరం నినాదం పైన కూడా నిషేధం విధించారు.

గస్తీనిసాన్ తిరవన్ (53) అనే ఫర్మానా ఒకటుండేది. దాన్ని అడ్డంపెట్టుకుని హిందువులపైన విచక్షణా రహితంగా ఆంక్షల్ని విధించారు. ఇలా ఒకవైపు నియంత నిజాం దిన దినం హిందూ సమాజాన్ని వివిధ మార్గల ద్వారా విచ్ఛిన్నంచేసి, బలహీనం చేసి నిర్వీర్యంగా చేయడానికి, శాశ్వతంగా ఈ గడ్డపైన పెత్తనం చెలాయించడానికి తీవ్ర ప్రయత్నం చేస్తుండగా . . . .

మరోవైపు ఆర్యసమాజం నిస్తేజావస్థలో పడిఉన్న సమాజాన్ని సంఘటితం చేస్తూ, శక్తివంతంచేస్తూ, చైతన్యవంతం చేస్తూ నిజాం నిరంకుశత్వాన్ని సవాల్ చేసే ప్రబలశక్తిగా, సమాజ సంరక్షణకై ఉన్న ఏకైక ఆశాజ్యోతిగా ఎదుగుతోంది.

ఆకారణంగా ఆర్యసమాజ కార్యకలాపాలపైన కూడా ఆంక్షల్ని అధికతరం చేసింది నిజాం ప్రభుత్వం.

ఆర్యసమాజీకులకు మాత్రమేకాక సమస్త ప్రజానీకానికి కరదీపికలా, చైతన్యవాహికలా దిశాదర్శనం చేసిన మహర్షి దయానంద విరచిత "సత్యార్థప్రకాశం" అనే బృహత్ గ్రంధాన్నినిజాం ప్రభుత్వం నిషేధించింది. అంతేనా ఓం ఝుండాలపైన నిషేధం, హవనం చేసుకోవడంపై నిషేధం, ఆఖాడా (వ్యాయామశాల) లపై నిషేధం. మొహర్రం నెలనుండి 40 రోజులపాటు హిందువులు కూడా ముస్లింలను అనుసరించాలి.

ఏ శుభకార్యం జరుపుకోవడానికి వీల్లేదు. వేరే సమాయాల్లోనైనా ప్రతీది చేసుకోవడానికి ముందస్తు అనుమతి తప్పనిసరి. అలా అనుమతి తీసుకోకపోతే అదో పెద్ద నేరం అందుకు జరిమానాలు శిక్షలు షరా మామూలే.

హిందువుల్ని తమ సంస్కృతి సభ్యతలకు, ఆచార వ్యవహారాలకు ఐక్యతకు దూరంచేసి, ఆత్మ విస్మృతికి గురిచేసి, పలురకాల దౌర్జన్యాలకు ఎరచేసి, గందరగోళం సృష్టించి, ముస్లింలుగా మతం మార్చి ఈ సంస్థానాన్ని శాశ్వతంగా పరిపాలించడం ధ్యేయంగా ఇంతవరకు చెప్పుకున్న పద్ధతుల్ని ఆవలంబించడం మాత్రమే కాక మరోమూడు ముఖ్యమైన విషయాలపైన తన దృష్టిని కేంద్రీకరించాడు నిజాం.

అవి 1) విద్యారంగం 2) సాహిత్యం 3) జనాభా మార్పిడి.

**విద్య :** హైదరాబాద్ సంస్థానంలో విద్య కేవలం ఉర్దూ మీడియంలోనే కొనసాగేది. పాఠశాలలన్నీ మీర్ ఉస్మాన్ ఆలీఖాన్‌ను కీర్తిస్తూ ఒక ప్రార్థనా గీతాన్ని ఆలపించాలనే ఫర్మానా ఒకటి ఉండేది. మచ్చుకు ఆ ప్రార్థనలోని కొంతభాగాన్ని చూద్దాం !

లూ అబద్‌ఖాలి ఖె అలం యే తియాసత్ రఖ్ఖే !
తుఝుకో ఉస్మాన్ బసదా ఇజ్జాల్ సలామత్ రఖ్ఖే !!
అంటే జగత్కర్త ప్రళయం వరకు నీ రాజ్యాన్ని ఉంచనీ. .
• ఓ ఉస్మాన్ నిన్ను నిండుదర్పంతో ఉంచనీ . .

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ముస్లిం విద్యార్థులకోసం మసీదు తదితర సౌకర్యాలుండేవి కాని హిందూ విద్యార్థులకోసం మాత్రం ఎటువంటి దైవ ప్రార్థనలు చేసుకోవడానికి అనుమతి ఉండేదికాదు. పైగా విద్యార్థులందరూ పైజామా, నీలిరంగు షేర్వానీ మాత్రమే ధరించి కాలేజ్‌కి వెళ్లాలి.

• St. హాలాన్స్ (ఇటలీలో పుట్టినవాడు) పోలీసు డి.ఐ.జి.గాను జైళ్ళ డి.ఐ.జి. గాను ఉండేవాడు. ఆయన ఒక ప్రత్యేక సర్క్యులర్ ద్వారా వందేమాతరం పాడటం నిషేధించాడు. దీనిని ఆర్యసమాజం వ్యతిరేకించింది. శ్రీ వందేమాతరం రాంచంద్రారావు ఆనాడు బి.ఎ. విద్యార్థిగా ఉస్మానియా యూనివర్సిటీలో ఉద్యమాన్ని లేవదీసాడు. ఈయన్ని 1928లో 15 రోజులు అక్రమంగా అబిడ్స్ పోలీస్ స్టేషన్లో నిర్బంధించి ఉంచారు. సిటి పోలీస్ కమీషనర్ కొండా వెంకట్రామరెడ్డి.

• ఇలా ఎన్నో ఆంక్షలుండేవి. కొంతకాలం గడిచిన పిదప ఆ ఆంక్షల్ని విద్యార్థిగణం ఎదిరించడానికి సిద్ధమైంది.

• నిషేధించిన వందేమాతర గీతాన్ని బహిరంగంగా సామూహికంగా గానం చేయడం మొదలు పెట్టారు.

• ధోవతులు, చొక్కాలతో తరగతులకు హాజరవడం మొదలుపెట్టారు విద్యార్థులు.

• 1938 నవంబర్ 29వ తేదీన అటువంటి విద్యార్థుల పేర్లన్నింటిని తొలగించింది, నిజాం ప్రభుత్వం.

• ఆగ్రహించిన విద్యార్థులు డిసెంబర్ 10 వరకు సమ్మె చేసారు.

• దాంతో నిజాం ప్రభుత్వం ఇంటర్ యూనివర్శిటీ బోర్డుపైన ఒత్తిడి తెచ్చి విద్యార్థులకు ఇక్కడెక్కడ సీట్లు దొరక్కుండా చేసింది.

• అయితే నాగపూర్ విశ్వవిద్యాలయం ముందుకు వచ్చి ఈ విద్యార్థులందరికి సీట్లనిచ్చింది.

• భాషను, వేషాన్ని మార్చి హిందూ విద్యార్థుల నాడుల్లోకి ఇస్లాం సంస్కృతిని ఎక్కించడానికి, విద్యార్థుల్ని నిజాంకు అనుకూలురుగా తయారు చేయడానికి నాటి విద్యావ్యవస్థ తన శక్తి వంచన లేకుండా ప్రయత్నించింది.

• ఇక ముస్లీం విద్యార్థులైతే రజాకార్లలో చేర్చుకున్నారు. వారిచేత ఈ క్రింది విధంగా ప్రతిజ్ఞ చేయించేవారు.

" . . . . . . . . . . అనే పేరుగల నేను ఏనాడు నా నాయకుడు నన్నాజ్ఞాపించినా, నేను పార్టీ శ్రేయస్సు కోసం, హైద్రాబాద్ రాజ్యశ్రేయస్సుకోసం, నా జీవితం అంకితం చేయడానికి ఇందుమూలంగా పవిత్ర శపథం చేస్తున్నాను. దక్కన్‌లో ముస్లిం ఆధిక్యాన్ని నిలిపేందుకు కడవరకూ, అల్లాపేర నేను పోరాటం జరపగలను." అని రాతపూర్వకంగా ప్రమాణంచేసేవాడు. (ఆంధ్రలో స్వాతంత్రోద్యమ చరిత్ర పుట 22) ఈ విధంగా ముస్లీంలలో మతపిచ్చిని బాగా దట్టించేవారు. హిందూ విద్వేషాన్ని నరనరాలకు ఎక్కించేవారు.

**సాహిత్యం - పత్రికలు :**

నిజాం కాలంలో ముస్లీమేతరుల సాహిత్యం బయటకు రావడం చాలా కష్టంగా ఉండేది. ఎలాగో బయటకు వచ్చిన పుస్తకంలో ఎక్కడైనా ముస్లిం వ్యతిరేకాంశం ఒక్కటి కనపడినాచాలు. అటువంటివి పత్రికైనా పుస్తకమైనా వెంటనే నిషేధింపబడేవి. ఆ రచయిత కత్తికి ఎర అయ్యేవాడు.

నిజాంగూర్చిగాని, రజాకార్ల గూర్చికాని, వారు అనునిత్యం హిందువులపై కొనసాగించే అకృత్యాలు, అన్యాయాలు, దౌర్జన్యాలు, దోపిడీలు, హత్యలు, లూటీలు, దహనాలు, మానభంగాలు మొదలగు వాటి గురించి ఎవ్వరు ధైర్యంచేసి కలమెత్తినా, గళమెత్తినా నిజాం ముష్కరమూకలు కత్తి ఎత్తేవారు. కుత్తుకల్ని కత్తిరించేవారు. ఈ విషయంలో మాత్రం ముస్లింలు, హిందువులు అనే బేధం చూపేవారు కాదు.

**ఉదా :** పత్రికా సంపాదకుడు షోయబుల్లాఖాన్ హత్య. నిజాం రాజ్యంలో నాన్ ముస్లీం అనేవాడు యాంటీముస్లీం, యాంటీముస్లీం అంటే యాంటీస్టేట్ ఇవన్నీనాడు సమానార్థకాలు. నిజాం సర్కారు హవనం వద్దన్నది కాబట్టి మేం హవనం చేసేవాళ్ళం. ఇలా . . . . నిజాం నిషేధించిన వాటిని చేయడం ద్వారా నిరసన ప్రకటించేవాళ్లం అన్నారు ప్రజాకవి కాళోజి నారాయణరావు.

'రహబరే దక్కన్' అనే పత్రికలో నిజాం స్వయంగా కొన్ని కవితలు రాసుకున్నాడు.

సల్తనే సల్ఫ్ సబ్‌హోగయే నజర్ అజల్ ఉస్మాన !

ముసల్మానోంకా తేరీ సల్తనత్ సేహై నిశాబాకీ !!

అనగా : పూర్వికుల రాజ్యాలన్నీ కాల గర్భంలో కలిసిపోయాయి. కాని ఉస్మాన్, నీరాజ్యంవల్లనే ఇవాల ముసల్మానుల చిహ్నాలు ఇంకా మిగిలి ఉన్నాయి.

బంద్‌నాకూన్‌హు వా సున్‌కే నారాయేకె తక్‌బీర్ !

జల్‌జలా ఆహిగయా రిశ్త ఏ జున్నార్ పర్ !!

అల్లాహో అక్బర్ అనే నినాదం వల్లనే శంఖానాదాలు ఆగిపోయాయి. శిఖ సూత్రధారులపై ప్రళయం వచ్చిపడింది. ఇలా సాగిపోయేది. నిజాం కవితా ధారా . . . .

హైదరాబాద్ సంస్థానాధిపత్యమే అలా ఉంటే నాటి మెజారిటీ పత్రికలు సుభే దక్కన్, రహబార్-ఎ-దక్కన్, లాంటి ఉర్దూ పత్రికలన్నీ మత విద్వేషాన్ని వెళ్ళ గక్కేవి. పాక్ అనుకూలతను ప్రదర్శించేవి. ఇక మిగతా ఉర్దూ, ఇంగ్లీషు, తెలుగు భాషలో వెలువడే మీజాన్, వక్త్, అనే పత్రికా మండలి అయితే నిజాం తొత్తులుగా ఉండేవి.

దక్కన్ క్రానికల్, గోలకొండపత్రిక, ఆర్యభాను, వైదిక్‌ఆదర్శ్ ముస్కిరెదక్కన్, మొహిబ్బెవతన్, రయ్యత్, ఇమ్‌రోజ్ మొదలగు కొన్ని పత్రికలు మాత్రం నిష్పాక్షికంగా వార్తలు, వ్యాఖ్యలు ప్రచురించేవి.

1948 జనవరి 24 నాటి ఇమ్‌రోజ్ పత్రికలో షోయబుల్లా ఖాన్ తన సంపాదకీయంలో మజ్లిస్ అరాచకాన్ని ఎండగట్టాడు. ఎర్రకోటపై అసఫియాఝుండాను ఎగురవేస్తానన్న కాశీం రజ్వీని దుయ్యబట్టాడు. మజ్లిస్‌ను (రజాకార్లను) నిషేధించాలని ధైర్యంగా ప్రకటించాడు. రజాకార్ల నాయకుడు కాశీంరజ్వీ దాన్ని జీర్ణించుకోలేకపోయాడు.

1948 ఆగస్టు 19న హైదరాబాద్‌లోని జమరుద్‌మహల్ సినిమా హాల్‌లో జరిగిన రజాకార్ల సభలో షోయబ్‌పై రజ్వీ నిప్పులు గక్కాడు. అంతే 1948 ఆగస్టు 21వ రాత్రి లింగంపల్లి చౌరస్తా దాటగానే షోయబుల్లాకాన్ హత్య చేయబడ్డాడు. పిదప ఆయన రెండుచేతుల్ని నరికి కసితీర్చుకున్నారు రజాకార్లు.

అడ్డుపడిన ఇస్మాయిల్ అనే వ్యక్తి చేయిని కూడా నరికేసారు. ఇదినాటి వాక్స్వాతంత్రానికి, పత్రికాస్వేచ్ఛకి ఉదాహరణ .

రహమత్ అలీ అనే ఆయన ఇంగ్లాండు నుండి "మిల్లట్ ఆఫ్ ఇస్లాం అండ్ మెనాన్స్ ఆఫ్ ఇండియనిజం" (ఇస్లాం జాతి - భారతీయ బెడద) అనే పుస్తకాన్ని మజ్లిస్ ప్రేరణతో, నిజాం ధన సహాయంతో ప్రచురించాడు. ఆ పుస్తకంలో ఆయన పేర్కొన్న కొన్ని విషయాలు ఇలా ఉన్నాయి.

- భారతదేశం ఎన్నడూ ముస్లింల మాతృభూమి కాదు.
- ముస్లింలు భారతదేశంతో ఎలాంటి సంబంధాలు పెట్టుకోకూడదు.
- ఉత్తర, పశ్చిమ భారత్‌లో ముస్లింలు సార్వభౌమత్వంగల పాకిస్తాన్‌గా, ఒకే జాతిగా ఏర్పడాలి.
- అస్సాం వెనుక భాగాన్ని కలుపుకొని 'బంగే ఇస్లాం' అనే పేరుతో బెంగాల్ రాష్ట్రం ఏర్పడాలి.
- హైదరాబాద్ ఉస్మానిస్తాన్‌గా నిర్మాణం కావాలి. ఇలా . . . పలువిషయాల్ని చర్చించింది రహమత్ అలీ పుస్తకం.

భారతదేశ విచ్ఛిన్నం, హిందూ విద్వేషం ప్రాతిపదికన కొనసాగింది ఆరచన, నాటి సాహిత్యం.

**జనాభా మార్పిడి సిద్ధాంతం :** ఎక్సేంజ్ ఆఫ్ పాపులేషన్ థియరీ అనేది నిజాం మూడవ షడ్యంత్రం. ఈ జనాభా మార్పిడి సిద్ధాంత ప్రతిపాదకుడు అబ్దుల్ లతీఫ్. ఈయన అప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంగ్లోపన్యాసకునిగా పనిచేసేవాడు. ఈయన ప్రతిపాదన ప్రకారం హైదరాబాద్ స్టేట్‌లోని హిందువులంతా ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళాలి. వారి స్థానంలో ఇతర ప్రాంతాల్లో నివసిస్తున్న ముస్లింలు హైదరాబాద్‌కు రావాలి. అలా చేసినట్లైతేనే హైదరాబాద్ స్టేట్ ముస్లిం స్టేట్ అవుతుంది అనేది లతీఫ్ ఆలోచన.

బహుశ నిజాం కలల్ని, లతీఫ్ ఆలోచనల్ని నిజం చేయడానికే ఉద్యమించాడేమో బహదూర్‌యార్‌జంగ్. హైదరాబాద్ నగరంలో 1938లో ధూల్‌పేటలో మతకలహాల్ని ప్రేరేపించాడు. అక్కడ చావు దెబ్బతిన్నాడు. దాంతో

కసి పెంచుకున్న బహదూర్‌యార్జంగ్ సంస్థానంలో ఎలాగైనా సరే ముస్లింల సంఖ్య పెంచి తీరాలని నిర్ణయించుకున్నాడు. అందుకై తీవ్ర ప్రయత్నాల్ని చేసాడు.

వివిధ ప్రాంతాల నుండి ముస్లింలను దిగుమతి చేసుకునే ప్రక్రియ నిరాఘాటంగా కొనసాగించడంతో సంస్థానంలో ఉద్రిక్తత పెరుగ సాగింది. 1948 నాటికి సంస్థానంలోకి దిగుబడి అయిన ముస్లింల సంఖ్య ఎనిమిది లక్షలు దాటింది. అలా లక్షల్లో దిగుమతి అయిన ముస్లింల నుండి వేలాదిగా నిజాం సైన్యంలో చేరగా కొంతమంది రజాకార్లలో చేరారు. మిగిలిన వారికి తామే స్వయంగా హిందువుల్ని దోపిడీ చేసుకుంటూ జీవించడానికి కావల్సిన లైసెన్సు లభించింది. ఈ విషయాల్ని భారతప్రధాని మరియు హోంమంత్రి పార్లమెంటులో ప్రకటించారు. హైదరాబాద్ సంస్థానంలో బహదూర్‌యార్జంగ్ కాలంలో వలంటీర్ దళంగా ఉన్న రజాకార్ల మూక, కాశిం రజ్వీ హయాంలో ఆయుధ శిక్షణతో ఒక ప్రయివేట్ సైన్యంగా మారింది.

ప్రసిద్ధ చరిత్రకారిణి ఆచార్య సరోజినీదేవి వివరణ ఇలా ఉంది. "1940 లో రజాకార్ల దళం ఏర్పడింది. 1947 జూలైలో వారికి సైనిక శిక్షణ ఇప్పించాలని నిర్ణయించడం జరిగింది. అందుకని భారీ ఎత్తున సంస్థానమంతటా రజాకార్ల రిక్రూట్‌మెంట్ జరిగింది. పెద్దలు, పిల్లలు, స్త్రీలను కూడా రిక్రూట్ చేసుకున్నారు. ఆ విధంగా 1947 నవంబర్ 3 నాటికి సర్కారు వారి లెక్కల ప్రకారం రజాకార్ల సంఖ్య 50 వేలు. కాశీం రజ్వీ ఆ సంఖ్యను ఐదు లక్షలకు పెంచనున్నట్లు ప్రకటించాడు.

1948 మార్చి 31 న ఇత్తెహదుల్ ముస్లిమీన్ హైదరాబాద్‌లో ఆయుధ ప్రదర్శనను జరుపుకుంది. అందులో ప్రసంగిస్తూ కాశిం రజ్వీ గమ్యం చేరేదాకా ముస్లింలు ఆగవద్దని, ఢిల్లీలోని ఎర్రకోటపై అసఫ్‌జాహి పతాకాన్ని ఎగురవేయటమే తమఅంతిమ లక్ష్యమని ప్రగల్భాలు పలికాడు. మొత్తం సంస్థానంలో పోలీసు చర్య ముగిసేనాటికి ఈ రజాకార్లు దాదాపు ఒక లక్షమందికి పైగా హిందువులను హతమార్చారు. 1947-1948 సంవత్సరకాలంలో చరిత్ర అంతా ఒక దుఃఖాధ్యాయం అనే చెప్పవచ్చు.




హైదరాబాద్‌ను ఇస్లామిస్తాన్‌గా చేయాలన్నదే నిజాం తాపత్రయం. అమాయకులైన హిందూ ప్రజానీకం యొక్క అవసరాలను, బలహీనతల్ని, అజ్ఞానాన్ని, పేదరికాన్ని ఆసరాగా చేసుకుని, ఆశల్ని కల్గిస్తూ, అపోహల్ని సృష్టిస్తూ హిందువులను మతమార్పిడి చేసే ప్రక్రియను ఉధృతం చేసాడు. తెర వెనుక ఉండి ఒక ఉద్యమాన్నే నడిపించాడు మీర్ ఉస్మాన్ అలీఖాన్. దీనికోసం సిద్దిక్‌దీన్‌దార్ పావుగా పనికివచ్చాడు.

1929 వ సం॥లో సిద్దిః దీన్‌దార్ తనను తానే చెన్నబసవేశ్వరుని అవతారమనే ప్రకటించుకోవడమే కాక లింగాయుత సంప్రదాయానికి ఆధునిక రూపమే ఇస్లామని బహుళ ప్రచారం చేసాడు. హిందూ దేవతల్ని నిందిస్తూ, హిందువుల్ని భ్రమల్లో పడవేస్తూ, జనమంతా ముస్లీంలుగా మారాలని, దళిత ప్రాంతాల్లో ప్రచారం చేస్తూ మతమార్పిడులను చేసాడు.

దీన్‌దార్‌కి హైదరాబాద్‌లోని అసిఫ్‌నగర్‌లో కార్యాలయం ఉండేది. నిజాం ప్రభుత్వంలోని దేవాదాయ శాఖ 'ఉమూర్ మజహబీ' ఈ మతమార్పిడులకు కావలసినన్ని నిధుల్ని అందిస్తుండేది. తాను కల్కి అవతారమని, వీరభోగవసంతరాయల్ని అని అమాయకుల్ని భ్రమింపచేస్తూ హుబ్లీ, ధార్వాడ్, గుల్బర్గా, రాయచూర్, బీదర్ తదితర ప్రదేశాల్లో విస్తృతంగా పర్యటిస్తూ ఎంతోమందిని మతం మార్చాడు.

నిజాం మానవమాత్రుడు కాదని, దైవావతారమని నిజాం గూర్చి వేదాల్లో, పురాణాల్లో, హదీసుల్లో, ఖురానుల్లో పలు ప్రస్తావనలున్నాయని అంటూ, నిజాం వ్యతిరేకులకు నిలువ నీడ ఉండదని, హిందువులంతా ముస్లీంలవుతారని హిందూ దేవాలయాలన్నీ ధ్వంసమవుతాయని, గాంధీ ఒక ముస్లీంగా మరణిస్తాడని, నెహ్రూ మానసికంగా ముస్లీం అవుతాడని సిద్దిఖీ తనకాలజ్ఞానం పేర విపరీతంగా విషప్రచారం చేసాడు.

మతమార్పిడి యథేచ్ఛగా కొనసాగించడానికి ప్రభుత్వాధికారాన్ని ప్రబలంగా వాడుకున్నాడు. ఉదాహరణకు ఒక సంఘటనను చూద్దాం. వెంకటరావు అనే బ్రాహ్మణుడు రెవెన్యూశాఖకు అప్పుపడి, దాన్ని తీర్చలేని స్థితిని ఆసరాగా చేసుకుని ఆయన్ని ముస్లింగా మార్చారు. తదనంతరం వెంకటరావు చిస్తి లింగనాఖ అనే పేరు చెప్పుకుంటూ నిజాం ఆజ్ఞ మేరకు ఆయన మద్దతుతో సంస్థానం అంతటా విపరీతంగా తిరుగుతూ తనశక్తికి మించి హిందువుల్ని మతం మార్చినాడు. ఈయనకు తోడుగా శ్యామసుందర్ అనే మరో వ్యక్తి కూడా ఉండేవాడు.

దీనికి తోడు నిజాం కూడా ముస్లిం జనాభా పెంచడానికి కొన్ని పద్ధతుల్ని అవలంభించాడు.

- ఇతర ప్రాంతాల్లోని ముస్లింలను ఎంతగా వీలయితే అంత మందిని హైదరాబాద్‌కు దిగుమతి చేసుకోవడం.
- సంస్థానంలోని హిందువులపై హత్యాచారాలు, అత్యాచారాలు దోపిడీలు జరిపి, భయకంపితుల్ని చేసి సంస్థానం వదలి పారిపోయేటట్లుగా చేయడం.
- అలా వలసపోగా మిగిలిన హిందువుల్ని ఎలాగోలా మతం మార్చడం.
- హిందువులకు ఉపాధి అవకాశాలు, రక్షణ లేకుండా చేయడం, అప్పటికే ఉద్యోగాల్లో ఉన్న హిందువుల్ని క్రమేణా తొలగించడం.
- 1931 గెజిట్ ప్రకారం మతాల వారిగా హైదరాబాద్ సంస్థానంలో ఉద్యోగస్తుల వివరాలు ఇలా ఉన్నాయి.

| హైదరాబాద్ సంస్థానంలోని ఉన్నతాధికారులు | | | |
|---|---|---|---|
| వర్గం | సైన్యం | ఇతర శాఖలు | మొత్తం |
| హిందువులు | 39 | 223 | 262 |
| ముస్లింలు | 45.9 | 1635 | 2094 |

| మతాల వారిగా కిందిస్థాయిలో ఉన్న ఉద్యోగులు | | | |
|---|---|---|---|
| వర్గం | సైన్యం | ఇతర శాఖలు | మొత్తం |
| హిందువులు | 6,495 | 16,873 | 23,368 |
| ముస్లింలు | 54,149 | 58,588 | 11,2,737 |

సంస్థానంలో జనాభా వివరాల్ని, హిందూ జనాభా క్షీణతకు సంబంధించి శ్రీమాడపాటి హనుమంతరావుగారు (తెలంగాణా - రెండవ భాగం పుట. 6) ఇలా రాసారు. నూటికి 80 మంది హిందువులు. తెలుగు జిల్లాలో ప్రతి 10 వేల మందిలో 8615 మంది హిందువులు, 911 మంది తురకలు, 66 మంది క్రైస్తవులు ఉన్నారు. మిగిలిన వారిలో ఇతర మతస్థులున్నారు. వీరిలో హిందువుల సంఖ్య నానాటికీ క్షీణిస్తూ వచ్చింది.

| సంవత్సరము | ప్రతి పదివేల మందికి హిందువుల సంఖ్య |
|---|---|
| 1881 | 9,053 |
| 1891 | 8,985 |
| 1901 | 8,915 |
| 1911 | 8,615 |

మహమ్మదీయుల సంఖ్య, క్రైస్తవుల సంఖ్య క్రమక్రమంగా పెరుగుతూ వచ్చింది. హిందువుల సంఖ్య తగ్గింది అని శ్రీమాడపాటి హనుమంతరావు రాసారు. కాని ఎందుకు హిందూ జనాభా తగ్గిందో కారణాల గూర్చి మాత్రం చెప్పలేదు. అయితే నిజానికి మతం మార్పిడుల వల్లనే ఈ పరిణామం సంభవించిందనేది సత్యం.

సంస్థానంలో మెజారిటీ వర్గంగా హిందువులుండడం ఎప్పటికైనా ప్రమాదమన్న విషయాన్ని గ్రహించిన నిజాం ప్రభుత్వం ముస్లింల సంఖ్య పెంచడం తప్పనిసరి అని భావించింది. ఈ విషయం బహదూర్‌యార్జంగ్‌కు చాలా స్పష్టంగా తెలుసునని హైదరాబాద్ సంస్థానం చివరి ప్రధాని లాయక్‌అలీ 'ట్రాజడీ ఆఫ్ హైదరాబాద్' అనే తన పుస్తకంలోని 44-వ పుటలో రాసాడు.

'ముస్లీం ఎక్తెదార్' (ముస్లీం ఆధిక్యత) అనేది మజ్లిస్ నినాదం. అందుకోసం 'తబ్లిక్' (మతమార్పిడి) ఒక్కటే శరణ్యమని, మతమార్పిడి ఉద్యమాన్నే వీలున్న అన్ని మార్గాల్లో ఉధృతం; విస్తృతం చేసారు. బహదూర్ యార్జంగ్ తన మజ్లిస్ శాఖలన్నింటికి మతమార్పిడులకు సంబంధించి ఒక రహస్య సర్క్యులర్ జారీ చేసాడు. తపాలా శాఖలో పనిచేసే ఆర్యసమాజ కార్యకర్త బి. వెంకటస్వామి ఈ కుట్రను పసిగట్టి ఆర్యసమాజ నాయకుడు పండిత నరేంద్రజీకి ఈ రహస్య సర్క్యులర్ విషయాన్ని తెలియ చేసాడు.

దాంతో ఆర్యసమాజ కార్యకర్తలు రంగంలోకి దుమికారు. మతమార్పిడులను అరికట్టడానికి విశేష కృషిచేసారు. అయితే ఈ తబ్లిక్ ఉద్యమం ద్వారా 1938 వరకు 12 వేల మంది హరిజనులను ముస్లీంలుగా మార్చారు. ఆ తర్వాత ఆరేళ్ళలో అంటే 1944 వరకు మరో ఎనిమిదివేల మంది హరిజనుల్ని ముస్లీంలుగా మతం మార్చారు.

వేలాదిగా జైళ్ళలో మగ్గుతున్న హిందూఖైదీలకు బలవంతంగా ముస్లీం మతబోధ చేసేవారు. మతం మార్చుకున్నవారికి శిక్షను తగ్గిస్తామని ఆశను చూపించేవారు. 1938-1944 ల మధ్య వరంగల్, నల్గొండ, ఔరంగాబాద్, మరాట్వాడలో సామూహిక మతమార్పిడులు జరిగాయి.




1923 లో హైదరాబాద్‌లో జరిగిన మతకలహాల్లో హిందువులు అధికంగా నష్టపోయినా గట్టి జవాబు చెప్పారు. ముస్లీంల రక్షణ, హిందూ భక్షణకై 1927లో ఇత్తెహదుల్ ముస్లిమీన్ (రజాకార్ల సైన్యం) బహదూర్ యార్జంగ్ నాయకత్వంలో తన పైశాచిక కృత్యాలను ప్రారంభించింది. ఆయన తర్వాత నాయకుడైన రక్తపిపాసి కాశీం రజ్వీ హైదరాబాద్ సంస్థాన చరిత్రలో మరో మహమ్మదాలీ జిన్నా అయ్యారు.

- దక్కన్ రేడియో, సుమారు పది ఆంగ్ల, ఉర్దూ దిన పత్రికలు రజాకార్ల ఆధీనంలో ఉండేవి. వారికి బాకాలుగా పనిచేసేవి. ఎంత తక్కువ అంచనావేసినా రజాకార్ల దినసరి ఖర్చు 30 వేల రూపాయలకు మించి ఉండేది. వీరికి హైదరాబాద్ సేనకు సంబంధించిన మేజర్ అమీరుద్దీన్, లెఫ్టినెంట్ కల్నల్ గులాం మొహియుద్దీన్ ఆయుధ శిక్షణ నిచ్చేవారు, రజాకార్లకు కావలసిన ఆయుధాలు, వాహనాలు, తర్ఫీదు, డబ్బు సకలం నిజాం సమకూర్చేవాడు.
- హమీను జుబేరీ, మౌల్వీకాశీం రజ్వీ, మౌల్వీ అబ్బుర్రౌఫ్, మౌల్వీ అబ్దుల్ ఖుసూర్‌లు ఒక రహస్య సమావేశం జరిపి ఒక యాక్షన్ ప్లాన్‌ను తయారుచేసారు.
- హిందువుల సంపదల్ని దోచుకోవడము లేకపోతే దహింపచేయడం.
- మజ్లిస్‌ను వత్యిరేకించినా, ఇండియన్ యూనియన్‌కు మద్దతు తెలిపినా అలాంటి వారందరిని హత్యచేయడం.
- ఆజాద్ హైద్రాబాద్ కోసం రజాకార్లంతా ప్రాణాలర్పించడానికైనా సిద్ధంగా ఉండాలి మొదలగు పలు అంశాలు ఈ యాక్షన్ ప్లాన్‌లో ఉన్నాయి.
- భారత దేశం స్వతంత్రం పొందే దశలో ఇలాంటి ప్రత్యక్ష చర్యనే అమలు పరిచాడు మతోన్మాది జిన్నా, పాకిస్తాన్‌ను సాధించుకోవడం కోసం.
- జిన్నాను ఆదర్శంగా తీసుకుని దక్షిణాపథంలో మరోపాకిస్థాన్‌ను ఏర్పాటు చేసి నిజాంకు కట్టబెట్టాలని ప్రయత్నించారు.
- ఒకవేళ ఉస్మాన్ అలీఖాన్ ఏ సందర్భంలోనైనా మెత్తబడితే నిజాంను సైతం తొలగించి రజాకార్ల రాజ్యం స్థాపించాలని కాశీం రజ్వీ కలలు కన్నాడు. అందుకై ప్రణాళికను రచించాడు.
- 1935 నుండి 1948 వరకు పదమూడు సంవత్సరాలకుపైగా ఎడతెరపి లేకుండా ఇటు రజాకార్లు అటు నిజాం సైన్యం వారి అనుయాయులు కలసి హిందూ సమాజంపై దమనకాండ కొనసాగించారు. రక్తపాతాన్ని సృష్టించి పైశాచికానందం అనుభవించారు. చరిత్రలో ఇటువంటి

హృదయవిదారక దృశ్యాలు కోకొల్లలు, వాటి గురించి ఎంత చెప్పినా అది కొండంతలో పిసరంతే అవుతుంది.

- 1947 ఆగస్టు 15 తర్వాత స్వతంత్ర భారతావని స్వేచ్ఛావాయువుల్ని పీల్చుకుంటూ సంబరాలు జరుపుకుంటుంటే హైదరాబాద్ సంస్థానంలోని హిందూ ప్రజానీకం నిజాం నియంతృత్వానికి రజాకార్ల పైశాచికత్వానికి బలై ఎలా తల్లడిల్లిందో... మచ్చుకు కొన్ని సంఘటనల్ని పరికిద్దాం.
- 1947 సెప్టెంబర్ 7న భారత ప్రధాని నెహ్రూ పార్లమెంటులో ఒక ప్రకటన చేసారు. హైదరాబాద్ సంస్థానంలో రజాకార్లమూకలు 70 గ్రామాలపై దాడులు జరిపారు. వందలాది మందిని హత్యలు చేసారు. వేలమంది క్షత గాత్రులయ్యారు, అనేక మంది స్త్రీలు బలాత్కరింపబడ్డారు. పన్నెండుసార్లు రైళ్ళదోపిడి జరిగింది. కోట్ల రూపాయల ఆస్థి లూటీ జరిగింది. లక్షలాది మంది ప్రజలు మాన, ప్రాణాల్ని రక్షించుకునేందుకు సంస్థాన సరిహద్దు ప్రాంతాలకి వెళ్ళిపోయారు.
- అటువంటివి లెక్కకు మిక్కిలిగా సంఘటనలు ఇక్కడ జరిగితే భారత ప్రధానికి వందలో సంఖ్యలో అనిపించింది.
- 'సైన్యం కదిలిద్దాం - నిజాం దుమ్ముదులిపేద్దాం' అన్న నాటి హోంమంత్రి సర్దార్ పటేల్‌ను నిలువరించాడు. అన్ని తెలిసి అది విననట్లు ప్రధాని వ్యవహరించాడు. మంతనాల పేరిట ఒక సంవత్సరానికి పైగా కాలయాపన చేసారు. దాని పర్యవసానంగా అనేక సంఘునటలు ఆ సంవత్సరకాలంలోనే జరిగాయి. అటువంటి వాటిని కూడా కొన్నిటిని చూద్దాం.
- 1947 ఆగస్టు 8 వరంగల్‌లో త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసినందుకు మొగిలయ్యను దారుణంగా కత్తులతో పొడిచి. చంపారు రజాకార్లు. మొగిల్యాను హత్యచేసిన 'ఖాసిమ్ షరీఫ్'కు పూలదండలేసి వీధుల్లో ఊరేగించాడు. నాటి వరంగల్ సుబేదార్.
- 1947 ఆగస్టులోనే రేణిగుంటలో రామిరెడ్డిని హత్యచేసి నిజామిజాన్ని ప్రకటించారు.

- 1947లోనే... 'వాడి' రైల్వేస్టేషన్ పక్కగ్రామంలో బ్రతుకమ్మ పండుగ చేసుకుని రైల్లో తిరిగివస్తున్న వందలాది మంది హిందూ స్త్రీలను గాండ్లాపూర్ వద్ద రైలును నిజాం మూకలు ఆపి కిందకి దింపింది. మగవాళ్ళను కాళ్ళు చేతులు కట్టి పడేసారు. స్త్రీలను ట్రక్కుల్లో ఎక్కించుకుని సమీపంలోని పోలీస్‌స్టేషన్‌లోకి తీసుకెళ్ళి స్త్రీ లందరిని నగ్నంగా చేసి పిరుదులపై లాటీలతో కొడుతూ బలవంతంగా బ్రతుకమ్మను ఆడించారు. ఇంకా...
- 1947 ఆగస్టు 21న హైదరాబాద్‌లో ఇమ్‌రోజ్ పత్రికా సంపాదకుడు షోయబుల్లా ఖాన్ హత్య.
- అమీర్‌పేట, పంజగుట్టల్లో దోపిడీలు, మానభంగాలు.
- వరంగల్‌లోని అష్రఫ్‌పేటలో దోపిడి 21 మంది హత్య.
- 1947 అక్టోంబర్ 7న ఆత్మకూరు పరిసర ప్రాంతాల్లోని పలు గ్రామాలపై దాడి, దోపిడీ, 11 మంది హత్య.
- 1947 డిసెంబర్ 8న నిజం పోలీసులచే బీజాపూర్ జిల్లాలోని చవనబాయి గ్రామ దోపిడి.
- 1947 డిసెంబర్ 12న గద్వాల తాలూకాలోని అయిదు గ్రామాల ప్రజలు పన్నుకట్టడానికి తిరస్కరించిన కారణంగా ప్రజలపైదాడి 4 గురి హత్య, 20 మందికి గాయాలు.
- 1947 డిసెంబర్ 31న షోలాపూర్‌లోని కాసెగాంవ్, తుల్జాపూర్ బుధవారం పేటల్లో దోపిడి, స్త్రీల అపహరణ మానభంగం.
- 1948 జనవరి 9న వరంగల్ జిల్లా మానుకోట తాలూకాలోని పెరుమాళ్ళ సంకేస గ్రామదోపిడి.
- 1948 జనవరి 10న భువనగిరి, బీబీనగర్‌లపై దాడి, దోపిడీ మానభంగాలు, హత్యలు.
- 1948 జనవరి 15న ఖమ్మం జిల్లాలోని మీనబోలు గ్రామంపై దాడి. హింసాకాండ.

- 1948 ఫిబ్రవరి 1న రజాకార్లు నిజాంపోలీసులు కలిసి షోలాపూర్‌లోని తడ్వాల్ గ్రామంపై దాడి, హత్యాకాండ.
- 1948 ఫిబ్రవరిలోనే జనగామ తాలూకాలోని కోటకొండ గ్రామం రజాకార్లకు చందా ఇవ్వని కారణంగా గ్రామంపై దాడి 13 మంది హత్య.
- 1948 మార్చి 2న బొంబాయి సమీపంలోని హల్బేరి గ్రామదోపిడి.
- 1948 మార్చి 4న భువనగిరి తాలూకాలోని రేణిగుంట గ్రామ రక్షణ దళానికి రజాకార్ల నిజాం సైన్యానికి భీకరపోరాటం. చివరకు ఏమి చేయమని చెప్పి నిజాం సైన్యం హామి నిచ్చినమీదట గ్రామ రక్షక దళం రామిరెడ్డిమేడమీద నుండి దిగి వచ్చింది. వారిని దగా చేసి 26 మందిని చంపి ఎడ్ల బండ్లపై వేసి కాల్చేసారు. మరో 70 మందిని బంధీలుగా పట్టుకెళ్ళారు.
- 1948 ఏప్రిల్ 10న ఉస్మానాబాద్ జిల్లాలోని కర్గాంవ్ గ్రామదోపిడి.
- 1948 ఏప్రిల్ 14న ఉస్మానాబాద్ జిల్లాలోని సరోబా గ్రామ దోపిడి.
- 1948 ఏప్రిల్ 20న మహబూబ్ నగర్ జిల్లాలోని బోర్‌వెల్లి గ్రామంపై దాడి. దళిత స్త్రీలందర్ని మానభంగాలు చేయగా వారంతా ఆత్మహత్య చేసుకున్నారు.
- 1948 ఏప్రిల్ 29న నల్గొండ జిల్లాలోని నర్సింలు గూడెంపై దాడి.
- 1948 ఏప్రిల్ 30న రెండవసారి నర్సింలు గూడెంపై దాడి.
- 1948 మె 4న లక్ష్మీపురంలో రైతుల దోపిడి, స్త్రీల మానభంగం.
- 1948 మే 8న షోలాపూర్‌లోని మంగ్రోలు గ్రామంలో విధ్వంసకాండ అత్యాచారాలు.
- 1948 మే 14న అలంపూర్ తాలూకాలోని గాందిమళ్ళ గ్రామంపై దాడి, మానభంగాలు.
- 1948 మే 15న బీజాపూర్ జిల్లాలోని ఎనిమాడు గ్రామంలో హత్యాకాండ.
- 1948 మే 22న మద్రాస్ బాంబేరైలుపై గాన్గాపూర్ స్టేషన్లో దాడి.

తిక్కల్ కోట సంస్థానంలోని దర్శిగ్రామ దోపిడి.

- 1948 మే 23న విజయవాడ సమీపంలోని ఎర్రుపాలెం రైల్వేస్టేషన్లో విజయవాడ పాసింజర్ దోపిడి.
- 1948 మే 25న ఆదోని తాలూకాలోని చిన్నకొట్టాలి గ్రామదోపిడి.
- 1948 మే 26న జహ్మానుమా గ్రామ దోపిడి.
- 1948 మే 28న కాజీపేట డోర్నకల్ సెక్షన్‌లోని గుండ్రాతిమడుగు స్టేషన్‌పై దాడి.
- బుల్డవా జిల్లాలోని గ్రామాగాంవ్ పై దాడి.
- 1948 మే 31న బార్సీ తాలూకాలోని పంపల్‌వాడి గ్రామ ముట్టడి.
- 1948 జూన్ 3న బార్సీలైట్ రైల్వేలైన్‌లోని ఢోకీస్టేషన్ వద్ద రైలు దోపిడి, 400 మంది హిందువులపై దాడి.
- 1948 జూన్ 5న బీజాపూర్ జిల్లాలోని సల్వాద్గీ గ్రామంపై దాడి.
- 1948 జూన్ 12న సికింద్రాబాద్ విజయవాడ పాసింజర్ నుండి 80 మంది హిందువుల్నే దింపి ఖమ్మం స్టేషన్లో నానా హింసలకు గురిచేసారు.
- 1948 జూన్ 16న చాందా జిల్లాలోని నగారా గ్రామదోపిడి.
- 1948 జూన్ 22న శివపురం పై దాడి.
- 1948 జూన్ 23న నందిగామ తాలూకాలోని జోన్నలగడ్డ గ్రామ ముట్టడి.
- 1948 జూన్ 25న నాలేగాంవ్ గ్రామ ముట్టడి.
- 1948 జూన్ 29 న బెలిగట్టి గ్రామదోపిడి.
- 1948 జూలై 1న బార్సీ తాలూకాలోని గోరెగాంవ్‌పై దాడి.
- 1948 జూలై 5న గుల్బర్గా జిల్లాలోని సైదాబాద్ పరిసర ప్రాంతాల్లో 15 మంది స్త్రీలను హృదయ విదారకంగా, పరమకిరాతకంగా మానభంగం
- 1948 జూలై 8న నివాలి మరూద స్టేషన్లో రైలు పడగొట్టేందుకు యత్నం.
- 1948 జూలై 12న అర్లీ గ్రామంపై దాడి హత్యలు, అత్యాచారాలు.
- 1948 జూలై 13న బీజాపూర్ జిల్లాలోని భాగల్వార్‌పై దాడి

- 1948 జూలై 16న బరారు సరిహద్దుల్లోని రాజ్‌గాంవ్‌పై దాడి.
- 1948 జూలై 17న ఇండియన్ యూనియన్ గ్రామమైన శిమ్మూరుపై దాడి.
- 1948 జూలై 17న నందిగామ తాలూకాలోని సిరిపురంపై దాడి.
- 1948 జూలై 19న ఇండియన్ యూనియన్ గ్రామమైన గుండ్రంపల్లిపై రజాకార్లు దాడిచేసి 21 మంది మగవాళ్ళను ఊరు బయటకు తెచ్చి వరుసగా నిలబెట్టి కాల్చిచంపి పక్కనే ఉన్న మసీదు దగ్గర్లోని ఒక గోతిలో ఆ శవాల్ని పడేసి నిప్పుబెట్టాడు.
- 1948 జూలై 24న సరిహద్దులోని నానాజిగాంవ్‌పై దాడి.
- 1948 ఆగస్టు 25న రజాకార్లు కూటిగల్లుపై దాడిచేసి 30 మందిని కాల్చి చంపారు.
  సూర్యాపేటలో ప్రశాంతంగా జరుపుకుంటున్న ఒక ఊరేగింపుపై కాల్పులు జరిపి ఆరుగురిని హత్య చేసారు.
- 1948 ఆగస్టు 25న చేర్యాల తాలూకాలోని భైరోన్‌పల్లి గ్రామంపై దాడి ఉదయం నాలుగున్నర గంటలకే నిజాం ముష్కర్ మూకలు దాడి ప్రారంభించి అత్యంత క్రూర రీతిలో హత్యాకాండ సాగించారు. 92 మంది హిందువుల్ని వరుసగా నిలబెట్టి త్రినాట్ త్రీ రైఫిల్‌తో ఒకసారి ఎంతమంది ప్రాణాలు తీయవచ్చునో ఇక్కడ ప్రయోగం చేసారు. అందరి ప్రాణాల్ని తీసారు. కనపడ్డ స్త్రీనల్లా బలాత్కరించారు. ఈ దారుణ మారుణకాండలో కాశీం రజ్వి ముఖ్య అనుచరుడు మొహజ్జంహుస్సేన్, నల్గొండ కలెక్టర్ అత్యుత్సాహంతో పాల్గొన్నారు.
- 1948 ఆగస్టు 28న సూర్యాపేట తాలూకాలోని పాతర్లపహాడ్ మట్టి అంతా ఈ భూపుత్రుల రక్తంతో ఎరుపెక్కింది. నిజాం సర్కారులకు పన్నులు కట్టమని ఎదురు తిరిగినందుకు ఆ పల్లెపై దాడిచేసి 17 మంది ప్రాణాలు తీసారు. గ్రామ ప్రజలందర్ని ఘోరంగా హింసించారు.
- ఇంకనూ వరంగల్ జిల్లాలో పర్కాల, అక్కిరాజుపల్లెలో మూకుమ్మడి హత్యలు, జనుగామ తాలూకాలోని పస్రమడ్ల బీట కోడూరు, ఇప్పగూడెం,

పాలకుర్తి, రంగాపురం, వర్దన్నపేటలోని కొరికిపాక, చౌటుపల్లిలలో 60 వేలకుపైగా కుటుంబాలు నాశనమైనాయి. వేలాది మంది స్త్రీలు బలాత్కరింపబడ్డారు.

- నల్లగొండ జిల్లాలోని రహీంఖాన్‌పేట, చాడ, నేముల యాదగిరిపల్లి, మల్లాపురాయి, రేణిగుంట, భువనగిరి, ఎర్రంపల్లి కొలపాక తాలూకాలోని దూది వెంకటాపురం మొదలగు ప్రాంతాల్లో కనీసం రెండువేల మంది హత్యకు గురయ్యారు. అత్యాచారాలకు అంతేలేదు.
- ఇలా ప్రతి జిల్లాలోను రజకార్లు, నిజం పోలీసులు చేసిన దురాగతాలు అనేకం. గుండెలవిసిపోయేటట్లు జరిగిన దుర్ఘటనల గాథలు తెలుసుకోవాలంటే, నాటి వృద్ధతరాన్ని ఒక్కసారి కదిలించి చూడండి. బోరుబోరున విలపిస్తూ నాటి నిజాం దురాగతాల్ని ఏకరువుపెడ్తారు. వినేవారి ఇంద్రియాలు చేష్టలుడిగిపోతాయి. నిజాం పాలనలో జరిగిన దారుణమారణ కాండకు సంబంధించిన అంశాలను గూర్చి రాస్తే ఓ బృహత్ గ్రంథమే అవుతుంది. నిజాం

పాలనలో రైల్వే సౌకర్యాన్ని, రోడ్డు సౌకర్యాన్ని ఉచితంగా పొంది ఇతర ప్రాంతాల నుండి మారణాయుధాలు తెప్పించుకొని, రజాకార్ సేనల్ని పటిష్టం చేసాడు రజ్వీ, దారు-ఉ-సలామ్ ప్రధాన కేంద్రంగా రజ్వీ హైదరాబాద్ సంస్థానంలో మొత్తం 55 రజాకారకేంద్రాల్ని నెలకొల్పి ప్రతీ కేంద్రాన్ని ఒక కమాండర్ నాయకత్వంలో నడిపించేవాడు. ఈ సెంటర్లలో రజాకార్లకు రిటైర్డు సైనికులు సాయుధశిక్షణ నిచ్చేవారు. అప్పటి పోలీసు కమీషనర్ నవాబ్ దీ నయార్‌జంగ్, రజ్వీకి పూర్తి సహకార మందించాడు.

- పోలీసు చర్యకు ముందు హైదరాబాద్ సంస్థానంలో రజాకార్లు హిందువుల నుంచి దోచుకున్న సొత్తు ఎంత తక్కువగా అంచనావేసిన 70 కోట్ల రూపాయలదాకా ఉంటుందని, ఆ మొత్తంలో అటు నిజం ప్రభుత్వానికి ఇటు మిగతా దోపిడీగాండ్రకు వాటాలుపోగా రజాకార్ల

సంస్థకు కనీసం 40 కోట్లు ముట్టిందని, నిజాం నియంతృత్వానికి వ్యతిరేకంగా ఉవ్వెత్తున లేచి ప్రజా ఉద్యమంలో కీలక పాత్రను పోషించిన శ్రీ వందేమాతరం రాంచంద్రారావు నాకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఈ విషయం చెప్పారు.

రజకార్ల రాక్షసత్వాన్ని నిజాం నిరంకుశత్వాన్ని క్లుప్తంగా చెప్పాలంటే... గుండెలదరిపోతాయి ! కళ్ళలోనుండి రక్తాశ్రువులు ఉబికివస్తాయి. !!



# 9 విప్లవజ్యోతి-చైతన్యదీప్తి



స్వామి దయానంద సరస్వతి

1857 ప్రథమ భారతస్వాతంత్ర సంగ్రామం పిదప భారతదేశంలో ఆంగ్లేయ ప్రభుత్వం స్థిరపడింది. ఆంగ్లేయుల కపటదృష్టి మన దేశ భాషా, సంస్కృతులపై పడింది. ఈ దిశలో పట్టు సాధించడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. అందులో భాగంగానే మెకాలే కుటిలనీతి ఆధారంగా, భారత్‌లో బానిస విద్యావిధానం ప్రవేశపెట్టబడింది. (నేటికి అదే విద్యావిధానం కొనసాగుతుంది)

ఈ విద్యా విధానం ప్రవేశపెట్టడంలోని ఆంతర్యం ఆయన మాటల్లోనే చెప్పాలం "ఈ నూతన విద్యావిధానం వలన భారతీయుల రూపంలో ఉన్న బ్రిటీష్ వారు తయారవుతారు అన్నాడు మెకాలే. శాశ్వతంగా భారతదేశాన్ని తమ వల సామ్రాజ్యంగానే ఉంచుకోవాలనే దుష్ట తలంపుతో భారతీయుల్ని త ఆలోచనలకు అనుగుణంగా మార్చుకునేందుకు కావలసిన ఎత్తులు, జిత్తు అన్నీ చేసారు.

ఏది నశించడం వలన జాతి నశిస్తుందో... ఆ ప్రమాదాన్ని మహర్షి దయానంద సకాలంలో గుర్తించారు. సకల వేదశాస్త్రాలను అవలోకనం చేసుకోవడంతో పాటు ఆధ్యాత్మిక, సామాజిక, రాజకీయ అంశాలను కూడా బాగా అధ్యయనం చేసారు. బ్రిటీష్ వారు విభజించి పాలించు అనే తమ కుటిలనీతితో, సమాజాన్ని ఎలా బలహీనం చేస్తున్నారో గమనించారు.

భారతీయ సంస్కృతికి అనుగుణంగా, సమాజాన్ని నిర్మించడానికి జాతీయ స్పృహతో కూడిన విద్యా విధానం కావాలని గుర్తించారు. దానితోపాటు స్వాతంత్ర సముపార్జన తప్పనిసరి అని భావించి రాజకీయంగా తిరుగుబాటు తేవడానికి, విప్లవాన్ని సృష్టించడానికి శ్రీకారం చుట్టారు. ఎందరో స్వదేశీ రాజుల్ని మేల్కొల్పినారు. బ్రిటీష్ సైన్యంలో ఉన్న భారతీయ సైనికుల్ని ప్రభావితం చేసి సైన్యంలో చిచ్చురగల్చడానికి అజ్ఞాతంగా ఉండి అవిశ్రాంతంగా శ్రమించాడు. 1857లో వచ్చిన విప్లవానికి కావలసిన ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని అందించినవారిలో మహర్షి దయానందులే అగ్రగణ్యులు. దురదృష్ట వశాత్తు ఆ తిరుగుబాటు విఫలమైంది.

సమాజంలో ప్రబలంగా ప్రబలిఉన్న కురీతుల్ని తొలగించడానికి, ధార్మిక విప్లవం తేవడానికి తీవ్రంగా కృషి చేస్తూనే ఎంతో మందిని స్వాతంత్ర్య సముపార్జనకై సమరోన్ముఖుల్ని చేసిన ఘనత స్వామి దయానందులకే దక్కుతుంది. ఆయన యొక్క అవిరళ, అజ్ఞాత కృషివలన ఎంతోమంది స్వాతంత్ర సమరంలో దుమికారు. మచ్చుకు కొన్ని పేర్లు.... ప్రథమ క్రాంతి కారుడు శ్యామ్ జీ కృష్ణవర్మ, లాలా హరదయాల్, భాయీ పరమానంద, మదన్‌లాల్ డేంగ్రా, రాంప్రసాద్ బిస్మిల్, తిస్సాకుల్లా, సర్దార్ భగత్‌సింగ్, చంద్రశేఖర ఆజాద్ వంటి క్రాంతికారులతోపాటు... స్వామి శ్రద్ధానంద్, లాలాలజపతిరాయ్, బాబూరాజేంద్ర ప్రసాద్, ఉక్కు మనిషి సర్దార్ వల్లబ్ భాయిపటేల్, లాల్‌బహదూర్‌శాస్త్రి, చౌదరీ చరణ్‌సింగ్ లాంటి ఎందరో నాయకుల్ని భరతజాతికి అందించిన మహాసంస్థ ఆర్యసమాజం అన్న సంగతి చాలా తక్కువమందికి మాత్రమే తెలుసు.

స్వరాజ్యమే సర్వసమస్యలకు పరిష్కారం అనే భావనతో 'స్వరాజ్యం' అనే మంత్రాన్ని జాతికందించింది. క్రొత్త ఊపిరిపోసింది. మహర్షి దయానందులే. ఆయన మేల్కొలుపు తాకిడికి రాష్ట్రీయ విస్ఫులింగాలు రగులుకున్నాయి. 1875లో బొంబాయిలో మహర్షి దయానందులు ఆర్యసమాజాన్ని స్థాపించారు. ధార్మిక ప్రచారంతోపాటు జాతీయ భావన మేల్కొల్పబడింది. అది అంచెలంచెలుగా ఎదిగి అనతి కాలంలోనే దేశమంతా విస్తరించింది, వివిధ అంశాలపై దృష్టి నిలిపింది.

- తన లక్షసాధనకై ఇలా కార్యప్రణాళికను రూపొందించుకుంది.
- వందలాది విద్యాలయాలు, గురుకులాలు స్థాపించి విద్యా వ్యాప్తికి కృషిచేయడం.
- దేశంలో ప్రాంతాల వారిగా ప్రజలు పలుభాషలు మాట్లాడు తున్నప్పటికి దేశమంతటిని సమైక్యంగా నిలిపేందుకు ఒక జాతీయ భాష అవసరాన్ని గుర్తించి హిందీభాషకు ఆప్రాధాన్యత (జాతీయభాషహోదా) నిచ్చింది ఆర్యసమాజం.
- సమాజంలో పాదుకుపోయిన పలుదురాచారాల్ని దూరంచేసేందుకు గళమెత్తింది. కృషిచేసింది.
- అస్పృశ్యతా నివారణ, ఎల్లరికీ దేవాలయ ప్రవేశం, వేదాధ్యయన అవకాశం కలిగించడం.
- సమాజ నిర్మాణంలో స్త్రీయొక్క ప్రాముఖ్యతను గుర్తించి స్త్రీ విద్యకు అధిక ప్రాధాన్యత నివ్వడానికి అనేక కన్యా గురుకులాల్ని స్థాపించింది. ఇంకనూ ఉచితంగా విద్యనందించడం, బాల్య వివాహాల్ని నిరోధించడం, వితంతు వివాహాల్ని సమర్థించడం.
- "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అనే ఆర్యోక్తికి సార్థకత చేకూర్చడానికి జీవచ్ఛవంలోపడిఉన్న సమాజంలో జవసత్వాల్ని నింపడానికి అఖాడా (వ్యాయమశాల) ల్ని వాడవాడల స్థాపించి శక్తివంతమైన యువతర నిర్మాణానికి కృషిచేసింది.

- సత్సంగాలను స్థాపించి సత్సంస్కారాల్ని కలిగించి సమైక్యతను సాధించడానికి కృషిచేయడం.
- యజ్ఞ సంస్కారాన్ని సామాన్యులకు సైతం అందుబాటులో ఉంచడం.
- పర్వదినాలను సామూహికంగా జరుపుకోవడాన్ని పోత్సహించడం ద్వారా తరతమ బేధాల్ని మరిచిపోయేట్లు చేయడం. (దసరా మొదలగునవి)
- గోవధ, జంతుబలి, మధ్యపానం, ధూమపానాది దుర్వ్యసనాల నిషేధానికి ఉద్యమించడం.
- మత మార్పిడిని నిరోధించడం, కుల నిర్మూలనకు కృషిచేయడం.
- మత మార్పిడికి పాల్పడే ఇతర మతాచార్యులచే శాస్త్రార్థం జరిపి వారిని ఓడించడం.
- మతం మారిన వారిని తిరిగి శుద్ధి సంస్కారం ద్వారా హిందూ జీవన స్రవంతిలోకి తేవడరీ పునరాగమన అవకాశాన్ని సృష్టించడం.
- స్వధర్మ, స్వజాతి, స్వదేశ సంరక్షణకై సమాజాన్ని సమాయత్తం చేయడం.
- మూఢాచార నిర్మూలనం, సంస్కార నిర్మాణం, సంఘటనా నిర్మాణం సమసమాజ స్థాపనం, వేదోద్దారణాధి లక్ష్యాలుగా ముందుకు సాగింది ఆర్యసమాజం.
- ధర్మార్థ కామమోక్షాలకు, కౌమార, గృహస్థ, వానప్రస్థ సన్యాసా శ్రమాలను సరిగా నిర్వచించింది, ఆచరించింది కేవలం ఆర్య సమాజమేనన్నది నిర్వివాదాంశం.
- రాష్ట్రీయ చింతనను ప్రేరేపించేందుకని పలు పత్రికల్ని నడిపింది. అపారమైన సాహిత్యాన్ని అందించింది.
- సమాజాన్ని సంఘటితం చేసింది, స్వాతంత్ర్యానికై ప్రేరేపించి, సమరోన్ముఖుల్ని చేసింది.

# 10 నిజాంను నిలువరించిన తేజం-ఆర్యసమాజం

1857 నుండి 1947 వరకు కొనసాగిన వివిధ ఉద్యమాల వలన మన స్వాతంత్ర్యం సిద్ధించింది. అయితే పోతూపోతూ కుటిలత్వంతో బ్రిటీష్‌వా చేసిన ఒకప్రకటన దేశ ఐక్యతకు ఎంతో విఘాతాన్ని కలిగించింది. ఆప్రకట ఇలా ఉంది.



ఆర్య సమాజ మందిరం



మహాత్మానారాయణ స్వామి



కేశవరావుజీ కోరట్కర్

"భారతదేశానికి దేశంలోని సంస్థానాలకు స్వాతంత్రం ఇస్తున్నాము. సంస్థానాలు భారత యూనియన్‌లో కలువనూ వచ్చు, స్వతంత్రంగా ఉండనూ వచ్చు" అని పోయేముందు కూడా భారత దేశానికి ద్రోహంచేసి వెళ్ళారు. అయితే ఉక్కుమనిషి సర్దార్ పటేల్ యొక్క చిరస్మరణీయమైన కృషి జాతిని ఒక్కటి చేసింది సంస్థాలన్నింటిని భారత యూనియన్‌లో విలీనం చేసాడు. చివరగా మిగిలింది హైదరాబాద్ సంస్థానం.

**హైదరాబాద్ సంస్థానం** : నిజాం సంస్థానంలో 90 శాతానికిపైగా హిందువులు, కాని 90 శాతానికిపైగా ఉద్యోగస్తులు మాత్రం ముస్లింలు. పాఠశాలల్లో ముస్లింలతోపాటు హిందువులు కూడా ఖురాన్ ఆయత్తులు, కల్మాలు నేర్చుకోక తప్పేదికాదు. ఆనాటి సంస్కృతి ఇప్పటికి మనం చూడవచ్చు గుళ్ళు గోపురాలకు వెళ్ళినా వెళ్ళకపోయినా దర్గాలకు వెళ్ళి సన్నతలు చెల్లించడం, ఫాత్యాలిప్పించడం అలవాటయింది. పాఠశాలలు పది ఊళ్ళకు ఒక్కోటి రెండు ఉండేవి. అక్షరాస్యతా శాతం 5 శాతానికి మించి ఉండేదికాదు.

ఆనాటి సమాజిక చిత్రాన్ని అవలోకించినట్లయితే జాగిర్దారులు, దేశముఖ్‌లు, భూస్వాములు, దొరలు, పెత్తందార్లు, వారి అనుయాయులు ఆఖరికి సామాన్య ముస్లింకూడా దోపిడీకి హక్కుదారే. పై వారందరూ కలిసి హిందువుల్ని ఇనుప మూతికాకుల్లా పొడుచుకు తినేవారు. వారు చేసేదే న్యాయం, చెప్పిందే వేదంగా ఉండేది నాటి పరిస్థితి. ఒంటినిండా బట్ట సంగతి దేవుడెరుగు కాని కడుపునిండా కనీసం గంజైనా దొరికేదికాదు.

చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, హరిజనాది వృత్తి పనులవారు వెట్టిచాకిరితో బ్రతుకులీడ్చేవారు. అర్థాకలితో వీరు నకనకలాడుతూ కూడా అధికారుల సవారీలముందు జంతువుల్లా పరుగెత్తడం వీళ్ళకు తప్పేదికాదు. ప్రభుత్వాధికారులు వచ్చినపుడు వారికి, మిగతాసమయాల్లో గ్రామధికార్లకు సేవలు చేయడం అనేది వీరి నిత్యనైమిత్తిక కార్యం. వివిధ కులాల వాళ్ళు ఉచితంగా తమ సేవల్ని అందించాలి.

కోమటి వంట సామాగ్రి అందించాలి. కుమ్మరి నీళ్ళు తెచ్చి వంట చేయాలి. చాకలి మంచాలు తెచ్చివేసి కాళ్లొత్తాలి. గౌండ్ల మద్యం తెచ్చిపోయాలి. మంగలి కోళ్ళు కోసి పెట్టాలి. కందిళ్లు తుడిచి దీపాలు వెలిగించాలి. మాదిగలు గుఱ్ఱాలకు గడ్డికోసి తేవాలి. పాయిలో కట్టెలు కొట్టుకువచ్చి, చావడి ముందు నెగడ్లు పెట్టి కావలి పండుకోవాలి. పర ఊరికి మూటలు మోయాలి. ఇంత చేసినా ప్రతి ఫలంగా వాళ్ళకు ముట్టేది చీవాట్లు, దెబ్బలు, నిమ్నవర్గాల ప్రజలు పుట్టిందే వీళ్ళకు సేవలు చేయడానికన్నట్లుగా 'బాంచెన్ దొర' అంటూ బతుకులీడ్చేవారు.

వీనికి తోడు హిందువుల్లో పలు కుల, సంప్రదాయాలు బాల్య వివాహాలు, బహు వివాహాలు మొదలగు పలు దురాచారాలు అధికంగా ఉండడం, ముస్లిం, క్రైస్తవుల్లా ప్రత్యేకంగా మత ప్రచార యంత్రాంగం లేకపోవడం, హిందూ మత, పీఠాధిపతులు వారి వారి ఆశ్రమాలకు, అప్పుడప్పుడు ధనవంతుల ఇళ్ళకు పరిమితమై ఉండడంతో హిందూ సమాజానికి దిశాదర్శనం కరువైంది. బహు వివాహాలు, బాల్యవివాహాల వలన వితంతువుల సంఖ్య అధికంగా ఉండేది. వితంతువులు ఏదైనా పొరపాటు చేసినా, హిందువేతరులచే బలాత్కారానికి గురైనా 'పతిత' అని ముద్రవేసి గృహబహిష్కరణ, కులబహిష్కరణ, సాంఘిక బహిష్కరణ చేసేవారు. గత్యంతరం లేక ఇటువంటివారు ఇతర మతాల్లోకి మారి హిందూ సమాజంపై కసిపెంచుకునేవారు. హిందువుల్ని మతం మార్చడానికి వీళ్ళే విపరీతంగా కృషిచేసేవారు. హిందూ సమాజంలోని ఉచ్ఛనీచ భావాలు, మూఢాచారాలు ఇతర మతాలవారికి వరాలుగా పరిణమించాయి. మత ప్రచారం మత మార్పిడులు అధికంగా జరుగడానికి దోహదపడ్డాయి.

నిజాం రాజపోషణలో మత మార్పిడులకై ప్రత్యేకంగా ఒక నిధి ఏర్పాటు చేయబడింది. ప్రత్యేక యంత్రాంగం ఉండేది దీని "ఉమూరే ముజహబి" (మత విషయాలశాఖ) అనేవారు. జైళ్ళలో కూడా హిందూ ఖైదీలను, ముఖ్యంగా ఆడఖైదులను మతం మార్చుటకు, ముస్లిం ముల్లాలు ప్రత్యేకంగా జైళ్ళకు వెళ్ళి ప్రచారం చేసేవారు. మతం, మార్చేవారు.

అవిద్యాంధకారం ఒకవైపు, మూఢవిశ్వాసాలు రెండోవైపు ఏకేశ్వరాధనా పథభ్రష్టత మూడోవైపు, నిజాం నికృష్ట నిరంకుశ పాలనా నాలుగోవైపు ఇలా... అన్ని వైపులనుండి అన్నిరకాలుగా సమాజంపై దోపిడీ, సాంస్కృతికదాడి జరుగుతున్న సమయంలో.... సమాజంలో వైదికజ్యోతి వెలిగించి నలుదెసల జ్ఞాన ప్రకాశాన్ని వ్యాప్తిచేసేందుకు దురాచారాల్ని దూరం చేసేందుకు, విఘటనకెరయైన సమాజంలో ఐక్యతను సాధించి, స్వాతంత్రేచ్ఛను కలిగించేందుకు, అంధకార బంధురాన్ని తొలగించేందుకు స్వామి దయానంద శిష్యగణం నడుం బిగించింది. హైదరాబాద్ సంస్థానంలో ఆర్య సమాజ శాఖను ప్రారంభించేందుకు సమాయత్తమయింది.

## ఆర్యసమాజ స్థాపన

**1891**లో హైద్రాబాద్ సంస్థానంలోని బీడు జిల్లా దారూర్‌లో మొదటగా ఆర్యసమాజ శాఖ ప్రారంభమైంది. పండిత భగవత స్వరూప్ గోకుల ప్రసాద్‌గారి కృషివలన ఇది సాధ్యమైంది. మహర్షి దయానంద ప్రధమ శిష్యగణంలో ఒకరైనా స్వామి గిరానంద్ సరస్వతి **1892** లో హైదరాబాద్ వచ్చి పలుమార్లు ప్రతిభావంతమైన ప్రసంగాలుచేసి అనుకూల వాతావరణాన్ని సృష్టించారు. ఫలితంగా **1892**లోనే హైద్రాబాద్‌లోని సుల్తాన్ బజార్‌లో ఆర్యసమాజ స్థాపన జరిగింది.

దీనికి మొదటి అధ్యక్షులుగా శ్రీ కామతా ప్రసాద్ జీ, ప్రధాన్‌గా శ్రీ లక్ష్మన్‌దాస్ జీ, మంత్రిగా ఆదిపూడి సోమనాధ్ రావ్‌జీ, ధర్మోపదేశకులుగా శ్రీ పండిత హరిహరదేవ్‌గావ్‌లు నియుక్తులయ్యారు. ఆర్య సమాజ ఆశయాలకు, ఆదర్శాలకు ఆకర్షింపబడి ఉద్యమక్షేత్రంలో అడుగిడినవారు. సహకరించినవారిలో కొంతమంది. శ్రీయుతులు శ్రీ కృష్ణ అయ్యంగార్ నవాబ్ జఫర్జంగ్ బహద్దూర్, నవాబ్ ఇమాముల్ ముల్క్, శ్రీ కృష్ణమాచారీ, శ్రీఅఘోరనాథ ఛటోపాద్యాయ, కెప్టెన్ సూర్యప్రతాప్‌జీ, శ్రీ రామకృష్ణ ప్రసాద్ జీ, శ్రీ శివప్రసాద్‌జీ, శ్రీ రాజారాం శాస్త్రి, లాలాగయా ప్రసాద్‌జీ, రాజా విశ్వేశ్వరనాధ్‌జీ (ముఖ్య న్యాయాధికారులు) శ్రీ చందూలాల్‌జీ, రాజాగోవింద ప్రసాద్‌జీ (నాటి ప్రధాని శ్రీ రాజాకిషన్ ప్రసాద్‌కి అతిసన్నిహితులు) శ్రీ కేశవరావు కోరట్కర్ (హైకోర్టువకీలు), భాయీ బన్సీలాల్‌జీ, భాయీ శ్యాంలాల్‌జీ, పండిత కృష్ణదత్, పండిత బన్సీలాల్ వానప్రస్థి పండిత రాజరత్న మాచారీ లాంటి ఎందరో మహాను భావులు చేసిన నిస్వార్థకృషి వలన, అమూల్యత్యాగాల వలన పలు అకృత్యాలకు ఆలవాలంగ ఉన్న నిజాం సంస్థానంలో ఎన్నో సంస్కరణలు సాధించబడ్డాయి. వయుక్తిక సామాజిక జీవనంలో చెప్పుకోదగ్గ మార్పు వచ్చింది. క్రమక్రమంగా రాష్ట్రమంతటా శాఖోపశాఖలుగా విస్తరించిన ఆర్యసమాజ విశ్వరూపం నిజాంకు వణుకు పుట్టించింది. సర్వస్పర్శి సర్వవ్యాపిగా ఎదుగుతూ, ఊడలు కిందికి దింపుకుంటూ అతి పటిష్టంగా రూపొందుతూ... హిందూ సమాజంలోని దురాచారాల్ని రూపుమాపుతూ ప్రజలకు సత్యదిశాదర్శనం చేసింది. నిజాం అతని అనుచరగణం చేసే ఆగడాలకు మొట్టమొదటగా అడ్డుకట్ట వేయడానికి సాహించింది కేవలం

ఆర్యసమాజం మాత్రమే. అప్పుడే మొట్టమొదటి సారిగా శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు దయానంద మహర్షి రచించిన "సత్యార్థ ప్రకాశిక" ను తెలుగులోనికి అనువదించారు.

ఆర్య సమాజ ఆవిర్భావానికి ముందు కాలంలో మతాంతరీకరణ చెందిన హిందువులను తిరిగి స్వధర్మంలోకి తెచ్చేప్రక్రియ అంటూ ఏదీలేదు. ఇటువంటి మతమార్పిడుల వలన ఈ దేశానికి హిందూసమాజానికి శాశ్వతంగా వాటిల్లే నష్టం గూర్చి అంతగా పట్టించుకునేవారి సంఖ్య అత్యల్పంగా ఉండేది. ఏదీఏమైతేనేం మతమార్పిడులు యధేచ్ఛగా కొనసాగుతుండేవి. హిందూ జనాభా తరగడం ఇతరమతాల జనాభా పెరగడం అనే ప్రక్రియ కేవలం యాదృశ్చికంగా జరిగింది ఎంతమాత్రం కాదు. ఒక పథకం ప్రకారం కావాలని చేసిన పనే. వివిధ మతాల జనాభా పెరుగుదల ఎలా ఉందో ఈ క్రింది పట్టిక చూస్తే విషయం మనకర్థ మవుతుంది.

## దేశజనాభా కోట్లలో..

| మతం | 1947లో | 1989లో | పెరుగుదల సుమారుగా |
|---|---|---|---|
| హిందువులు | 33.6 | 63.59 | రెండు రెట్లు |
| ముస్లీంలు | 2.5 | 17.54 | ఏడు రెట్లు |
| క్రైస్తవులు | 0.01 | 2.88 | 2.888 రెట్లు |

రాబోయే 25 సంవత్సరాల్లో ఈ పెరుగుదల ఇలాగే కొసాగినట్లయితే మన దేశంలో హిందూ జనాభా 50% తగ్గుతుందని UNISAP 1988వ సంవత్సరపు నివేదిక తేల్చిచెప్పింది.

1947కు చాలా పూర్వమే హిందువుల మతమార్పిడి జరుపాలనే పనికి శ్రీకారం చుట్టబడింది. లక్షలాది హిందువుల్ని మతమార్పిడికి గురయ్యారు. అందుకు కారణం హిందువుల అనైక్యత, అజ్ఞానమేకాక ముస్లీంల, క్రైస్తవుల అధికారదాహం. ఎంతో దూరదృష్టితో మహర్షి దయానందులు హిందుజాతి, భారతదేశ క్షేమాన్ని గూర్చి ఆలోచించి "శుద్ధి" (పునరాగమన) సంస్కారాన్ని హిందూ సమాజానికి అందించారు.

ఈ శుద్ధి సంస్కార ప్రక్రియ దయానందుడు జాతికి ప్రసాదించగా ఆయన శిష్యమణి స్వామి శ్రద్ధానంద శుద్ధి ఉద్యమాన్ని ఉధృతంగా కొనసాగించి లక్షలాదిగా మతం మారిన హిందువుల్ని (పూర్వహిందువులు) తిరిగి స్వధర్మంలోకి తీసుకోచ్చారు. ఈ శుద్ధి ప్రక్రియకు లభించిన స్పందనను చూసి ముస్లింలు కలవరం చెందారు. ఖాజాహసన్ నిజామ్ అనే ముస్లిం నాయకుడు స్వామి శ్రద్ధానందున్ని ఎలాగైనా తుదముట్టించాలనే పంతంతో అందుకు తగిన వ్యక్తికై అన్వేషణ మొదలెట్టాడు. అందుకుగాను నిజాంమీర్ ఉస్మాన్ అలీఖాన్ సహాయం తీసుకుందామని హైద్రాబాద్‌కు వచ్చాడు. ఖజాహసన్ నిజామి మరియు ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ ఇరువురు కలిసి 'అబ్దుల్ రషీద్' అనే వ్యక్తిని అందుకు సిద్ధంచేసారు. రషీద్ కుటుంబానికి కావలసిన ఆర్థిక వనరులన్నీ ముందుగా సమకూర్చారు. స్వామి శ్రద్ధానందుని హత్యా పథకాన్ని రచించారు. 1926 డిసెంబర్ 23న అబ్దుల్‌రషీద్ స్వామిశ్రద్ధానందుని హత్యచేసాడు. అట్లా హైద్రాబాద్ సంస్థానంలోని మతవాదులు ఒక గొప్ప జాతీయ నాయకుడిని, స్వాతంత్ర సమరయోధున్ని బలి తీసుకున్నారు.

పలుస్థాయిల్లో వివిధ పద్ధతుల్లో ప్రచారం చేస్తూ ప్రజల్ని చైతన్య వంతుల్ని చేస్తూ, ఐకమత్యం పెంపొందిస్తూ పురోగమిస్తున్నది ఆర్యసమాజం. పండిత రామచంద్ర దెహల్వి అద్భుత ప్రసంగధార హైదరాబాద్ వానుల్లో సామాజికస్పృహను అమితంగా కలిగించింది. పండిత నరేంద్రజీ రచనలు, 'వైదిక ఆదర్శ్' అనే ఆర్యసమాజ్ పత్రిక ప్రజానీకానికి చక్కని సందేశాన్ని అందించేది. ఆర్యసమాజ ప్రచారాన్ని అరికట్టి జనబాహుళ్యాన్ని లొంగదీసుకోవాలనే దురుద్దేశ్యంతో ఇత్తైహదుల్ ముసీల్మాన్, తబ్లిక్ అనే పోటీ సంస్థల్నీ, దీన్‌దార్ ఉద్యమాన్ని నిజాం ప్రారంభించాడు. 1934లో 'వైదిక ఆదర్శ' అనే ఆర్య సమాజపత్రికను నిషేధించారు. ఇదే సంవత్సరంలో ఏప్రిల్ 12న హోమాలు, హవనాలు చేయడాన్ని, సత్యంగాల్ని నిర్వహించుకోవడాన్ని నిజాం నిషేధించాడు. అయితే నిజాం విధించిన నిర్బంధాల్ని, నిషేధాల్ని ఎదిరించి నిలిచిందీ ఆర్యసమాజం. మజ్లిస్ ఇత్తైహదుల్ ముసల్మీన్ అధ్యక్షులు బహద్దూర్ యార్జంగ్ హైదరాబాద్ రాష్ట్రంలోని తమ శాఖలన్నింటికి ఒక రహస్య సర్క్యూలర్ పంపడం అందులో పేదహరిజనుల్ని పెద్ద సంఖ్యలో ముస్లింలుగా మతం మార్చాలని,

ఈ పని అత్యంత గోప్యంగా జరగాలని ఉంది. తపాలశాఖలో పనిచేసే శ్రీ బి. వెంకటస్వామి అనే ఆర్యసమాజ కార్యకర్త సాహశించి ఆ రహస్య సర్క్యూలర్ ప్రతి ఆర్యసమాజానికి అందించాడు.

దాంతో ఆర్యసమాజం తన శాఖలన్నింటిని అప్రమత్తం చేసింది. రంగంలోకి దూకింది. మత మార్పిడి కుట్రను భగ్నంచేసే ఈ కార్యభారాన్ని శ్రీ శంకర్‌రెడ్డి, శ్రీ బలదేవ్ పతంగి శ్రీ నరేంద్ర జీలకు అప్పగించారు. వారు మిర్యాలగూడ సూర్యపేట, దేవరకదర, దేవరకొండ, పరకాల, వరంగల్ బావుపేట తదితర ప్రాంతాల్ని సందర్శించి ఇస్లాం పుచ్చుకున్న దాదాపు పదివేల మంది హరిజనుల్ని తిరిగి హిందువులుగా మార్చారు. ఇక్కడ పండిత చంద్రపాల్ కృషి ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

వరంగల్ జిల్లాలోని మానుకోట, నర్సంపేట, పర్కాల ములుగు, చల్వాయి, పెద్ద పెండ్యాల, చిన పెండ్యాల, పల్లగుట్ట, ఘనపురం, ఉర్సు, కరీమాబాద్, రంగసాయిపేట, మడికొండ, ధర్మసాగరం, హసన్‌పర్తి, రాజారం, తాటికాయల కాజీపేట, కడిపికొండ, ఆరెపల్లి, దామెర, నాగారం, జమ్మికుంట, కమలాపురం మొదలగు ప్రాంతాలతోపాటు ఇతర జిల్లాల్లో సైతం హుజురాబాద్, పెద్దపల్లి, కరీంనగర్, కొత్తపల్లి డోర్నకల్, ఖమ్మం, జనగాం, చేర్యాల తదితర అనేక స్థలాల్లో ఆర్యసమాజ శాఖలు స్థాపించబడ్డాయి. అవి సమాజ సంరక్షణా కేంద్రాలుగా పరివర్తనం చెందాయి. ఇట్టి నిర్మాణాత్మక కార్యక్రమాల్లో నిరంతరం పాటుపడిన వారిలో సర్వశ్రీ చెఱకు కాంతయ్య, కాళోజి నారాయణరావు, చెరుకుకాంతయ్య, గార్లపాటి రాఘవరెడ్డి, పండిత వెంకటేశ్వరశాస్త్రి, కటంగూరు కేశవరెడ్డి, పాప వినాశార్య, పల్లా రామకోటార్య, బుర్రా కృష్ణస్వామి, నర్సింహార్య, విలాసీరాం, పొత్కపల్లి కొండల్‌రెడ్డి, తిరుపతిరావు, ఇటికాల మధుసూధన్‌రావు, వి. జనార్ధన్ గుప్త, మద్దాల అనంతయ్య, ముల్కల భూమయ్య ఏటూరి వెంకటేశ్వర్‌రావు మంత్రి ప్రగడవెంకటేశ్వరరావు బుర్రా శ్రీహరి, గుజ్జారి సత్యప్రకాశ్, గంగు సత్యనారాయణ మున్నగు వారెందరో నిరంతరం శ్రమించి ఆర్యసమాజశాఖల్ని స్థాపించి, ప్రజల్లో చైతన్యం రగిలించి క్రమంగా స్వాతంత్ర సమరంవైపు సమాయత్తం చేసారు. మత మార్పిడులను సమర్థంగా ఎదుర్కొని శుద్ధి కార్యక్రమాన్ని ఉధృతంగా కొనసాగించారు. ఆర్య సమాజ కార్యకర్తలు.

దీంతో బహదూర్‌యార్జంగ్‌కు, నిజాం నవాబ్‌కు వణుకు పుట్టింది. ఆర్యసమాజం యొక్క ప్రతికార్యాన్ని నిషేధించడం ప్రారంభించాడు. నిజాం విధించిన ప్రతి నిషేధాన్ని ధైర్యంగా ఎదిరించడం వలన ఆర్యసమాజానికి నిజాంకు ప్రచ్ఛన్నయుద్ధం ప్రబలమైంది. హైదరాబాద్ సంస్థానంలో నిజాంకు ఆర్యసమాజం సింహసదృశ్యమై నిలిచింది.

ఆనాడు ఆర్యసమాజం వారు అనేక ప్రమాదాల్ని ఎదుర్కొంటూ శుద్ధి ఉద్యమం నడుపకపోయి ఉంటే ఈనాడు ఈ రాష్ట్రానికి స్వతంత్రం ఉండేదికాదు. ఒకవేళ వచ్చినా ముస్లిం ఆధిపత్య ప్రాంతంగానే ఉండేది. రెండవ కాశ్మీర్‌గా మారి ఉండేది. శుద్ధి ఉద్యమంద్వారా ఆర్యసమాజం ముస్లింల శృంగభంగంచేసి ఉండనట్లయితే దానికి మతసంస్థ అని ముద్రపడేదికాదు. ఈనాడు మెజారిటీ హిందువుల సాయంతో రాచరికాల్ని పదవుల్ని వెలుగబెడుతున్న రాజకీయ పార్టీల వారు, ఇతర సంస్థలూ... ఆర్య సమాజం చేసిన త్యాగాన్ని ఏమాత్రం గుర్తించకుండా దాన్ని ఒక మతసంస్థగా ముద్రవేసి దూరం చేసేవారు కాదు. ఈ సంస్థలన్నీ, నాయకులెందరో నాడు ఆర్యసమాజాన్ని వేదికగా ఉపయోగించుకున్నవారే.

ఎంతటి కృతఘ్నత !

ఆలోచించనివాడికి కనిపించేది అంతా అంధకారమే (అధికారమే) గదా !




- మజ్లిస్ రజాకార్లు, నిజాం పోలీసులు హైదరాబాద్ సంస్థానంలో ఆర్యసమాజాన్ని నామ రూపాల్లేకుండా చేయాలనే సంకల్పంతో ప్రతిచోట అత్యాచారాలకు పూనుకొన్నారు. అటువంటి సంఘటనలు అనేకంగా జరిగాయి. అందులో కొన్నింటిని ఇక్కడ పేర్కొనడం జరిగింది.

- సుల్తాన్ బజార్ ఆర్యసమాజ్‌లో బయటి వారెవరైనా వచ్చి ఉపన్యాసించినా, యజ్ఞాలు చేసినా సి.ఐ.డీలు నిరోధించేవారు.
- హైద్రాబాద్‌లో జరిగిన నవయువక సమ్మేళనంలో ప్రసంగిస్తూ "హైదరాబాద్ స్టేటు 82వేల చ॥కి.మీ సువిశాల చెరసాల అని అన్న పండిత నరేంద్రజేని రాజద్రోహనేరం మోపి ఆరునెలల జైలుశిక్ష విధించింది నిజాం ప్రభుత్వం.
- హైదరాబాద్ సంస్థానంలోని ఏకోర్టులోకూడా హిందువులకు న్యాయం జరుగదని అన్నందుకు పండిత గణపతి లాల్జీకి మూడు మాసాల జైలుశిక్ష పడింది.
- కళ్యాణి ప్రాంతంలో ఆర్యసమాజ ప్రచారం చేస్తున్నాడనే నెపంతో మోహన్‌సింగ్ అనే కార్యకర్తను చిత్రవధ చేసారు.
- మురఖేడ్‌లో యజ్ఞకుండాన్ని పెట్టేప్రయత్నం చేసినందుకు చౌదరి శ్రీరాంను జైళ్ళో వేసారు.
- నాగర్‌సోగాలో శ్రీరఘునాథ ప్రసాద్, శ్రీ ఘనశ్యాం ప్రసాద్ అనే ఇద్దరన్నదమ్ములు పదిమంది హిందువుల్ని కలిపి వేదధర్మాన్ని బోధిస్తూ యజ్ఞాలు చేయిస్తున్నారనే నెపంతో శిక్షించారు.
- బీదర్లో శ్రీ భీంశంకర్ నడిపించే వ్యాయామశాల అనుమతిని రద్దుచేసారు. దానిని నడుపకూడదని ఆ తాలూకా తహసిల్దార్ హెచ్చరించాడు.
- 1932 అక్టోబర్ 29న హల్లీఖేడ్‌లో శ్రీ బన్సీలాల్ శ్రీ రామచంద్రారావు ఇంట్లో ఉపన్యసిస్తున్నారన్న సంగతి తెలిసి ఆ మండల అమీను ఉపన్యసించకూడదని నోటీసు పంపించాడు.
- 1933 జూన్ 26న హల్లీఖేడ్‌లో పండిత బన్సీలాల్ వకీల్ నడుపుతున్న పాఠశాలను మూసివేయాలని పోలీసు కమీషనర్ ఒక నోటీసు ద్వారా హెచ్చరించాడు.
- 1937 జూన్ 18న యజ్ఞాలు చేయడం చట్టపరంగా నేరమని ప్రకటించారు.

- 1938 ఏప్రిల్ 5న హైదరాబాద్‌లో ఉపన్యసించడానికి వచ్చిన తర్కశిరోమణి పండిత దేవేంద్రనాథ్ శాస్త్రిని ఆపడానికి ప్రయత్నించారు నిజాం పోలీసులు.
- 1939 జూన్ 17న ఒక కేసుకు సంబంధించిన వివరాల్ని వెళ్ళడించడానికి కోర్టుకు వెళ్తున్న శ్రీ చంద్రపాల్‌వకీల్‌ను పబ్లిక్ సేఫ్టీయాక్ట్ కింద అరెస్టుచేసి ఆయన్ని కోర్టుకు వెళ్ళకుండా చేసారు.
- 1939 జూన్ 23న శ్రీ బన్సీలాల్‌వ్యాస్‌ను అతని వెంట ఉన్న 18 మంది ఆర్యసత్యాగ్రహుల్ని లాఠీలతోమోదిజైళ్ళలో వేయడం జరిగింది.
- ఇదే సందర్భంలో పండిత నరేంద్రజీకి మూడు సంవత్సరాల జైలు శిక్ష విధించారు.
- నిజాం ప్రభుత్వ, ఫాసిస్టు, నాజిస్టు, కమ్యూనలిస్టు పరిపాలనపై ఆనాటి పరిస్థితుల్లో ఎంతో మృదువుగా వ్యాఖ్యానించిన శ్రీయుతులు రామ్‌శర్మ, రాజారాంశాస్త్రి, హకీం గణపతిరావు చంద్రపాల్, విష్ణుభగవంత్, స్వామి సత్యానందులను 1939 మే 2న అరెస్టుచేసి మొదట 6 నెలల శిక్షవిధించి ఆ తరువాత మరోనేరం మోపి రెండు సంవత్సరాల శిక్ష విధించి జైళ్ళో చిత్రహింసలు పెట్టారు.

ఇలా కోకొల్లలుగా ఆర్యసమాజంపై కక్షసాధింపు చర్యలు, నిర్బంధాలు, నిషేధాలు కొనసాగించినా నిజాం యొక్క నియంతృత్వాన్ని ఎదిరిస్తూ, త్యాగాలు, బలిదానాలు చేస్తూ ఆర్యసమాజం అహరహం తన కృషిని వేగవంతం చేసింది. జైళ్ళలో ఆర్యసమాజికులపై నిజాం ప్రభుత్వం చేసిన అత్యాచారాలకు నాటి ప్రత్యక్ష సాక్షి అయిన శ్రీకాళోజి నారాయణరావు నాకిచ్చిన ఇంటర్వ్యూలో ఈ క్రింది విషయాన్ని చెప్పారు. పై విషయంగా ప్రఖ్యాత ఆర్యసమాజ జాతీయ నాయకులు (వీరి మేనమామ అయిన) శ్రీ నరదేవ్ శాస్త్రితోపాటు కాళోజీ కూడా వరంగల్, కరీంనగర్ సిద్దిపేట జైళ్ళలో ఎంక్వరీకి వెళ్ళినారని శ్రీ నరదేవ్‌శాస్త్రి నిజాం సంస్థానాల్లోని ముఖ్యమైన అన్ని జయిళ్ళకు వెళ్ళి నిజాం అత్యాచారాల విషయంగా ఎంక్వయిరీ చేసారని నాతోఅన్నారు.

ఈ సమస్య హైదరాబాద్‌కే పరిమితమైనదైనప్పటికి స్థానిక ప్రజల్ని సమాయత్తం చేయడంతో పాటుగా యావద్భారత దేశంలో 'హైదరాబాద్ డే' ను జరుపడం ద్వారా దీని జాతీయ సమస్యగా చేసి, దేశం నలుమూలల నుండి వేలాది ఆర్యసమాజ కార్యకర్తలు తమ సర్వస్వాన్ని అర్పించేందుకు సిద్ధంచేసి, మహోధృతంగా సత్యాగ్రహోద్యమాన్ని చేపట్టి, అసమాన రీతిలో కొనసాగించింది. మహాత్మాగాంధీ సైతం ఈ ఆర్యసత్యాగ్రహోద్యమాన్ని గూర్చి తెలుసుకొని తాను చేసిన పొరపాటుకు (కాంగ్రెస్ సత్యాగ్రహం నుండి విరమించుకోవడం) పశ్చాత్తాప పడేట్లు చేసింది. తనే స్వయంగా ఆర్యసమాజ సత్యా గ్రహోద్యమాన్ని శ్లాఘించేట్లు చేసింది. నిజాంను దిగివచ్చేటట్లు చేసింది ఆర్యసమాజం. సత్యాగ్రహం నుండి కాంగ్రెస్ విరమణ, హిందూముస్లింలకు సమాన అధికార విభజన అనేనిజాం ప్రతిపాదనలకు కాళోజి నాడే ఈ క్రింది విధంగా స్పందించినట్లు వారు నాకిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారు.

చీకటి మాటికి చిర్రనువారితో స్నేహభాషణములెందులకు !

కలహము వద్దను కాంగ్రెసు వారికి కారావాసము లెందులకు!

ఉప్పు సరికిసరివేసి వండిన పప్పు భోజనమెందుకు.....



# 12 ఆర్యసత్యాగ్రహోద్యమంలోని ముఖ్య ఘటనలు

హైదరాబాద్ సంస్థానంలోని హిందూప్రజానీకంపై నిజాం అసంఖ్యాకంగా విధించిన ప్రతిబంధకాల తొలగింపునకై విజ్ఞాపనలు హెచ్చరికలు ఆదిగా గల అన్ని ప్రయత్నాలు ఆర్యసమాజం చేసినప్పటికి నిజాం మతమౌఢ్యత ఏ మాత్రం తగ్గలేదు. అందువలన నిజాంకు వ్యతిరేకంగా ఉద్యమించక తప్పింది కాదు.

హైద్రాబాద్ రాష్ట్రంలో ఆర్యసమాజం జరిపిన సత్యాగ్రహపోరాటం భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగింది. హైదరాబాద్‌లో నిజాం ఘూకలు చేసే అన్యాయాన్ని ఎదుర్కోవడానికి నిజాంతో అమీ తుమీ



శ్రీ నీలకంఠ లోకా లక్ష్మయ్య



శ్రీ రామారావ్‌జీ డోకె



శ్రీ కె. ప్రేమరాజ్ యాదవ్



శ్రీ ఆర్. రత్నయ్యాజీ



శ్రీమతి కామాక్షమ్మ



శ్రీ ఎన్ దేవయ్యాజీ

శ్రీ సంగమేశ్వరజీ

శ్రీ డీ. నారాయణరావ్

శ్రీ డీ. యల్. కృష్ణయ్య

శ్రీ మాదారమ్ మల్లప్ప

శ్రీ సి. రాజేశ్వరరావ్

శ్రీ వేంకట రెడ్డిజీ


శ్రీ గౌరీ లింగయ్యాజీ


శ్రీ సీతారామ్ శుక్ల


శ్రీ బద్రి నారాయణజీ


శ్రీ నందలాల్‌జీ


శ్రీ భోలారామ్


శ్రీ నరసింహ కాశీనాథరావ్



డా॥ తిప్పాజీరావ్



శ్రీ బి. హనుమంతరావ్



శ్రీ రంగలింగయ్య గుప్త



శ్రీ వాసుదేవ రావ్ కల్యాణీ



శ్రీ వీరన్నాజీ



శ్రీ యమ్. తిమ్మయ్యాజీ



శ్రీ చంద్రప్పజీ మిట్టీ



శ్రీ బుగ్గప్పాజీ



శ్రీ సంగణాజీ



శ్రీ నాగేంద్రసగరీ



శ్రీ నరసింగరావ్



శ్రీమతి బాలమ్మా జోలల్



శ్రీ రామనాథ్‌జీ కల్యాణి



శ్రీ నారాయణ గుండా



శ్రీ బాలప్పా బందగీ



శ్రీ సాయన్నా మిట్టీ



శ్రీ నరసింహులు జీ



శ్రీ బన్నప్పాజీ గందే


శ్రీ గందే సదాశివప్ప


శ్రీ సరదార్‌సింహ ఠాకుర్


శ్రీ శెట్టి చంద్రయ్యాజీ


శ్రీ మహాదేవప్పాజీ


శ్రీ హణమంతరావ్


శ్రీ నాగురావ్ లోమట్



శ్రీ తకారాయ్ లోమటే



శ్రీ హనమంతు మిట్టే



శ్రీ విట్టల్ కప్పా



శ్రీ విఠోబా జోన్నల్



శ్రీ బి. నారాయణ



శ్రీ శీతల్‌సింహ్ శాస్త్రి


ఠాకుర్ సరదార్ సింహ


శ్రీ సత్యదేవ్‌జీ


శ్రీ గీరణ్ణా జొన్నల్


శ్రీ రామగోపాల్ ఆర్య


శ్రీ రాహుల్ అంజయ్యాజీ


శ్రీ పాకారాజయ్యాజీ



శ్రీ యమ్. భద్రయ్యాజీ



శ్రీ కె. ఉపేంద్రనాథ్



శ్రీ యల్లప్ప ఓమ్ ప్రకాష్



శ్రీ కె.వి. రెడ్డిజీ



శ్రీ శంకరరావ్‌జీ



శ్రీ యమ్.పి. గణేశరావ్

తేల్చుకోవడానికి ఆర్యసమాజం సమాయత్తమై ఇచ్చిన పిలుపుకు అత్యద్భుతమైన స్పందన లభించింది. ప్రభంజనంలా దేశం నలుమూలల నుండి ఆర్యసత్యాగ్రహవీరుల ప్రవాహం హైదరాబాద్ వైపు మళ్లింది. నిజాం సంస్థానంలోని జైళ్ళన్నీ ఆర్యసత్యాగ్రహవీరులతో నిండిపోయాయి. ఉవ్వెత్తున లేచిన ఈ ఆర్యసత్యాగ్రహోద్యమ ధాటికి తట్టుకోలేక, తాను కొట్టుకుపోవడం ఖాయమని తెలుసు కున్న నిజాం మొదటి సారిగా తన అహాన్ని చంపుకుని ఆర్యసమాజం ముందు తలవంచాడు.

ఆర్యసమాజం చేసిన అన్ని డిమాండ్లను నిజాం ఒప్పుకోకతప్పలేదు. సంస్థాన మంతటా దట్టంగా అలుముకుని ఉన్న కారుచీకటి కకావికలమైంది. నిశ్చేతనావస్థలో పడి ఉన్న హిందూ సమాజంలో జాగృతిని కలిగించింది, సంఘటనను నిర్మించింది సమరోన్ముఖులుగా చేసింది అధికాధికంగా ఆర్యసమాజమే. ఆర్యసమాజ స్ఫూర్తితోనే నాటి ప్రజానీకంగాని, నాటి తరం నాయకులుగాని, తదుపరి ఉద్యమాన్ని నడిపారనేది నిజం. ఇంతటి మార్పును తీసుకుని వచ్చిన ఆ మహోన్నత ఆర్యసత్యాగ్రహోద్యమాన్ని గూర్చి కొంత తెలుసుకుందాం.

రాజ్యకాంక్షతో మూసుకుపోయిన నిజాం కళ్లను తెరిపించడానికి ఆర్యసమాజం షోలాపూర్‌లో 1938లో డిసెంబర్ 25 నుండి 29 వరకు అఃఁ భారత ఆర్యమహా సమ్మేళనాన్ని లోక్‌నాయక్ శ్రీమాధవరావు అణె గారి అధ్యక్షతః నిర్వహించింది. ఆ సమావేశంలోనే ఒక దీర్ఘకాలిక ఉద్యమానికి రూపకల్పః జరిగింది. భాగాన గల నిశ్శస్త్ర ప్రతీకార మండల్ పేర హిందూ మహాసభ, ఆర్యసమాజ్ నేతృత్వంలో ఉద్యమం ప్రారంభమైంది.

- 1938 లోనే స్టేట్ కాంగ్రెస్ కూడా సత్యాగ్రహం ప్రారంభించింది. కాని గాంధీజీ ఆదేశాల మేరకు ఒక నెల తర్వాత ఉద్యమాన్ని ఆపేసింది.
  హిందూమహాసభ కూడా ఈ సత్యాగ్రహోద్యమం నుండి 29-7-1939 న విరమించుకుంది.
- 24 అక్టోబర్ 1938న ఆర్యరక్షా సమితి ఆధ్వర్యంలో శ్రీదేవీలాల్‌జీ నేతృత్వంలోని మొదటి జట్టు సత్యాగ్రహం

చేసింది. వారందరికి నిజాం ప్రభుత్వం మూడు సంవత్సరాల కారాగారశిక్ష విధించింది.

డిసెంబర్ నుండి ఈ ఉద్యమాన్ని ఉధృతం చేసింది. నిజాంకు నిద్ర పట్టకుండాచేసింది.

27-12-1938 : ఆర్యసమాజం తలపెట్టిన ఈ ఉద్యమానికి మహాత్మా నారాయణ స్వామిని సర్వాధికారిగా నియమించడం జరిగింది.

28--12-1938 : దేశం నలుమూలల నుండి వచ్చేందుకు 22 వేల మంది ఆర్యవీరులు సంసిద్ధంగా ఉన్నారని మహాత్మా నారాయణస్వామిజి ప్రకటించారు.

29-12-1938 : ఆర్యవీరుల సమ్మేళనాన్ని సంబోధిస్తూ ఈ ఉద్యమానికి తన సంపూర్ణ మద్దతును ప్రకటించారు స్వాతంత్ర్య వీర సావర్కర్.

4-1-1939 : 15 రోజుల గడువులోగా ఆర్యసమాజ్ డిమాండ్లను అంగీకరించాలని లేదా సత్యాగ్రహోద్యమం తీవ్రతరం చేస్తామని మహాత్మా నారాయణ స్వామీజి హైదరాబాద్ సంస్థాన ప్రధానమంత్రికి లేఖ పంపించారు.

5-1-1939 : సంస్థానంలో ఏరకమైన ప్రచారాన్ని చేయడమైనా, కార్యకర్తల్ని భర్తీ చేసినా తదితర కార్యాలు చట్ట విరుద్ధమని అలా చేసినవారు శిక్షార్హులని ప్రకటించింది నిజాం ప్రభుత్వం.

14-1-1939 : హిందువుల డిమాండ్లని అంగీకరించమని లేకుంటే ఉద్యమం తప్పదని నిజాం ప్రభుత్వాన్ని హెచ్చరించాడు స్వాతంత్రవీర సావర్కర్.

15-1-1939 : జనవరి 25న సత్యాగ్రహదినంగా దేశమంతటా బ్రహ్మాండంగా నిర్వహించాలని సార్వదేశిక ఆర్యప్రతినిధి సభ పిలుపునిచ్చింది.

19-1-1939 : నాటికి 800 మంది ఆర్యవీరులపై అక్రమ కేసుల్ని పెట్టింది నిజాం ప్రభుత్వం.

25-1-1939 : దేశవ్యాప్తంగా ఆర్యసమాజ్ 'హైదరాబాద్ డే' భారీ ఎత్తున జరిపి, హైదరాబాద్ సంస్థాన సమస్యకు దేశవ్యాప్త ప్రాచుర్యాన్ని తెచ్చింది. జాతీయ సమస్యగా దీన్ని మార్చింది. ఈ సందర్భంగా 25 మంది కార్యకర్తలు అరెస్టయ్యారు.

31-1-1939 : ప్రప్రథమంగా మహాత్మా నారాయణస్వామి నేతృత్వంలో 40 మంది ఆర్యవీరులు హైద్రాబాద్‌లో సత్యాగ్రహోద్యమానికి నాంది పలికారు.

2-2-1939 : సత్యాగ్రహం చేసిన ఆర్యవీరుల్ని షోలాపూర్ ప్రాంతంలో వదిలేసారు. మహాత్మాజీ మళ్ళీ సత్యా గ్రహం చేస్తానని ప్రకటించారు.

- ఢిల్లీలోని ఒక వారపత్రిక సత్యాగ్రహానికి సంబంధించిన ఒక ఫోటో ముద్రించినందుకు వేయి రూపాయల న: పరిహారం చెల్లించాలని నిజాం ప్రభుత్వం డిమాండ చేసింది.

4-2-1939 : హిందువులకు స్వేచ్ఛనివ్వాలని లేకుంటే హిందూ ముస్లీంల ఐక్యతకు భంగం కలుగుతుందని హైదరాబాద్ ప్రధాని అక్బర్ హైదర్‌కు లోక్‌నాయక్ శ్రీఅణె లేఖ రాసారు.

6-2-1939 : 20 మంది సత్యాగ్రహులతో మహాత్మా నారాయణ స్వామీజి రెండవ సారి గుల్బర్గాలో సత్యాగ్రహం చేసారు.

10-2-1939 : మహాత్మాజీ ఆయన అనుచరులకు ఒక సంవత్సరం కఠిన కారాగారశిక్ష విధించారు.

11-2-1939 : ప్రయాగ నుండి శ్రీపురుషోత్తమదాను ఆర్యసమాజ ఉద్దేశ్యాలను బలపరుస్తూ ఒక ప్రకటన చేసారు.

16-2-1939 : మహాత్మా నారాయణస్వామి దేశంలోని సాధు సంతుల నందరిని సత్యా గ్రహోద్యమంలో భాగస్వాములు కావల్సిందని పిలుపు నిచ్చారు.

18-2-1939 : ఆర్యసమాజం తలపెట్టిన సత్యాగ్రహోద్యమం విశుద్ధ ధార్మికమైనదని "మహాత్మాగాంధీజీ" 'హరిజన' పత్రికకు రాసిన లేఖలో ప్రస్తావించారు.

19-2-1939 : యజ్ఞోపవీతం ధరించడాన్ని హైదరాబాద్ సెంట్రల్ జైళ్ళో నిషేధించి నందుకు దీక్ష చేసారు.

20-2-1939 : హిందువుల అధికార సిద్ధి కోసమే సత్యాగ్రహోద్యమం చేపట్టిందని శ్రీఖుశ్‌హాల్ చంద్‌జీ ప్రకటన.

22-1-1939 : హైదరాబాద్‌లోని ప్రతిష్ఠిత ఆర్యసమాజికులు నిజాం పోలీసులచే నిర్బంధం.

• మార్చిలో సత్యాగ్రహాన్ని దేశవ్యాప్తం చేస్తామని ఆర్యసమాజం హెచ్చరించింది.

3-2-1939 : దేశవ్యాప్తంగా సత్యాగ్రహ సమితుల ఏర్పాటు జరిగింది.

7-2-1939 : మార్చి నాలుగున సత్యాగ్రహం చేస్తానని శ్రీకువర్‌చాంద్ కరణ్ శారదా ప్రకటించారు.

8-2-1939 : పంజాబ్‌లోని ప్రతిష్ఠిత హిందువులతో కూడిన ఒక కమిటీ హైదరాబాద్‌కు రావాలనుకుంటుంది అని శ్రీరాజనరేంద్రనాథ్ అక్బర్ హైదర్‌కి లేఖ రాసారు.

4-3-1939 : శ్రీకువర్‌చాందా కరణ శారదా 154 మంది ఆర్యవీరులతో కలిసి సత్యాగ్రహం చేయడానికి హైదరాబాద్ చేరుకున్నారు.

5-3-1939 : సత్యాగ్రహులనందరిని నిర్బంధించారు.

8-3-1939 : మహాత్మా నారాయణస్వామిపై రాజాజ్ఞ ధిక్కార అభియోగాన్ని మోపింది నిజాం ప్రభుత్వం.

15-3-1939 : కువర్‌చాంద్ కరణ్ శారదాజీకి, ఆయన అనుచరులకు 13 మాసాల కఠిన కారాగారశిక్షను విధించారు.

- జైల్లో సత్యాగ్రహులు వందేమాతర గీతాలాపన చేసినందుకు వారిని తీవ్రంగా దండించారు.

18-3-1939 : షోలాపూర్‌లో జరిగిన ఆర్యసమాజ ఉత్సవంపై రాళ్ళు రువ్వారు.

19-3-1939 : హైదరాబాద్ సెంట్రల్ జైళ్ళో నిర్బంధించబడిన వందలాది ఆర్యసత్యాగ్రహుల్ని మాంసం భుజింపమని తీవ్ర ఒత్తిడి చేసారు జైలు అధికారులు.

22-3-1939 : శ్రీఖుశాల్‌చాంద్ నాయకత్వాన 160 మంది సత్యాగ్రహాన్ని గుల్బర్గాలో అరెస్టు చేసారు.

- మరోసారి దేశవ్యాప్తంగా 'హైదరాబాద్ డే' ను జరపడం జరిగింది.

23-3-1939 : శ్రీ నారాయణ స్వామీజీపై మరోనేరం మోపి రూ॥ 200 జరిమానా లేక 3 మాసాల కఠిన కారాగార శిక్ష అనుభవించాలని ఉత్తర్వు ఇచ్చారు.

24-3-1939 : జైల్లో అధికారుల రాక్షసత్వానికి, అశ్రద్ధ వలన గుల్బర్గాలోనున్న ఆర్యసత్యాగ్రహులు అనారోగ్యానికి గురయ్యారు.

27-3-1939 : ఖుశాల్‌చంద్ అనుచరులకు 18 మాసాల శిక్ష విధించారు.

30-3-1939 : హైదరాబాద్ సంస్థానానికి సంబంధించి ఒక విధి విధానాన్ని త్వరలోనే ప్రకటిస్తామని అక్బర్ హైదరీ గాంధీజీకి లేఖ రాసారు.

31-3-1939 : సార్వదేశ ఆర్యప్రతినిధి సభయొక్క విశేష సమావేశం ఏప్రిల్ 6న జరుపాలనే నిర్ణయం షోలాపూర్‌లో తీసుకున్నారు. ప్రతిష్ఠిత వ్యక్తులందరికి ఆహ్వానాల్ని పంపించారు.

4-4-1939 : సత్యాగ్రహ ఉద్యమానికి విజయం తథ్యమని పండిత ధీరేంద్రశాస్త్రి ప్రకటన.

5-4-1939 : హైదరాబాద్ సంస్థానం యొక్క తీరు తమకు ఏమాత్రం ఆమోదయోగ్యంగా లేదని లోక్‌నాయక్ శ్రీఆణె ప్రకటించారు.

6-4-1939 : ఓంకార ధ్వజాలన్నిటిని నిజాం ప్రభుత్వం తన ఆధీనంలోకి తీసుకున్నది.

8-4-1939 : ఆర్య ప్రతినిధి సభ, హైదరాబాద్ సంస్థానాల మధ్య సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి. సత్యా గ్రహోద్యమం ఇంకా ఉధృతం చేస్తామని ఆర్యసమాజం హెచ్చరించింది.

9-4-1939 : తూల్జాపూర్‌లో ఆర్యసత్యాగ్రహుల పైన 200 మంది ముస్లింగుండాల దాడి.

15-4-1939 : బందీలుగా ఉన్న సత్యాగ్రహులపై జైళ్లలో అధికారులు, ముస్లిం ప్రజల సంయుక్త దాడులు.

17-4-1939 : పండిత దత్తాత్రేయజీకి రెండు సంవత్సరాల కఠిన కారాగార శిక్ష పడింది.

22-4-1939 : నాలుగవసారి 'హైదరాబాద్‌డే' జరిపారు.

- శ్రీ రాజగురు, శ్రీ ధూరేంద్రశాస్త్రి నేతృత్వంలో 531 మంది ఆర్యవీరులు సత్యాగ్రహం చేసి అరెస్టయ్యారు.

23-4-1939 : సత్యాగ్రహోద్యమాన్ని కొనసాగించేందుకుగాను పెద్ద ఎత్తున కార్యకర్తల్ని సమీకరించేందుకు శ్రీకృష్ణాజి విస్తృతంగా పర్యటన గావించారు.

26-4-1939 : హైదరాబాద్ సంస్థానంలోని అన్ని జైళ్ళు సత్యా గ్రహులచే నిండిపోయాయి. కొత్త జైళ్ళ నిర్మాణం మొదలుపెట్టింది నిజాం ప్రభుత్వం.

28-4-1939 : హైదరాబాద్ జైళ్ళో స్వామి సత్యానందజీ మరణించారు. పండిత వేదవ్రతవానప్రస్థి ఆధ్వర్యంలో ఐదవ సత్యాగ్రహదళం సిద్ధంగా ఉందని ప్రకటించారు.

29-4-1939 : పండిత ధూరేంద్రశాస్త్రికి ఆయన అనుచరులకి 24 నెలల శిక్ష విధించడం జరిగింది. సత్యాగ్రహుల దగ్గరున్న 195 ఓం ఝుండాల్ని బలవంతంగా లాక్కున్నారు.

4-5-1939 : గుల్బర్గా జైల్లో శ్రీ ఛోటేలాల్ మరణం.

15-3-1939 : జైలు అధికార్ల అమానుష ప్రవర్తనకు నిరసనగా 200 మంది సత్యాగ్రహులు ఔరంగాబాద్ జైల్లో నిరహారదీక్ష చేసారు.

17-5-1939 : బార్సీలో ముసల్మానుల దాడిలో అనేకమంది సత్యాగ్రహులు హతమయ్యారు.

20-5-1939 : బంధింపబడిన సత్యాగ్రహుల పరస్పరం 'నమస్తే' అని పలకరించుకోవడం చూసి ఓర్వలేని జైలు అధికారులు క్రూరంగా హింసించారు.

21-5-1939 : అమరవీరుల సంస్కరణ దినం జరుపుకున్నారు ఆర్యవీరులు.

22-5-1939 : షోలాపూర్‌లో సత్యాగ్రహం చేయడానికి సిద్ధంగా ఉన్న పలువురు ఆర్యవీరుల్ని వెళ్ళిపొమ్మని ఫర్మానాజారి

- మరియు మెరుపుదాడి చేయడం వలన 28మంది ఆహుతికాగా వందలాది మందికి గాయాలయ్యాయి.
- దేశమంతటా 'హైదరాబాద్‌డే'ని ఐదవసారి పెద్ద ఎత్తున నిర్వహించారు.

26-5-1939 : స్వామి బ్రహ్మానంద అనుచరులకు 24 నెలల శిక్షను విధించారు.

28-5-1939 : శ్రీ కృష్ణాజి 6వ సత్యాగ్రహ దళాధినేతగా హైదరాబాద్ సంస్థానంవైపు పయనం.

29-5-1939 : గుల్బర్గా జైల్లో ఒక సత్యాగ్రహి దుర్మరణం.

1-6-1939 : జైల్లో మరో ఇద్దరు సత్యాగ్రహుల మృతి.

4-6-1939 : మౌల్వీ జవర్‌అలీ నిజాంను ఇలా హెచ్చరించాడు. సత్యాగ్రహాన్ని నిరోధించండి. లేకపోతే మేమే చర్య తీసుకుంటాం.

5-6-1939 : శ్రీకృష్ణాజి 772 మంది ఆర్యవీరులతో ఔరంగాబాద్‌లో అరెస్టు.

9-6-1939 : 24 గం॥పాటు శ్రీకృష్ణాజి ఆయన అనుయాయులు నిరాహారదీక్ష చేసారు.

13-6-1939 : శిక్షాకాలం పూర్తిచేసుకున్న సత్యాగ్రహులను సైతం షోలాపూర్ వైపు వెళ్ళకుండా ఆపాలని ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది.

14-6-1939 : శ్రీ రాజగోపాలాచార్య మద్రాస్ ప్రాంతంలో ఆర్యసమాజ ఉత్సవాలు జరుపకుండా 144వ సెక్షను విధించారు. ఆర్యసమాజ్ సాహిత్యాన్ని స్వాధీనం చేసుకోవడం జరిగింది.

16-6-1939 : మద్రాస్‌లో ఆర్యసమాజ కార్యక్రమాలపై విధించిన ప్రతిబంధకాల్ని నిరసిస్తూ ఆందోళన జరిగింది. గాంధీజీకి, రాజగోపాలాచార్యకు టెలిగ్రామ్‌ల ద్వారా నిరసన తెలిపారు.

గ్వాలియర్ సంస్థానంలో కూడా ఆర్యసమాజంపై ప్రతిబంధాకాల్నే విధించారు.

17-6-1939 : 7వ సత్యాగ్రహ దళాధినేతగా పండిత జ్ఞానేంద్రజీ నియామకం.

18-6-1939 : ఔరంగాబాద్‌లో సత్యాగ్రహులపై లాఠీచార్జీ.

21-6-1939 : మద్రాసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా దేశవ్యాప్త ఆందోళన, భారత ప్రభుత్వానికి, ప్రజా ప్రతినిధులకి టెలిగ్రామ్‌ల ద్వారా నిరసన ప్రకటన.

22-6-1939 : పండిత జ్ఞానేంద్రజీ అతని అనుచరులు గుల్బర్గాలో అరెస్టు.

- భారతదేశమంతా 'హైదరాబాద్‌డే' ఆరవసారి ఆర్యసమాజం జరిపింది.

26-6-1939 : పండిత జ్ఞానేంద్రజీ అనుచరులకు 18 మాసాల జైలుశిక్ష విధించారు.

28-6-1939 : పార్లమెంటులో ఆర్య సత్యాగ్రహ ప్రస్తావన వచ్చింది. ఒక కమిటీని హైదరాబాద్ పంపాలనే నిర్ణయం.

30-6-1939 : వివిధ ప్రాంతాల్లో సత్యాగ్రహ శిబిరాల పున:నిర్వహణ, నూతన శిబిరాల నిర్వహణకై నిర్ణయం. కొంతమంది ప్రతిష్ఠిత వ్యక్తులు కలిసి వైస్‌రాయ్‌కి ఒక లేఖ పంపించారు.

1-7-1939 : హైదరాబాద్‌లో శ్రీ అర్జున్‌సింగ్ వధ, దోపిడి.

7-7-1939 : శ్రీకృష్ణాజీపైన విచారణ పూర్తి, ఒక సత్యాగ్రహి మరణం.

14-7-1939 : స్వామి స్వతంత్రానందజీ హైదరాబాద్ స్థితిగతుల్ని వివరిస్తూ వైస్‌రాయ్‌కి ఒక లేఖ రాసారు.

15-7-1939 : శ్రీ కృష్ణాజీ తన అభిప్రాయాన్ని లిఃత పూర్వకంగా కోర్టుకు సమర్పించారు.

19-7-1939 : ఆర్య సత్యాగ్రహోద్యమానికి సంబంధించి హైద్రాబాద్‌లో ఒక ప్రకటన వెలువడింది.

20-7-1939 : ఢిల్లీ సార్వదేశిక సభ అత్యవసర సమావేశం.

25-7-1939 : శ్రీ ఘనశ్యాం సింహగుప్తా అక్బర్ హైదరీల మధ్య ఫోనుద్వారా సంభాషణ.

27-7-1939 : ఆర్యసమాజ అనుకూల ప్రకటన జారీపై ముస్లింల విరోధ ప్రకటన.

29-7-1939 : శ్రీకృష్ణాజీకి 34 నెలల శిక్ష విధించింది.

- హిందూ మహాసభ సత్యాగ్రహ ఆందోళన విరమించింది.
- పార్లమెంటులో హైదరాబాద్‌లో సత్యాగ్రహంపై చర్చ జరిగింది.

1-8-1939 : నిజాం ఆర్యసమాజ్ యొక్క డిమాండ్లను అంగీకరించారు.

7-8-1939 : ఆర్యసమాజ్ సత్యాగ్రహాన్ని విరమించింది.

మహాత్మాగాంధీ కాంగ్రెసువారిని ఈ ఉద్యమంలో చేరవద్దని సలహా ఇచ్చారు. కాని చివరికి వారు కూడా"సత్యాగ్రహం" కేవలం ఎవరి పోత్సూ కాదని గ్రహించి, ఇలా ప్రకటించారు.

"ఇంతటి క్రమశిక్షణతో సుదీర్ఘకాలం పొంగి పొరలిన సత్యాగ్రహాన్ని నా జీవితంలో మొదటిసారి చూసాను. ఇది అత్యద్భుతమైనది".

-- మహాత్మాగాంధీజి.

ఈ సత్యాగ్రహంలో రాష్ట్రీయ స్వయం సేవక సంఘ సభ్యులు స్వేచ్ఛగా, కీర్తి ప్రతిష్టలనాశించకుండా వందల సంఖ్యలో పాల్గొన్నారు. దీని వివరాలను శ్రీనానా పాల్కర్ తమ హెడ్ గేవార్ అనే గ్రంథంలో విపులంగా ప్రస్తావించారు. నాటి ప్రముఖ సంఘ నాయకులెందరో ఆ సత్యాగ్రహంలో పాల్గొని, ఉద్యమానికి ఊతం ఇచ్చారు. (డా. హెడ్ గేవార్. నానా పాల్కర్ మొదటి ప్రచురణ. పే. 355 - 388)

హైదరాబాద్ విషయాన్ని జాతీయ సమస్యగా మార్చి దేశవ్యాప్తంగా ఆందోళనల్ని నిర్వహించి నిజాంను మొదటిసారిగా తలవంచేటట్లు చేసిన ఘనత ఆర్యసమాజానికే దక్కుతుంది.

దాదాపుగా ఎనిమిది నెలలపాటు సత్యాగ్రహాన్ని నిర్వహించడం అంటే సామాన్యమైన విషయం ఎంతమాత్రం కాదు. ఆ కాలక్రమంలో ఎందరో కార్యకర్తలు తమ అమూల్య ప్రాణాల్ని బలిదానం చేయాల్సివచ్చింది. అటువంటి అమర బలిదానాల్ని ఇక్కడ మనం గుర్తుచేసుకోవడం మన కనీస కర్తవ్యం.

# 13 ఆర్యవీరుల బలిదానాలు


ఆర్యవీరుల బలిదానాలు

ఆర్యసమాజ కార్యకర్తల త్యాగాలవల్ల ఏర్పడిన లోటు పూరించలేనిది. ఆర్యసమాజమనే ఆకాశంలో ఈ అమరవీరులు జ్వాజ్వల్యమానమైన నక్షత్రాల లాంటివారు. వారిపట్ల ఆర్యసమాజం సదా గర్వపడేటట్లు చేసారు. మొగలాయిల కాలంలో రాజపుత్రులు, సిక్కులు, మరాఠీలు హిందూజాతి ధ్వజాన్ని వంగిపోకుండా నింగికెగసేటట్లు నిలబెట్టడానికి తమ ప్రాణాల్ని అర్పించిన చారిత్రక ఘట్టాన్ని, హైదరాబాద్ సంస్థానంలో నిజాం ప్రభుత్వ పైశాచిక కృత్యాలను సాహసోపేతంగా ఎదుర్కొని నిలిచిన ఆర్యసమాజీయుల అమరత్యాగాలు పునరావృతం చేసాయి.

బ్రిటిష్‌వారి కుటిల రాజనీతి కారణంగా హైదరాబాద్ సంస్థానంలో ఆర్యసమాజాన్ని ముస్లింలు తమ శత్రువుగా భావించేట్లు చేసింది. మతమార్పిడిల నుండి, హైదరాబాద్ సంస్థాన విమోచనం వరకు ఇస్లాం మతమౌఢ్యాన్ని, నిజాం నియంతృత్వాన్ని గట్టిగా ఎదిరించి నిలిచిన సంస్థ ఒక్క ఆర్యసమాజమేనంటే అతిశయోక్తి ఎంతమాత్రం కాదు. ఆర్య సమాజీయులు చేసిన అమరత్యాగ పరంపరలో మచ్చుకు కొన్ని సంఘటనల్ని, కొంతమంది త్యాగమూర్తుల పేర్లను ఇక్కడ ప్రస్తావించడం సమయోచితంగా ఉంటుంది.

★ 1938 జూన్ 24న ఉదయం కళ్యాణి నగరంలోని ఆర్య సమాజమందిరం నుండి అప్పుడే బయటకు వచ్చిన ప్రఖర ఆర్యసమాజ కార్యకర్తను రజాకార్లు బరిసెలతో, తల్వార్లతో పొడిచి, నరికి అతిహేయంగా హత్యగావించారు. సమాజంలో చైతన్యాన్ని సంఘటనను నిర్మాణం చేయడం, యువకులకు శారీరక శిక్షణనివ్వడం ఆయన చేసిన నేరం.

7-8-1939 : ఆర్యసమాజ్ సత్యాగ్రహాన్ని విరమించింది.

మహాత్మాగాంధీ కాంగ్రెసువారిని ఈ ఉద్యమంలో చేరవద్దని సలహా ఇచ్చారు. కాని చివరికి వారు కూడా"సత్యాగ్రహం" కేవలం ఎవరి సోత్తూ కాదని గ్రహించి, ఇలా ప్రకటించారు.

"ఇంతటి క్రమశిక్షణతో సుదీర్ఘకాలం పొంగి పొరలిన సత్యాగ్రహాన్ని నా జీవితంలో మొదటిసారి చూసాను. ఇది అత్యద్భుతమైనది".

-- మహాత్మాగాంధీజి.

ఈ సత్యాగ్రహంలో రాష్ట్రీయ స్వయం సేవక సంఘ సభ్యులు స్వేచ్ఛగా, కీర్తి ప్రతిష్టలనాశించకుండా వందల సంఖ్యలో పాల్గొన్నారు. దీని వివరాలను శ్రీనానా పాల్కర్ తమ హెడ్ గేవార్ అనే గ్రంథంలో విపులంగా ప్రస్తావించారు. నాటి ప్రముఖ సంఘ నాయకులెందరో ఆ సత్యాగ్రహంలో పాల్గొని, ఉద్యమానికి ఊతం ఇచ్చారు. (డా. హెడ్ గేవార్. నానా పాల్కర్ మొదటి ప్రచురణ. పే. 355 - 388)

హైదరాబాద్ విషయాన్ని జాతీయ సమస్యగా మార్చి దేశవ్యాప్తంగా ఆందోళనల్ని నిర్వహించి నిజాంను మొదటిసారిగా తలవంచేటట్లు చేసిన ఘనత ఆర్యసమాజానికే దక్కుతుంది.

దాదాపుగా ఎనిమిది నెలలపాటు సత్యాగ్రహాన్ని నిర్వహించడం అంటే సామాన్యమైన విషయం ఎంతమాత్రం కాదు. ఆ కాలక్రమంలో ఎందరో కార్యకర్తలు తమ అమూల్య ప్రాణాల్ని బలిదానం చేయాల్సివచ్చింది. అటువంటి అమర బలిదానాల్ని ఇక్కడ మనం గుర్తుచేసుకోవడం మన కనీస కర్తవ్యం.

# 14 ఆఖరి పోరాటం

చర్యకు ప్రతిచర్య ఉంటుంది. పీడనకు ప్రతిక్రియగా తిరుగుబాటు తప్పదు. దానికి రుజువు .... రాజీలేకుండా కొనసాగిన హైదరాబాద్ సంస్థాన విముక్తి పోరాటమే. ఈ నిర్ణాయక యుద్ధ శంఖారావం మొదటగా చేసింది ఆర్యసమాజం. హిందూ సమాజంలో నిష్క్రియత్వాన్ని తొలగించి, నూతన చైతన్యాన్ని, జవసత్వాల్ని నింపి, జాతి పునర్నిర్మాణానికి మహర్షి దయానందుని స్ఫూర్తితో ముందుకు సాగింది ఆర్యసమాజం.

ఇక్కడ స్వేచ్ఛ స్వాతంత్ర్యాలకై పోరాడిన ప్రజలపై నిజాం దమనకాండ కొనసాగించాడు. ఇత్తెహదుల్ ముస్లిమీన్ సంస్థ అండదండలతో, తన అధికారాన్ని నిలుపుకోవడానికి ఎంతటి దౌష్ట్యం చేయడానికైనా వెనుకాడలేదు నిజాం పోరాటం తప్పనిసరి అయింది. క్రమంగా ఉద్యమ తీవ్రత పెరిగింది. అదేస్థాయిలో రజాకార్ల దౌర్జన్యాలు పెచ్చుమీరాయి. ప్రజల మాన, ధన ప్రాణాలకు రక్షణలేకుండా పోయింది. దాంతో గత్యంతరం లేని ఆ విషమ విపత్కర పరిస్థితుల్లో, ప్రత్యక్ష చర్యకు పూనుకోవాల్సి వచ్చింది.

ప్రజాపోరాట దళాలు, సరిహద్దు శిబిరాలు ఏర్పాటు అయ్యాయి. కాంగ్రెస్ ఆధీనంలో కొన్ని ఉద్యమాలు నడిచాయి. సహాయ నిరాకరణోద్యమం, అటవీ సత్యాగ్రహం, ఈత, తాటిచెట్ల కూల్చివేత, పన్నుల ఎగవేత, ప్రభుత్వ ఆస్తుల విధ్వంసం మొదలగునవి. వీటి తరువాత సాయుధపోరాటం కూడా మొదలైంది. అన్ని ఉద్యమాల్లోను ఆర్యసమాజం సంస్థాపర బేధాల కతీతంగా, తన అనుచరగణాలతో అతి ఉత్సాహంగా పాల్గొన్నది. ఆత్మరక్షణ, సమాజరక్షణ నిమిత్తమై ఆయుధాల్ని సేకరించి, ప్రజలకు పంచింది ఆర్యసమాజం. శ్రీవినాయకరావు, శ్రీబన్సీలాల్ జీవ్యాస్, శ్రీబి.కిషన్‌లాల్ లాంటి ఎందరో ఆర్యసమాజీకులు ఈకృషిలో పాలుపంచుకున్నారు. ఆయుధాల్ని సేకరించడం, ప్రజలకు అందించడం చివరకు ఆయుధాల్ని ధరించడంలోను అనేకమంది ఆర్యవీర్‌దల సభ్యులు సాహసోపేతంగా ముందుకు వచ్చారు. దశాబ్దాలుగా

పోరాటం నడుపుతూ, అపారమైన త్యాగాలు సలుపుతూ, ఏ స్వాతంత్ర్యం కోసమైతే మన పూర్వజులు కలలు కన్నారో ఆ స్వాతంత్ర్యం వాకిలి దాకా వచ్చింది.

1947 జూన్ 3న బ్రిటీష్ ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. 1947 ఆగస్టు 15 కల్లా భారతీయులకు అధికార సంక్రమణం జరుగుతుందన్నారు. అయితే భారతదేశంలోని సంస్థానాలకు సంబంధించి, పోతూ పోతూ మరొక ప్రకటన చేసారు. ఆనాడు ఆరువందలదాకా ఉన్న సంస్థానాలన్నీ స్వతంత్రం రాజ్యాలైపోతాయని, అప్పుడవి భారతదేశంలో కాని, పాకిస్థాన్‌లోకాని చేరవచ్చుని, రక్షణ, విదేశీ వ్యవహారాలు, కమ్యూనికేషన్లకు సంబంధించి ఒక ఒప్పందం చేసుకుంటే సరిపోతుందని, తతిమ్మా విషయాల్లో సంస్థానాలు, స్వతంత్రంగా కూడా ఉండవచ్చుని మౌంట్‌బాటన్ ఒక దుష్ట సలహా పారేసాడు.

తమకు పనికిరాని భారతదేశం, ఒక్కటిగా ఉండడం ఇష్టం లేని బ్రిటీష్ వారు, భారత్‌ను ఛిన్నాభిన్నం చేయాలనే కుట్ర చేసారు. అందుకు సాక్ష్యం విభజించు-పాలించు అనే బ్రిటీష్ నీతి. పై ప్రకటన నుండి స్ఫూర్తి నొందిన నిజాం భారత యూనియన్‌లో చేరడానికి నిరాకరించాడు. హైద్రాబాద్ సంస్థాన్ స్వతంత్ర ప్రకటన వెలువడింది. భారతదేశం స్వాతంత్రం పొందగానే, నిజాం స్వతంత్రం ప్రకటించుకున్నాడు. భారతదేశం స్వతంత్రమైన పిదప పన్నెండు రోజులకు, 1947 ఆగస్టు 27న నిజాం ఒక ఫర్మానా జారీ చేసాడు. అది ఇలా ఉంది.

"భారతదేశం స్వాతంత్రం కారణంగా ఏర్పడిన సమస్యల పట్ల, నా వైఖరిని ·న్ 1947 లో విడుదల చేసిన నా ఫర్మానలో, 1947 ఆగస్టు 14 న నేను ·సిన ప్రసంగంలోనూ, వెల్లడి చేసాను. నా సంస్థానానికి సంబంధించి నంత ·రకు బ్రిటీష్ వారు వైదొలగటంతోనే నేను స్వతంత్రుడనవుతాను. కనుక ఆ ·ధంగానే 1947 ఆగస్టు 15 ననే ఆ స్వయం ప్రతిపత్తి నాకు వచ్చింది. "
·andematharam to Jana-ganamana by-H.V. Desai, ·No. 18)

దాంతో హిందూమహాసభ, ఆర్యసమాజ్, కాంగ్రెస్, సోషలిస్టు తదితర పలు సంస్థలు నిజాం సరళిని గర్హించి వెంటనే సంస్థానాన్ని భారత యూనియన్‌లో విలీనం చేయాలని, నిజాంను డిమాండు చేసారు. ఇందుకు తోడుగా హైదరాబాద్ ఆర్య ప్రతినిధి సభకు అధ్యక్షుడైన శ్రీవినాయకరావు విద్యాలంకార్ (న్యాయవాదుల సంఘానికి కూడా అధ్యక్షులు) నిజాం ప్రకటనకు నిరసనగా న్యాయవాదుల సంఘం రాష్ట్రవ్యాప్తంగా కోర్టుల్ని బహిష్కరించింది. సంస్థానంలో జరిగిన అనేక ఘోరకృత్యాల్ని ఫోటోలతో సహా సేకరించి నాటి భారత ప్రభుత్వ ఏజంటు శ్రీకె.యం.మున్షికి అందజేసింది. నిజాంను తీవ్రంగా హెచ్చరించింది ఆర్యప్రతినిధి సభ. ఆ తర్వాత భారత జాతీయ పతాకాన్ని విదేశీయంగా నిజాం ప్రకటించాడు.

1947 నవంబర్ 29న 'యథాతథా ఒడంబడిక' మీద నిజాం సంతకం చేసాడు. అందులో ఐదు అంశాలు ఉన్నాయి.

1. రక్షణ, విదేశీ వ్యవహారాలు, కమ్యూనికేషన్లతో సహా ఇరుపక్షాలకు సంబంధించిన అన్ని రకాల పరిపాలన సంబంధమైన అంశాల విషయంలో పాత స్థితే కొనసాగుతుంది.
2. ఉభయపక్షాలు తమ ఏజంట్లను హైదరాబాద్, ఢిల్లీలో నియమించుకోవచ్చును.
3. హైదరాబాద్ విషయంలో భారత ప్రభుత్వం సార్వభౌమాధికారాన్ని వినియోగించకూడదు.
4. ఒప్పందానికి సంబంధించి ఏదైనా వివాదం తలెత్తితే ఇద్దరూ అర్బిట్రేటర్స్‌కు నివేదించాలి.
5. ఈ ఒప్పందం తక్షణం అమలులోకి వస్తుంది. ఒక సంవత్సర కాలంపాటు అమలులో ఉంటుంది.

ఒప్పందంలోని రెండవ అంశం ప్రకారం భారత ప్రభుత్వం శ్రీకె.ఎం.మున్షీని హైదరాబాద్‌లో తన ఏజంటు జనరల్‌గా నియమించింది. ఈ నియామకం సమయంలో నిజాం ప్రభుత్వం ఎన్నో పేచీలను పెట్టింది. ఢిల్లీలో నిజాం ఏజంట్‌గా నవాబ్ జయిన్ యార్జంగ్‌ను నియమించాడు నిజాం.

ఒప్పందాన్ని భంగపరచే రీతిలో ఎన్నో అభ్యంతరకర పనుల్ని చేసింది నిజాం ప్రభుత్వం.

- ఇండియన్ కరెన్సీని హైదరాబాద్ సంస్థానంలో నిషేధించాడు.
- పాకిస్థాన్‌కు భారత ప్రభుత్వ అనుమతి లేకుండా 20 కోట్లు ఋణంగా ఇచ్చాడు నిజాం.

రజ్వీ రెచ్చిపోయాడు. 1948 మార్చి 31 నుండి వారం రోజుల పాటు రజాకార్లకు ఆయుధ సప్తాహం నిర్వహించాడు. రజాకార్లను రెచ్చగొట్టాడు, జిహాద్ (పవిత్ర యుద్ధం) కు పిలుపు నిచ్చాడు. ఏప్రిల్ 12న రజ్వీ మరోసారి విషం గక్కాడు.

హైదరాబాద్ సంస్థానాధీశుని పాదాలు హిందూ మహా సముద్రంలో కడుగుతానని, ఎర్రకోటపై అసఫ్‌జాహి పతాకాన్ని ఎగురవేస్తానని ప్రకటించాడు.

1948 ఎప్రిల్ 15న ఒక ప్రకటన చేస్తూ భారతదేశ నడిబొడ్డున ఏ విదేశీరాజ్యాన్ని అంగీకరించేది లేదని భారతప్రధాని నెహ్రూ స్పష్టం చేసారు.

1948 ఎప్రిల్ 16 న హైదరాబాద్ సంస్థాన అంతిమ ప్రధాని లాయక్‌అలి సర్దార్ పటేల్‌ను కలుసుకున్నాడు. పటేల్ రజ్వీ యొక్క ఉన్మాదాన్ని గూర్చి అడుగ్గా, అటువంటిదేదీ లేదని లాయక్ అలీ తోసిపుచ్చాడు. తన దగ్గర తిరుగులేని సాక్ష్యం ఉందని లాయక్ అలీని తీవ్రంగా హెచ్చరించాడు పటేల్, రజ్వీ ప్రకటనను వినిపించాడు అలీకి.

"హైదరాబాద్‌ను కనుక భారత యూనియన్‌లో విలీనం చేసినట్లయితే సంస్థానంలోని కోటిన్నర మంది హిందువుల్ని ఊచకోతకు గురి చేస్తానన్నాడు రజ్వీ". అదే జరిగితే రజ్వీ వంశంతో పాటు అతనికి వత్తాసు పలికే అందరి భవిష్యత్తు కూడా ప్రమాదంలో పడక తప్పదని, హైదరాబాద్ ఖచ్చితంగా విలీనమై తీరుతుందని, మారక్తంతో, స్వేదంతో నిర్మించుకున్న భారత యూనియన్ అస్తిత్వాన్ని సవాలు చేసే ఏభాగాన్ని స్వతంత్రంగా కొనసాగనిచ్చే ప్రశ్నేలేదని, హైదరాబాద్ స్వయం ప్రతిపత్తి గూర్చి కలలు కంటే తప్పక విఫలమవుతుందనే విషయాన్ని మర్మగర్భంగా సర్దార్ పటేల్ లాయక్‌అలీకి తెలియచేసాడు.

అంతేకాక నిజాం ప్రభుత్వం ఈ దశలో ఎటువంటి రాజ్యాంగ సవరణలు చేయవద్దని, ప్రజల ఆకాంక్షల మేరకు వ్యవహరిస్తేనే నిజాం మన గలుగుతాడని, ఇక నుంచి సంస్థానంలో ఏం జరిగినా నిజాందే బాధ్యత అవుతుందని పటేల్ కుండబద్దలు కొట్టినట్లు తెలిపారు.

ఆ పిదప సంస్థానంలో హిందువుల్ని అల్పసంఖ్యాకులుగా చేయడానికి అన్ని రకాలుగా ప్రయత్నించాడు నిజాం. దీనికి మద్దతుగా 'రజ్వీ ప్రత్యక్షచర్య' పేరుతో ఒక కార్యాచరణ పథకాన్ని తయారు చేసాడు. ఇత్తైహదుల్ ముసల్మీన్ కార్యాచరణ సంఘం యామీన్ జుబేరి ఇంట్లో ఎంతో గోప్యంగా సమావేశమై ఈ పథకాన్ని సిద్ధం చేసింది. యామిన్ జుబేరి, మౌల్వి అబ్దుల్ రవూఫ్, మౌల్వి అబ్దుల్ ఖయ్యుం కాశీం, రజ్వీలు మాత్రమే ఈ సమావేశంలో పాల్గొన్నారు.

- ప్రజల్లో (హిందువుల్లో) భయోత్పాతాన్ని కలిగించడం.
- హిందువుల్ని ఊచకోత కోయడం, ధనమానాల్ని దోచుకోవడం లాంటి 32 అంశాలున్నాయి. ఆ కార్యాచరణ ప్రణాళికలో.

(హైదరాబాద్ పై పోలీసు చర్య పుట, 120-123)

మొత్తం మీద కాశీం రజ్వీ నాటి నాదిర్షా, చంగేజ్‌ఖాన్ తైమూర్‌లంగ్‌ల గుర్తుకు తెచ్చాడు. వారిని మించి ప్రవర్తించాడు. నానాటికి అతని పలుకుబ విపరీతంగా పెరుగనారంభించింది. బహదూర్ యార్జంగ్ కంటే ఎక్కు ప్రాచూర్యం పొందాడు. అప్పటి స్థితి ఎలా ఉందంటే పేరుకు నిజాం హైదరాబాద్ సంస్థానానికి రాజు కాని పెత్తనం మాత్రం రజ్వీదే. అసలు ప్రభువు రజ్వీనే అన్నట్లు ఉండేది నాటి స్థితి. పోరాటం తప్పనిసరి అయింది. కాంగ్రెస్ అధ్యక్షుడు స్వామిరామానందతీర్థ యుద్ధ శంఖారావాన్ని పూరించాడు. ప్రజలు ఉద్విగ్నులయ్యారు. కాంగ్రెస్ పార్టీ ప్రారంభించిన ఈ పోరాటంలో సైతం ఎప్పటి వలెనే ఆర్యసమాజం అగ్రశ్రేణిలో నిలిచింది. యుద్ధాన్ని నడిపింది. శ్రీహయగ్రీవాచారి నేతృత్వంలో బార్డర్ క్యాంపులు నిర్వహించుటకు నిర్ణయం తీసుకోబడింది. విజయవాడలో కార్యాలయం తెరువబడింది. అప్పుడు హైదరాబాద్ ఆర్యప్రతినిధి సభ తన యొక్క సంపూర్ణ సహకారాన్ని అందించింది. వేలాదిగా ఆర్యయువకుల్ని క్యాంపుల్లో చేరి పని చేయుటకు పిలుపునిచ్చింది. అద్భుతమైన రీతిలో స్పందన లభించింది.

బార్డర్ క్యాంపుల్లో చేరిన యువకులందరికి సాయుధ శిక్షణ నివ్వడానికి, శిక్షకునిగా ఆర్యసమాజ పండితుడు శ్రీరుద్రదేవశాస్త్రిని ఆర్యప్రతినిధి సభ విజయవాడకు పంపించింది. ఒక్క వరంగల్లు నుండి 250 కి పైగా ఆర్యవీరులు సరిహద్దు క్యాంపుల్లోకి వెళ్లారు. అలా అనేకులు హైదరాబాద్ సంస్థాన మంతటినుండి తరలి వెళ్ళారు. పండిత రుద్రదేవ్ శాస్త్రి వద్ద శిక్షణ పొందిన ఆర్యవీరులు దళనాయకులుగా వేరు వేరు క్యాంపుల్లోకి స్వచ్ఛంద సైనికులుగా పంపబడ్డారు. పోల్కంపల్లి, వేముల సర్వ, జొన్నలగడ్డ, మంగోలు, సిరిపురం, తిరువూరు, జీలుమల్ల పరిటాల మొదలగు అనేక క్యాంపుల్లో ఉండి వీరు వీరోచితంగా పోరాటం సాగించారు.

- పెట్టాపురం బ్రిడ్జికి బాంబును పెట్టి రైలును పడగొట్టిన ఘటనలో .......
- పరిటాలలో ఆసిడ్ బాంబు విసిరి రైలును ధ్వంసం చేసిన ఘటనలో.............
- అశ్వారావు పేట నుండి N.S.R. బస్సును ఏలూరుకు తరలించుకు పోయిన ఘటనలో .............
- యెఱ్ఱుపాలెం ....... సికింద్రాబాద్ స్టేషన్ల మధ్య ఒకే రాత్రి పట్టాలు, తంతి తీగెలు తొలగించిన ఘటనలో .............
- తుర్లకుంట, రెడ్డిగూడెం అడవుల్లో లవరాజు ముఠా ఫేర 12 వేల ఆవుల్ని బంధించి రైతుల నుండి 8 లక్షల రూపాయలు, డిమాండు చేసిన నేపథ్యంలో ఆర్యసమాజం లవరాజు ముఠాకు బుద్ధి చెప్పి అడవుల నుండి ఆవుల్ని తెచ్చి రైతులకు అప్పచెప్పిన ఘటనలో ...................
- మామునూరు విమానాశ్రయంలో సిడ్నీకాటన్ విమానాల ద్వారా నిజాంకు దొంగరవాణా చేసిన మారణాయుధాల రహస్యాల్ని సేకరించి భారత ఏజెంట్ జనరల్ శ్రీకె.ఎమ్.మున్షీకి అందించిన ఘటనలో ...........
- ఆఖరికి నియంత నిజాంను అంతంచేయడానికి బాంబు విసిరిన ఘటనలో ...... ఇలా ఆర్యసమాజ కార్యకర్తలు అనేక త్యాగాలుచేసారు. ఇందులో వరంగల్ ఆర్యవీరులు శ్లాఘనీయమైన పాత్రను పోషించారు.

- సత్యాగ్రహాలు చేసిన ఆర్యవీరులు బాంబులు తయారు చేసారు. వాటిని పంచారు, ఉపయోగించారు. అట్లాంటి అపురూప త్యాగపరంపరకి, వజ్రసంకల్పానికి, జాతీయ స్ఫూర్తికి నారాయణరావు పవార్ ఒక సజీవ ఉదాహరణ.
- పండిత రుద్రదేవశాస్త్రి ఉపదేశిక్ ఆర్య ప్రతినిధి సభ, శ్రీరామకోటయ్యా, శ్రీసూర్య 1948 లో ఏరుపాలెం గంగేరాల మధ్య విజయవాడ నుండి వచ్చే మాల్‌గాడి (గూడ్సురైలు) పై బాంబు విసిరి, అపార నష్టాన్ని కలిగించారు. ఈ సంఘటన జరుగగానే సమీప గ్రామాన్ని ముస్లీం గుండాలు అగ్నికి ఆహుతి చేయగా, ఆ మరుసటి దినమే పండిత రుద్రదేవశాస్త్రి తగిన సమాధానమిచ్చారు. విజయవాడకు వెళ్ళే మరోరైలుపై బాంబుదాడి చేసి డ్రైవరుతో సహా పూర్తిగా రైలును కాల్చి వేసారు. ఈ వరుస సంఘటనల ప్రభావం నిజాం సర్కారును తీవ్ర ఒత్తిడికి గురి చేసింది.



## 15 నీతి తప్పిన నిజాం

హైద్రాబాద్ సంస్థానంలో నియంత నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా, మహోధృతంగా అనేక ఉద్యమాల్ని నడిపించి భారతజాతి దృష్టి హైదరాబాద్ వైపు మరల్చడానికి విశేషకృషి జరిపింది ఆర్యసమాజం. తన ముందు తలవంచిన నిజాంను నమ్మి 1939 ఆగస్టు 7న అధికారికంగా ఆర్యసత్యాగ్రహోద్యమాన్ని విరమించింది. ప్రారంభించిన నెలరోజులకే సత్యాగ్రహం నుండి కాంగ్రెస్ తప్పుకున్నా.....ఆర్యసమాజం, హిందూ మహాసభ మొదలగుసంస్థల నిజాం తలవంచే వరకు సత్యాగ్రహాన్ని కొనసాగించాయి.

స్వేచ్ఛను ఇస్తానని హామీ ఇచ్చిన నిజాం అనతికాలంలోనే నీతి తప్పాడు. నిజాం నీతి తప్పడం, హిందూ ముస్లీంలు నాకు సమానమని దొంగ ప్రకటనలు

చేయడం విషయంగా శ్రీ కాళోజి నారాయణరావుగారి నాటి ప్రతిస్పందన గూర్చి వారు నాకిచ్చిన ఇంటర్వ్యూలో ఈ విధంగా చెప్పారు.

వేటుగాను రెండుకండ్ల మేటి మాటలెందులకు
కామ తినుచుచాటుగాను కన్నుగేటు లెందులకు
లూంబవి పదితోసరి అని తురక లెక్కలెందులకు
ఏదితో తొంబది సరి అను బాలగణితమెందులకు

-కాళోజి

ఆర్యసమాజ్ కార్యకలాపాలకు అడుగడుగున అవరోధాల్ని సృష్టించింది నిజాం ప్రభుత్వం. నిజాంకు వ్యతిరేకంగా న్యాయపోరాటాన్ని ప్రారంభించారు. నిజాం పోలీసులు జరుపుతున్న హిందూ వ్యతిరేక చర్యలకు సంబంధించిన వివరాలు ప్రోగుచేసి, సంస్థానంలోని ప్రముఖ న్యాయవాదుల సహకారాన్ని అర్థించారు.

సంస్థానమంతా తిరిగి నిజాం పోలీసుల దురాగతాలకు సంబంధించిన మాచారాన్ని సేకరించే బాధ్యతను శ్రీవందేమాతరం రామచంద్రారావు ్కరించారు. ఆయన జైలు నుండి బయటకు వచ్చి అప్పటికి కేవలం ఒక ంవత్సరమైంది. 1940 లో గౌలిగూడలోని రామమందిరంపై కెక్కి అక్కడ ంమికూడిన అశేష ప్రజానీకాన్ని సంబోధిస్తూ ఒక గంభీరోపన్యాసాన్ని చేసారు. జిమ్మేదారానా హుకుమత్ లేకేరహేంగే" అని సింహగర్జన చేసారు. దాంతో రెస్టు చేయబడ్డాడు. 1941 లో విడుదలయి మళ్ళీ ఉద్యమంలోకి దుమికేసాడు.

వందేమాతరం వీరభద్రారావు హిందూ స్వయం సేవక్ సంఘ్ అనే స్వచ్ఛంద సంస్థను ఏర్పాటు చేసారు. పోలీసు శిక్షణా సంస్థలో కేడెట్‌గా ఆయన సంపాదించిన పరిజ్ఞానము ఇందుకు బాగా దోహదపడింది. మూడువేల మంది స్వయం సేవకులకు ఆయుధ శిక్షణ ఇచ్చి ఎల్లవేళలా వారిని సంసిద్ధంగా ఉంచారు. పోలీసుల రజాకార్ల దౌర్జన్యకాండ కొంతవరకు తగ్గింది. అంటే దానికి కారణం ఆర్యసమాజ్ యొక్క ఆర్యవీర్‌దళ్ మరియు హిందూస్వయం సేవక్ సంఘాలే.

కొంత వరకు చురుకైన పాత్రను పోషించిన కాంగ్రెస్‌లో కేవలం నాయకులు మాత్రమే ఉండేవారు. కార్యకర్తలు కావలసినప్పుడల్లా ఆర్య సమాజమే న మ కూర్చేది. క్విట్ ఇండియా ఉద్యమకాలంలో వందేమాతరం రాంచంద్రారావును అరెస్టు చేసి బీహార్‌లోని బాగల్పూరు జైలులో ఉంచారు.

స్వాతంత్రం కోసం పోరాటం ఉధృతమైంది, అదేవిధంగా నిజాం, రజాకార్ల రాక్షస కృత్యాలు అధికతరమైనవి. అది భరించలేక ప్రజానీకం హైదరాబాద్ సంస్థానాన్ని వదలి ఇతర ప్రాంతాలకు వలసవెళ్ళడం మొదలైంది. మెజార్టీ ప్రజలైన హిందువుల్ని భయానక పరిస్థితులు సృష్టించి మైనార్టీగా మార్చాలనే పథకంలో భాగంగానే ఇదంతా చేసారు. ప్రజల స్వేచ్ఛకైబహుముఖీనంగాపోరాటంసాగించిన ఆర్యసమాజం మరో ముందడుగు వేసి, హైదరాబాద్ సంస్థానాన్ని వదలి వెళ్లిపోయే శరణార్థుల కోసంగాను అనేక ప్రాంతాల్లో సహాయక శిబిరాలు ఏర్పాటు చేసింది.

షోలాపూర్, బీజాపూర్, ఉమర్‌ఖేడ్, బుల్‌డానా, అమరావతి, బాసిమ్, పూనా, బార్సీ, చాందా, పుసణ్, మన్‌మాడ్, పండరీపూర్, రాజనందగాంవ్ మరియు విజయవాడ మొదలగు ఎన్నో ప్రాంతాల్లో సహాయక శిబిరాలు నెలకొల్పి వేలాది శరణార్థులకు ఆశ్రయం కల్పించింది. అక్కున చేర్చుకుంది, రక్షణ నిచ్చింది. పీడిత, తాడిత పేదప్రజల ఆశాజ్యోతిగా నిలిచింది ఆర్యసమాజం. ఈ పవిత్ర కార్యానికి బొంబాయి ప్రభుత్వం తన వంతు సహకారా అందించింది. శరణార్థులకు ఉచిత ఆవాస భోజన సదుపాయాల్ని కల్పించడ మాత్రమే కాక, వారికి సేవ, రక్షణ కల్పించడానికి గాను ఆర్యరక్షా సమితుల్ని నెలకొల్పింది ఆర్యసమాజం.

**ఆర్యరక్షా సమితి ఆశయాలు :**

- కాంగ్రెస్ ద్వార చేయబడే అన్ని నిజాం వ్యతిరేకపోరాట కార్యాలకు సంపూర్ణ సహకారం అందించడం.
- నిజాం వ్యతిరేక పోరాటాన్ని ఉధృతం చేయడం.
- హైదరాబాద్ రాజ్యాన్ని వదిలి వెళ్ళే శరణార్థులకు ఆశ్రయాన్ని అన్నపానాదులనిచ్చి రక్షణ కల్పించడం.

- ఆర్యరక్షాసమితి కార్యకర్తలు సంస్థానంలో విరివిగా పర్యటిస్తూ ప్రజల్లో ధైర్యాన్ని నింపడం, జాగృతిని తేవడం, ఐక్యంగా ఉంచడం లాంటి పనులు చేయడం, ఇలా ఉన్నత లక్ష్యాలతో మహోన్నతమైన పాత్రను పోషించాయి ఆర్యరక్షా సమితులు.
- 1947 నవంబర్ 17న శ్రీజయప్రకాశ్ నారాయణ నానాపేట పరిసర ప్రాంతంలో ఆర్యరక్షా సమితి నిర్వహిస్తున్న ఐదువేలకు పైగా ఉన్న శరణార్థుల శిబిరాన్ని సందర్శించి ఎంతో సంతృప్తిని వ్యక్తం చేసారు. ఆ తదనంతర కాలంలో ఈ కార్యానికి కాంగ్రెస్ వారు కూడా సహకరించారు.
- హైదరాబాద్ ఆర్యసమాజ్ సుప్రసిద్ధనేత శ్రీభాయీ బన్సీలాల్‌జీ వకీల్ చేజారిపోతున్న సంస్థాన పరిస్థితిని చూసి విచలితుడై ఢిల్లీ వెళ్ళి శ్రీసర్దార్ పటేల్‌ను కలిసి సంస్థాన విషయాల్ని పూర్తిగా అవగాహన కలిగించారు. రెండురోజుల పాటు సర్దార్‌పటేల్ బన్సీలాల్‌జీల మధ్య సుదీర్ఘ చర్చలు జరిగాయి.

ప్రజారక్షణకై ఆయుధాల్నివ్వాల్సిందిగా కోరారు బన్సీలాల్‌జీ. అందుకు ఒప్పుకోలేదు పటేల్. కాని తగిన సమయంలో భారత ప్రభుత్వం ఖచ్చితంగా ఒక ప్రభావశీలమైన కార్యాన్ని చేస్తుంది అనే హామీ నిచ్చారు. అయితే కేంద్ర ప్రభుత్వం చర్య తీసుకునే వరకు ఆర్యసమాజాన్ని తన నిజాం వ్యతిరేక ఆందోళనను కొనసాగించమని పటేల్ బన్సీలాల్‌కు సూచించారు. ఆవిధంగానే ఆర్యసమాజం తాను స్వయంగా అనేక ఆందోళనల్ని చేపట్టడం మాత్రమే కాక, స్టేట్‌కాంగ్రెస్ చేపట్టిన అన్ని ఆందోళనలకు కూడా తన వంతు సంపూర్ణ సహకారం అందించింది.

స్టేట్‌కాంగ్రెస్ 1947 ఆగస్టు 15న వివిధ ప్రాంతాల్లో విస్తృతంగా జాతీయ పతాకావిష్కరణ కార్యక్రమం చేపట్టాలనే నిర్ణయం తీసుకుంది. ఇందులో కూడా ఆర్యసమాజం వీరోచితమైన పాత్రను పోషించింది. జాతీయపతాకాన్ని నిజాం విదేశీయంగా ప్రకటించిన ఆరోజుల్లో దాని ఆవిష్కరణ అంటే అంత ఆషామాషియైన విషయం కాదు. ప్రాణాలకు తెగించి చేయాల్సిన పని అది.

కళ్యాణ్, రాజేశ్వర్‌లలోని పోలీస్ స్టేషన్లపైన హుమనాబాద్ బస్టాండ్‌పైన, సస్తాపూర్, దలీమ్‌లలోని డాక్‌బంగ్లాలపైన జాతీయ పతాకాల్ని ఆవిష్కరించారు, ఆర్యసమాజ కార్యకర్తలు. ఇక్కడ ప్రధానంగా చెప్పుకోవల్సిన విషయమేమిటంటే దలీమ్‌లోని డాక్‌బంగ్లాలో పోలీసు ఉన్నతాధికారులు బసచేసి ఉన్న సమయంలోనే పతాకావిష్కరణ జరిగింది. ఈ సాహసకృత్యం చేసిన ఆర్యవీరులు శ్రీయుతులు గోపాల్‌దేవ్, నివృత్తిరావు, నాగోరావు, నరసింహారావు నిరంగుడి మొదలగువారు. శస్త్రధారులైన క్రాంతికారుల దళాల్ని సైతం ఆర్యసమాజం ఏర్పరచింది. ప్రజలకు ఆయుధాల్ని అందించింది. అంతిమ పోరాటానికి ప్రజల్ని సమాయత్త పరిచింది. శ్రీయుతులు పండిత భద్రదేవ్ ఎన్.దేవయ్య మొదలగువారు నల్గొండ, వరంగల్ ప్రాంతాల్లో తుఫాన్‌లా పర్యటించి పదివేల రూపాయల నిధి వసూలు చేసి దానితో ఆయుధాల్ని సమకూర్చి, గ్రామీణులకు ఆ ఆయుధాల్ని అందించడం ద్వారా రజాకార్లనుండి, నిజాం పోలీసుల నుండి ఆత్మరక్షణ చేసుకునే మనఃస్థైర్యాన్ని, ప్రేరణను కలిగించింది ఆర్యసమాజం.

1948 ఆగస్టు నాటికే వెయ్యిగ్రామాల్లో గ్రామరక్షక దళాలు ఏర్పడినాయి రజాకర్ల మూకల్ని, నిజాం పోలీసుల్ని ప్రత్యక్షంగా ఎదుర్కొనే స్థితిలో ఉండేవి ఆ గ్రామాలన్నీ నిజాం ప్రభుత్వానికి ఎదురు తిరిగాయి. పదివేలమంది జైళ్ళలో మగ్గారు. వందలాది గ్రామాలు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాయి. పన్నులు కట్టడానికి నిరాకరించినాయి. నిజాం ప్రభుత్వానికి ఒక సవాలుగా నిలిచాయి.

సత్యాగ్రహం ఒకవైపు, శస్త్రాలతో మరోవైపు, సహాయ నిరాకరణ ఇంకోవైపు ఈవిధంగా పలురకాలుగా ఉద్యమాల్ని నడుపుతూ, కడలి కెరటంలా విరుచుకుపడింది. ఆర్య ప్రతినిధి సభ (ఇంటర్నేషనల్ ఆర్యన్‌లీగ్).

1940 వరకు కాంగ్రెస్‌లోనే పనిచేసిన శ్రీరావి నారాయణరెడ్డి శ్రీబద్దంఎల్లారెడ్డి, ఆంధ్రమహాసభ సదస్యుడిగా ఉన్న శ్రీపుచ్చలప సుందరయ్యతో కలసి శ్రీరాజ బహదూర్‌గౌడ్ సహాయంతో ట్రేడ్ యూనియ స్థానం సంపాదించుకుని పదిలపడ్డారు. కమ్యూనిష్టులపై నాడు నిషేధం ఉండింది. నిజాంయొక్క స్వతంత్ర హైద్రాబాద్ నినాదాన్ని ఎప్పుడైతే కమ్యూనిష్టులు బలపరిచారో అప్పుడు హైద్రాబాద్ ప్రధాని లాయక్‌అలి కమ్యూనిష్టులపై ఉన్న నిషేధాన్ని ఎత్తివేసాడు. ఆ విధంగా కమ్యూనిష్టులకు రజాకార్ల మద్దతు లభించింది.

# 16 క్రాంతి విస్ఫోటనం


నారాయణరావు పవర్

హైద్రాబాద్ సంస్థానంలో ఒకవైపు రజాకార్లు, మరోవైపు జాతీయోద్యమకారులు ఉద్యమించడంతో అంతర్యుద్ధం ప్రారంభమైంది. అది 1947 డిసెంబర్ 4 ప్రతిదినం మాదిరిగానే మహోన్నత వహించిన నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ సవారి కింగ్ కోఠీనుండి బయలుదేరింది. సాయంత్రం 4.45 ని॥లకు కారు గంటకు 40కి.మీ. వేగంతో ఆల్‌సెయింట్స్ స్కూల్ వైపు రాగానే ........ అప్పటివరకు ఏమి ఎరగనట్టు రోడ్డుప్రక్కన గుంపులో నిలబడి ఉన్న ఇరవయ్యేళ్ళ యువకుడు తన పొడవాటి షేర్వాణి జేబులోంచి బాంబుతీసి హఠాత్తుగా నిజాం కారుపైకి విసిరాడు. ఎవ్వరూ ఊహించని సాహసం చేశాడు. కాని అదృష్ట నిజాంవైపే ఉంది.

నేరుగా యమపురికి పంపటానికి దూసుకువచ్చిన శక్తివంతమైన ఆ బాంబు కారు కిటికీ అద్దానికి తగిలి రోడ్డుమీదేపడి చెవులు చిల్లులుపడేలా శబ్దంచేస్తూ పేలిపోయింది. ఆ ప్రాంతంలో ఉన్న ముగ్గురు వ్యక్తులు నిజాంకు బదులుగా మరణించారు. యా అల్లా - అనే హాహాకారాలు మిన్నంటాయి. నిజాంమాత్రం వెంట్రుకవాసిలో బ్రతికి బయటపడ్డాడు. బ్రతుకు జీవుడా అనుకుంటూ ఆదరాబాదరా సవారీని ఇంటిముఖం పట్టించాడు. కారు వెనుకభాగం పాడయ్యింది.

నిజాం చావునుండి తప్పించుకోవడం చూసి మరోబాంబు తీసి విసరబోతుండగా ఆ యువకున్ని పోలీసులు పట్టుకున్నారు, చితకబాదారు, చిత్రహింసలు పెట్టారు. ఆనాడు రాత్రి 8 గం॥లకు దక్కన్ రేడియో ఇలా ప్రకటించింది. అల్లా దయవల్ల మహోఘనత వహించిన నిజాం ప్రభువులు క్షేమంగా

ఉన్నారు. అంటూ ప్రత్యేక బులెటిన్‌ను ప్రసారం చేసింది. ప్రజాకంటకుండైన నిజాంను నిర్జించడానికే తాను బాంబును విసిరినానని కోర్టులో సగర్వంగా ప్రకటించాడు, ఆ యువకుడు. ఆర్యసమాజ కర్మఠ కార్యకర్తయైన శ్రీనారాయణరావు పవార్. బాంబువేసిన నేరానికి పవార్‌కు ఉరిశిక్ష పడింది. అయితే 'పోలీసుచర్య' ఆ సాహసిని మనకు దక్కేలా చేసింది. ఆ సాహసి ఇప్పుడు హైదరాబాద్‌లోని నల్లకుంటలో ఉన్నారు.

నిజాంమీద బాంబువేయడంలో పవార్‌కు గండయ్య, జగదీశ్ అనే కార్యకర్తలు బాసటగా నిలిచారు. నిజాంను నిర్జించడం అంటే, తెలంగాణా ప్రజానీకానికి స్వేచ్ఛను ప్రసాదించడమే. నిజాంమీద జరిగిన బాంబుదాడి వెనుక చాలా కథ ఉంది. దానిగూర్చి పండిత నరేంద్రజీ తన ఆత్మకథలో ఇలా రాసారు.

"హైదరాబాద్‌కు చెందిన నవయువకులమైన మేము ఈ విప్లవ పంథాను అవలంభించడానికి కారణం మహర్షి దయానంద సరస్వతి పట్ల మాకున్న భక్తిశ్రద్ధలే....

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామకాలంలో ఆయ నర్మదానదీ తీరంలో అజ్ఞాతంగా తిరుగుతూ విప్లవకారుల్ని ప్రోత్సహించిన ఘట్ట మా మనసుల్లో బలీయంగా నాటుకుంది. మాకు స్ఫూర్తిని ప్రసాదించింది.

హైదరాబాద్ సంస్థానమంతటా భయానక పరిస్థితి తాండవిస్తుంది. నిజాం నవాబు హైదరాబాద్ రాష్ట్రాన్ని భారతదేశంలో విలీనం చేయకుండా, ఇస్లాం రాజ్యంగా రూపొందిస్తూన్నట్లు ఒక ఫర్మానా జారీచేసాడు. ఈ ప్రకటనతో హిందువులు కళ్ళు తెరిచారు. నిజాం ఫాసిస్టు భావాలకు సమాధి కట్టాలని, అందుకై పోరాటం సాగించాలని నిశ్చయించుకున్నారు. భారతప్రభుత్వం కూడా దీన్ని ఒక సవాలుగా స్వీకరించింది. అహింసా విధానానికి కట్టుబడి ఉన్న స్టేట్‌కాంగ్రెస్ చేపట్టిన సత్యాగ్రహంతోపాటు మిగతా అన్ని కార్యక్రమాల్లోను ఆర్యసమాజ కార్యకర్తలు వేలాదిగా పాల్గొన్నారు. అయితే నవయువకులమైన మేము ఏయే గ్రామాల్లోనైతే రజాకార్లు హిందువులపై అత్యాచారాలు జరుపాలని అనుకునేవారో అలాంటి ప్రాంతాల్లోకి వెళ్ళి వారి ఆకృత్యాల్ని విఫలంచేసేవాళ్ళం. అంతేకాక వారిని ఎదుర్కోవడానికే మేము విప్లవపంథాను చేపట్టినాము.

మా సంకల్పాన్ని సాకారం చేసుకునేందుకు తీవ్రంగా ప్రయత్నాలు ప్రారంభించాం. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో శ్రీనానాపాటిల్ యొక్క పాత్రవల్ల బ్రిటీష్ ప్రభుత్వం గడగడలాడిన సంఘటన మాలో చైతన్యాన్ని నింపింది - నేను (పండిత నరేంద్రజీ) శ్రీగోపాల్‌దేవ కళ్యాణి, నానాపాటిల్ దగ్గరికి వెళ్ళాము. శ్రీనానాపాటిల్ కిర్లోస్కర్‌వాడి దగ్గర ఒక పల్లెటూర్లో ఉండేవారు. రెండు రోజుల చర్చల అనంతరం ఆయన అనుభవైక విద్యను అలవర్చుకుని, ఆ రోజుల్లో శివాజినగర్‌గా పేరొందిన ఖడ్క్ అనేచోటికి చేరాం. అక్కడ హైద్రాబాద్‌కి చెందిన శ్రీరాజిరెడ్డి, శ్రీమాణిక్‌రావు ఒకరోజు ముందే అక్కడికి వచ్చి ఉన్నారు.

ఒక సైనికాధికారి సహాయంతో కొన్ని చేతిబాంబులు సంపాదించుకుని, వాటిని ఒక పండ్లబుట్టలో పెట్టుకుని నేరుగా హైదరాబాద్‌లోని ఆర్యసమాజర్ మందిర్‌కు చేరుకున్నాం. అంతకుముందే నిర్ణయించుకున్న విధంగా కొన్ని బాంబులు మహారాష్ట్రకు పంపించడం జరిగింది. మిగతా బాంబుల్ని నా గదిలోనే భద్రపరిచాము. వీటిని ప్రయోగించకముందే సి.ఐ.డి. ధరణీప్రసాద్ నన్ను అరెస్టు చేసారు. ఆ తర్వాత నేను చేయాల్సిన పనిని శ్రీనారాయణరావు పవార్ బి.ఎ.ఎల్.ఎల్.బి.కి శ్రీతులసీరాం గారు అప్పగించారు. నిర్ణయించిన పథకం ప్రకారం ఎలాగైనా నిజాంను హత్యచేసి తీరాలి. అందుకోసంగాను, సాహసులు, త్యాగనిరతులైన ముగ్గురు ఆర్యయువకులు ఎన్నుకోబడ్డారు. వారు శ్రీనారాయణరావు పవార్ ఉరఫ్ నారాయణబాబు, శ్రీ గంగారాంజి ఉరఫ్ గండయ్య, శ్రీజగదీశ్ ఉరఫ్ ఈశ్వరయ్యలు. ఆల్ సెయింట్ స్కూలు వద్ద శ్రీనారాయణరావు పవార్ బాంబు విసరాలి. అక్కడ ప్రమాదం తప్పి నిజాం ముందుకు వెళితే మెథడిస్ట్ స్కూలువద్ద నిజాంను హత్యచేయడానికి శ్రీగంగారాంజి ఉన్నారు. ఒకవేళ బాంబుదాడి విఫలమైతే పిస్టల్‌తో కాల్చి చంపడానికి సైతం ఆయన సిద్ధంగా ఉన్నాడు. ఒకవేళ మెథడిస్టు స్కూల్‌వద్ద కూడా పథకం విఫలమైతే బొగ్గులకుంట మూలమలుపువద్ద నిజాంను హత్య చేయడానికి శ్రీ జగదీశ్ సర్వసన్నద్ధంగా ఉన్నాడు. అయితే తెలంగాణా ప్రజల దురదృష్టం వలన నిజాంకారు ముందుకు వెళ్ళకుండా తిరిగి ఇంటికివెళ్ళడంతో నిజాం బ్రతికి బయటపడ్డాడు.

ఒకవేళ పథకం విఫలమై ఈ యువకులు పట్టుబడినట్లైతే ఏ రహస్యమూ బయటపడకుండా ఉండడానికని వారు స్వచ్ఛందంగా మరణించడానికి విషంతోకూడిన చిన్నసీసాలు వారివద్ద ఉంచుకున్నారు. నారాయణరావు ఆ సంఘటనా స్థలంలోనే పట్టుబడగా రెండవరోజు మధ్యాహ్నం 12 గంటలకు పాలమ్‌కోల్ వద్ద శ్రీ గంగారాంను పట్టుకున్నారు కాని మూడవవ్యక్తి శ్రీ జగదీశ్ మాత్రం నిజాం పోలీసులకు దొరుకలేదు. నారాయణరావు గంగారాంలను చిత్రహింసలు పెట్టినా వారు నిజాం హత్యాపథకానికి సంబంధించిన ఏఒక్క విషయం కూడా బయటపెట్టలేదు. వీరిద్దరికి యావజ్జీవ కారాగార శిక్ష పడింది. ఈ వార్త తెలిసిన వెంటనే నేను (పండిత నరేంద్రజీ) వారిలో ధైర్యం నీరుకారిపోకుండా ఉండడానికి వారికి రహస్యంగా ఒక లేఖ పంపడం జరిగింది.

**ఆ లేఖ సారాంశం :**

"కారావాసము ఆత్మచింతనకు, స్వాధ్యాయాలకు ఉపయుక్తమైన స్థలమ మీరు చేసిన ఈ సాహసోపేతమైన త్యాగం హైదరాబాద్ సంస్థానంలో ఒక నూతన అధ్యాయాన్నే సృష్టించింది. మీరు బంధ విముక్తులయే రోజు త్వరలోనే వస్తుంది.

నియంత నిజాంపాలన నుండి హైదరాబాద్ సంస్థాన ప్రజలకు విముక్తి లభిస్తుంది. మీ ఇద్దరు పర్వత సమానంగా నిశ్చలమైన, సుదృఢమైన మనఃస్తత్వంతో ఉండండి". (హైదరాబాద్ కా స్వాధీనతా కా సంఘర్ష్ ఔర్ ఆర్యసమాజ్ పుట. 8 నుండి 12 వరకు).

**సైనికచర్యకు ముందు జరిగిన తతంగం :**

హైదరాబాద్ సంస్థానంలోని మెజార్టీ ప్రజానీకమైన హిందువులు అరచేతిలో ప్రాణాలు పెట్టుకుని క్షణక్షణ గండం దిన దిన మాయుస్సుగా బ్రతుకుతున్న పరిస్థితుల్లో సైతం - మన దేశంలోని సంశయాత్ములు నిజాంపైన కఠోరచర్య తీసుకోవడానికి ఏమాత్రం మొగ్గుచూపలేదు. 'భారతసైన్యం హైదరాబాద్‌లో అడుగుపెట్టడం అంటూ జరిగితే అది హిందువుల మృతదేహాలపై నుంచే నడిచి రావలసి ఉంటుంది' అన్న రజ్వీ మాటలకు భయపడినారు, పండిట్ నెహ్రూతో సహా చాలామంది.

ఏప్రిల్ 30, 1948న వందేమాతరం రాంచంద్రారావు, పండిట్ నెహ్రూకు ఒక లేఖ రాసారు. ఆ లేఖ హైదరాబాద్‌లోని భారత ఏజంట్‌ద్వారా ప్రధానికి పంపబడింది. సంశయాత్ముల, నిత్యశంకితుల అభిప్రాయాల్ని వందేమాతరం తన లేఖలో విభేదించారు.

**లేఖ సారాంశం :** హైదరాబాద్‌పై సైనికదాడి జరిగే పక్షంలో హిందువుల గతి ఏమవుతుందనే భయం అవసరం లేదు. హిందువులు వృద్ధిపొందుతున్న ఉత్సాహంతో ఉన్నారు. ఎక్కడ వీలయితే అక్కడ పారిపోయే శత్రువుల్ని చావుదెబ్బ కొట్టి కాశీం రజ్వీ ప్రకటన ఎంత హాస్యాస్పదమైనదో నిరూపిస్తారు."

ఆ పిదప హైదరాబాద్ సంస్థాన విషయంగా భారతప్రభుత్వ మంత్రిమండలి అనేకమార్లు చర్చలు జరిపింది. సర్దార్ పటేల్ నిజాం సంస్థానంలో జరుగుతున్న అత్యాచారాలు, హత్యాచార పరంపర వల్ల పూర్తిగా విచలితుడై ఉన్నారు. ప్రధాని నెహ్రూ మాత్రం నిజాంకు వ్యతిరేకంగా ఎలాంటి బలప్రయోగమైన చర్యను తీసుకోవడానికి విముఖంగా ఉన్నారు. ఒకసారి రక్షానమితి సమావేశంలో దీనిపై తీవ్రస్థాయిలో చర్చలు జరిగాయి. ప్రభుత్వతాత్సారం వల్లనే ఇదంతా కొనసాగుతుందని అంటూ ఆగ్రహించిన సర్దార్ పటేల్ ఆ సమావేశం నుండి నిష్క్రమించారు. ఆ పిదప తన మాతృదేశంలోని ఒక భాగంలో లక్షలాదిమంది ప్రజలు నరకప్రాయమైన జీవనం కొనసాగిస్తుంటే వారిని రక్షించలేని అధికారం నాకవసరంలేదని అంటూ తన పదవికి రాజీనామా చేసారు కూడా. ఆ మరుసటి రోజు నాటి గవర్నర్ జనరల్ శ్రీరాజగోపాలచారి సర్దార్‌పటేల్‌ను సముదాయించి రాజీనామాను ఉపసంహరింపచేసారు. కవాడ రాజదూత నెహ్రూను కలిపి రజాకార్లు క్రైస్తవ మహిళలపై చేసిన అత్యాచారాన్ని ఏకరువు పెట్టాడు. తన పంతం నెగ్గలేదని లోన బాధపడ్తూనే హైదరాబాద్‌పై సైనికచర్యకు అనుమతించాడు నెహ్రూ.

(హైదరాబాద్ స్వాధీనతా సంఘర్ష ఔర్ ఆర్యసమాజ్ పుట. 35)

ఎట్టకేలకు నిజాం దుర్మార్గాల్ని అరికట్టడానికి సర్దార్ పటేల్‌కు అవకాశం చిక్కింది. హైదరాబాద్‌ను చక్కదిద్దే బాధ్యతను స్వీకరించాడు. ప్రథమచర్యగా భారత సైనిక దళాల్ని హైదరాబాద్ సంస్థాన సరిహద్దుల్లో మొహరింపజేసారు.

- **1948 జూన్ 9వ :** సంస్థానం నుంచి భారత భూభాగంలోకి చొచ్చుకొనివచ్చే రజాకార్లను, నిజాం పోలీసుల్ని తిప్పికొట్టమని అవసరమయితే సంస్థానంలోకి వెళ్ళైనా సరే వారి ఆగడాల్ని ఆపాలని సైన్యాన్ని ఆదేశించారు.
- **1948 జూలై 1వ :** భారత గవర్నర్ జనరల్ ఒక ఆర్డినెన్సు జారీచేస్తూ నిజాంవద్ద, అతని ప్రభుత్వం వద్ద, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ వద్ద ఉన్న భారత ప్రభుత్వ సెక్యూరిటీలను బదిలీ చేయడంపై ఆంక్షలు విధించారు. దీంతో భారత ప్రభుత్వ సెక్యూరిటీలను భారత వ్యతిరేక చర్యలను వినియోగించే అవకాశం నిజాంకు లేకుండా పోయింది.
- **1948 జూలై 2వ :** సంస్థానానికి చెందిన దక్కన ఎయిర్‌వేస్ విమానయానాల్ని నిలిపివేసారు. అందుకు ప్రతిచర్యగా తన భూభాగ పైనుంచి వెళ్ళే భారత విమానాలకు అనుమతి పొందవలసి ఉంటుందని తిరకాసు పెట్టాడు నిజాం.
- హైద్రాబాద్‌లోని విమానాశ్రయాలన్నీ తమవేనని, వాటిపై ఆంక్షలు విధి అవకాశంగాని, అధికారం గాని నిజాంకు లేవని భారతప్రభుత్వ స్పష్టంచేసింది.
- **1948 జూలై 3వ :** జవహరి, విలువైన వజ్రాలు, విదేశీ ద్రవ్యము భారతదేశ ద్రవ్యము హైదరాబాద్‌కు పంపడాన్ని కేంద్రప్రభుత్వం నిషేధించింది హైద్రాబాద్ సంస్థాన లావాదేవీలన్నింటిని 'స్తంభింపచేసింది'.
- **1948 జూలై 11వ :** రిజర్వ్‌బ్యాంక్ హైదరాబాద్ ఖాతాను బ్లాక్ చేసింది భారత ప్రభుత్వం తీసుకున్న ఈచర్యల వలన ఖంగుతిన్న నిజాం తన రాజ్యాధికారాన్ని కాపాడుకోవడానికి అన్నిరకాల ప్రయత్నాల్ని చేయడం మొదలెట్టింది.
- **1948 జూలై 26వ :** హైదరాబాద్ సంస్థానంలో నిజాం అరాచకాలపైన ఒక శ్వేతపత్రం విడుదల చేసింది భారతప్రభుత్వం.
- 1948 ఆగస్టు మాసంలో మరికొన్ని అంశాలపై దృష్టి కేంద్రీకరించింది భారత ప్రభుత్వం.

- 1948 సెప్టెంబర్ మాసంలో సైనికచర్య తీసుకోవడానికి కావలసిన విధంగా అన్ని చర్యలు తీసుకుంది కేంద్రప్రభుత్వం.
- 1948 సెప్టెంబర్ 5న హైదరాబాద్ సంస్థానంలో అంతా సవ్యంగానే ఉందని భారతబలాగాల్ని ఇక్కడ ఉంచాల్సిన అవసరం లేదని నిజాం, ప్రధానికి ఒక లేఖ పంపాడు.
- **1948 సెప్టెంబర్ 7న :** హైదరాబాద్ సంస్థానానికి సంబంధించి పార్లమెంటులో ఒక సుదీర్ఘ ప్రకటన చేసారు ప్రధాని నెహ్రూ.
- **1948 సెప్టెంబర్ 9న :** నిజాం, భారత గవర్నర్ జనరల్‌కు ఫోనుచేసి ఆయన సహాయాన్ని అర్థించాడు.
- ఈ రోజునే సైనికచర్య తీసుకోవడానికి ముహూర్తం నిర్ణయించ బడింది. సెప్టెంబర్ 13 ఆ ముహూర్తం. ఈ విషయాన్ని సదరన్ కమాండ్‌కు తెలియజేయడం జరిగింది.
- **1948 సెప్టెంబర్ 10న :** హైదరాబాద్ ప్రధాని లాయక్‌అలీ తమ ప్రభుత్వ వైఖరిని సమర్థించుకుంటూ ఒక లేఖ పంపారు ప్రధాని నెహ్రూకు. హైదరాబాద్ సరిహద్దులో భారతసైన్యాన్ని మోహరించడంవల్లనే రజాకార్లు విజృంభించారని, అసలు సమస్యంతా భారతసైన్యం వల్లనే వచ్చిందన్నారు లాయక్‌అలీ.

**1948 సెప్టెంబర్ 11న :** భారతప్రభుత్వం లాయక్‌అలీ ఉత్తరానికి సమాధాన మిచ్చింది. హైదరాబాద్ నిస్సహాయమై రజాకార్ల చేతిలో కడగండ్ల పాలవుతుందని నిరసన తెలిపింది. ఇదంతా 'యధాతథ స్థితి' ఒడంబడికను ఉల్లంఘించడమే కాబట్టి అవసరమయ్యే ఏచర్య నైనా తీసుకోవడానికైనా భారత ప్రభుత్వానికి ఇక స్వేచ్ఛ ఉంటుందని భారతప్రభుత్వం స్పష్టం చేసింది.

**1948 సెప్టెంబర్ 12న :** మహమ్మదలీ జిన్నా మరణించాడు. పాకిస్తాన్ గందరగోళంలో పడిపోయింది. పాక్ నేతలెవ్వరూ హైదరాబాద్ గురించి పట్టించుకునే స్థితిలో ఎంతమాత్రం లేరు.

- నవాబ్ మొయిన్, నవాబ్‌జంగ్ నాయకత్వాన ఒక ప్రతినిధి వర్గం హైదరాబాద్ సంస్థాన సమస్యను విన్నవించుకోవడానికి. అంటే అంతర్జాతీయం చేయడానికి ఐక్యరాజ్యసమితి కార్యాలయానికి చేరుకున్నారు. అయితే సమితి సమావేశాలు మొదలవ్వడానికి ఇంకా సమయముంది.
- ఒక చేత్తో ఖురాన్‌ని, ఇంకోచేత్తో కరవాలాన్ని పట్టుకుని ముందుకు సాగాలని తన రజాకార మూకలకి ఆదేశాన్నిచ్చాడు కాశీం రజ్వీ. హైద్రాబాద్ సంస్థాన సర్వసైన్యాధ్యక్షుడు ఎడ్రూస్ దక్కన్ రేడియోలో మాట్లాడుతూ ఎటువంటి స్థితినైనా ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉండాలని ప్రజల్ని కోరాడు. (భారతసైన్యం సర్వసన్నద్ధంగా ఉంది).
- 1948 సెప్టెంబర్ 13న సైనికచర్య మొదలుపెట్టడాన్ని 15వరకు వాయిదా వేయించడానికి నాటి భారత ప్రధాన సైన్యాధిపతి జనరల్ బ్లూషర్ సర్దార్ పటేల్‌కు సలహా ఇచ్చాడు. ఇది బ్రిటిషు వారి కుట్రలో భాగం. హైదరాబాద్ సమస్యను అంతర్జాతీయం చేసి విలీనాన్ని ఆపాలని ప్రయత్నం.
- 13వ తేదీ అశుభమని బ్లూషర్ అనగా గుజరాతీ సంప్రదాయంలో 1 శుభకరమని పటేల్ సమాధానమిస్తూ మీకేమైన అభ్యంతరముంటే 13: బదులు 12నే మొదలెడ్తామని పటేల్ అనగా జనరల్ మారుమాటాడకుండా వెళ్ళాడు.

ఆర్యసమాజం, స్టేట్‌కాంగ్రెస్ కృషికి తగినవిధంగా ప్రజ స్పందించడం ఆరంభించింది. పోలీసు చర్యకుముందే వందలాది గ్రామాలు నిజాం ఆధిపత్యాన్ని తిరస్కరించాయి. స్వతంత్రతను ప్రకటించుకున్నాయి.

**వివరాలు :** పరిటాల చుట్టప్రక్కల 9 గ్రామాలు

- రాయచూర్ జిల్లాలోని 15 గ్రామాలు
- ఇటార్సి దగ్గరున్న 13 గ్రామాలు
- గుల్బర్గా జిల్లాలోని 17 గ్రామాలు

- వరంగల్ జిల్లాకు చెందిన 12 గ్రామాలు
- పర్భనీ జిల్లాకు చెందిన 100 గ్రామాలు.
- ఉస్మానాబాద్‌కు చెందిన 65 గ్రామాలు ఇలా ....... మొత్తం 274 గ్రామాలు స్వతంత్రాన్ని ప్రకటించుకున్నాయి.
- సంస్థానానికి 750 కస్టమ్స్ నాకాల్లో 300 నాకాలు బంద్ అయ్యాయి. 147 నాకాలమీద ప్రజాదాడులయ్యాయి.
- 1948 ఫిబ్రవరి నాటికి 80 చోట్లు.
- 1948 ఆగస్టు నాటికి మరో 13 చోట్ల రైల్వేలైన్లు కమ్యూనికేషన్లు తొలగించబడ్డాయి. నిజాం ఆస్తులకు భద్రత కరువైన పరిస్థితులు ఏర్పడినాయి.



# 17 నిజాం ఆఖరియత్నాలు

హైదరాబాద్ సంస్థానం యొక్క ఉనికిని కాపాడుకోవడానికి అందుబాటులో ఉన్న, ఏ చిన్న అంశాన్నైనా జారవిడవలేదు నిజాం. హైదరాబాద్‌లో రజాకార్ల సంఖ్య రెండు లక్షలకు పెరిగింది. 50 వేలకుపైగా నిజాం పోలీసులున్నారు. హైదరాబాద్‌పై గనుక భారతప్రభుత్వం సైనికచర్య తీసుకుంటే గనుక రజాకార్లు, తన సైన్యం తనను కాపాడుతారని భావించాడు నిజాం.

నాడు పలురకాల అపోహలు ప్రచారంలో ఉండేవి.

- సైనిక చర్య గనుక తీసుకుంటే హిందువులు ఊచకోతకు గురవుతారని.
- దేశమంతటా ముస్లింలు నిరసన ప్రకటిస్తారని.
- పాకిస్తాన్ యుద్ధానికి పాల్పడవచ్చని ఇలా .... ఎన్నో దుష్ప్రచారాలు జరుగుతుండేవి.
- అటువంటి సమయంలో శ్రీవందేమాతరం రాంచంద్రారావు ఒక ప్రకటన చేసారు. 85% ఉన్న హిందూ ప్రజానీకం దేశ విచ్ఛిన్నతకంటే

అంతర్యుద్ధానికే మొగ్గుచూపుతారని భారతదేశం అఖండం, అవిభాజ్యం, ప్రపంచంలోని ఏశక్తి దాన్ని విరూపం చేయలేదని హెచ్చరించాడు.

- తనకు సాయం చెయ్యమంటూ లాయక్అలీని పాకిస్థాన్‌కు పంపించాడు నిజాం. ఆ సమయంలోనే మహమ్మదలీజిన్నా మరణించడంతో పాక్‌నుంచి ఎటువంటి సాయం అందలేదు. కాని పాక్ విదేశాంగమంత్రి జఫరుల్లాఖాన్ ఒక సలహా పారేశాడు.
  ఐక్యరాజ్యసమితి భద్రతాసమితికి సమస్యను నివేదించమన్నాడు. ఇది నిజాంకు నచ్చింది.
- భారత అంతరంగిక సమస్యను అంతర్జాతీయ సమస్యగా చేయవద్దనే భారత ప్రభుత్వ సలహాను పెడచెవినపెట్టి సెప్టెంబర్ 10న మొయిన్ నవాబ్‌జంగ్‌ను ఐక్యరాజ్యసమితికి పంపించాడు నిజాం.
  భారత యూనియన్‌తో యుద్ధం తప్పేటట్లు లేదని భావించిన నిజాం అత్యంత ఆధునిక ఆయుధ సంపత్తిని సమకూర్చుకోవడానికి ఒక అంతర్జాతీయ స్మగ్లర్‌తో రహస్య ఒప్పందం చేసుకున్నాడు. సిడ్నికాటన్ అనే ఈ స్మగ్లర్ కరాచినుండి హైద్రాబాద్‌కు అత్యవసర మందు సరఫరా పేరుతో ఆయుధాల చేరవేత చేసాడు. ఈ దొంగ రవా విషయం వందేమాతరం రాంచంద్రారావు, రామారావు రాజగోపాలాచార్యల బృందం ప్రాణాలకు తెగించి పశువుల కాపర్లలాగా నటిస్తూ సమాచారాన్ని సేకరించి భారత ఏజంట్‌కు అందించగా ఆ సమాచారం భారత ప్రభుత్వానికి చేరింది. ప్రభుత్వం బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా, పాకిస్తాన్ మొదలగు దేశాలతో చర్చించి సిడ్నికాటన్ యొక్క దొంగరవాణాకు తెరదించింది.
  (ఈ విషయం శ్రీ వందేమాతరం గారు నాకిచ్చిన ఇంటర్వ్యూలో తెలిపారు).
- హైదరాబాద్ సంస్థానాన్ని విస్తరించడం ద్వారా తన ఉనికిని కాపాడుకోవచ్చునని భావించిన నిజాం గోవాను కొనడానికి ప్రయత్నించి భంగపడ్డాడు.
- ఇత్తెహాదుల్ ముసల్మీన్ లీడర్లకు కొందరికి ఐదుకోట్ల రూపాయల్నిచ్చి ఆయుధాల్ని కొనుక్కొని రమ్మని ఐరోపాకు పంపాడు నిజాం. ఆ

పనిమీద వెళ్ళిన ఆండ్రూస్ జెకోస్లోవేకియాలో ఆయుధాలకోసం ప్రయత్నించి విఫలుడయ్యాడు.

- యుద్ధంలో పాకిస్తాన్ మద్దతిస్తుందనే ఆశతోనే పాకిస్తాన్‌కు 20 కోట్ల రూపాయల ఋణం ఇచ్చాడు దూరదృష్టితో నిజాం.
- మత మార్పిడుల్ని ప్రోత్సహించి ముస్లీం జనాభా పెంచడానికి ప్రయత్నించాడు. ఆర్యసమాజ్ ఆ ప్రయత్నాలకు అడ్డుగోడగా నిలిచింది. నిజాం ప్రయత్నాన్ని నీరుగార్చింది.
- భయానక పరిస్థితులు సృష్టించి హిందువులు సంస్థానాన్ని వదిలి వెళ్ళేట్లుచేసి, తమ ఆధిక్యాన్ని నిలుపుకోవాలని చూసాడు నిజాం. కాని ఆర్యవీరదళాలు, గ్రామరక్షక దళాలు నిజాం ఆటల్ని సాగనియ్యలేదు.



# 18 సైనికచర్య (ఆపరేషన్ పోలో)

హైదరాబాద్ సంస్థాన హిందూప్రజానీకం చకోరపక్షిలా ఎదురు చూస్తున్న ఆ ఘడియ రానేవచ్చింది. అది 1948 సెప్టెంబర్ 13 సోమవారం ఉదయం నాలుగు గంటల సమయం. బ్రాహ్మ ముహూర్తంలో భారతసైన్యాలు హైదరాబాద్ సంస్థాన విమోచనానికై పథసంచలనాన్ని ప్రారంభించింది.

లెఫ్టినెంట్ జనరల్ మేజర్ జనరల్ మహరాజ్ శ్రీరాజేంద్రసింగ్ నిర్దేశకత్వంలో ... మేజర్ జనరల్ జె.ఎన్.చౌదరీ తన సేనలతో షోలాపూర్ - హైదరాబాద్ మార్గం గుండా బయలుదేరాడు. మేజర్ జనరల్ డి.ఎస్. బ్రార్ ముంబాయి సెక్టారునుండి, ఆపరేషన్ కమాండర్ మేజర్ జనరల్ ఎ.ఎ.రుద్ర మద్రాస్ సెక్టారు నుండి బ్రిగేడియర్ శివదత్తసింగ్ బేరార్ సెక్టారు నుండి ఇలా ... భారతసేనలు హైదరాబాద్ సంస్థానాన్ని దిగ్బంధనం చేసాయి.

భారత వైమానిక దళ ఎయిర్‌వైస్ మార్షల్ ముఖర్జీ తమ వంతు సేవల్ని అందించడానికి సంసిద్ధమైయున్నాడు. భారతసైన్యంయొక్క వ్యూహం

ఎంతమాత్రం అంతుబట్టలేదు నిజాంకు. భారతసైన్యాల ముట్టడి అన్నివైపుల నుండి ప్రారంభమైంది. ఎర్రకోటపై అసఫియా పతాకాన్ని ఎగురవేస్తామని బీరాలు పలికిన కాసీం రజ్వీగాని, అతని రజాకార్లుగాని, నిజాం సైనికులుగాని భారతసేనల్ని నిలువరించలేకపోయాయి. భారత సైన్యాలధాటికి తట్టుకోలేక అనేక ప్రాంతాల్లో ఆయుధాల్ని పారేసి పారిపోయారు నిజాం సైనికులు, రజాకార్లు. అదిచూసి పల్లె ప్రజానీకం సైతం వారిని వెంటాడి తరిమేశారు. **మొదటిరోజు దాడిలో** 632 మంది నిజాంసైనికులు వధించబడ్డారు. ఏడుగురు భారత సైనికులు స్వర్గస్థులైనారు. నల్గుర్డ్ ప్రాంతం భారతసేనల వశమైంది. తర్వాత ఆదిలాబాద్ జల్కోట్, తల్మడ్, తిరూరి ప్రాంతాలు తదనంతరం మునగాల తుల్జాపూర్, మానిక్‌గఢ్, కనౌడ్‌గావ్, బెజవాడ వైపున బోనకల్లు సైన్యాలకు వశమైనాయి. వరంగల్, బీదర్‌లలోని విమానాశ్రయాలపైన బాంబులదాడి జరిగింది. సైనికచర్య దృష్ట్యా హైదరాబాద్ బెజవాడల మధ్యనున్న ట్రంకుఫోను తప్ప భారత-హైద్రాబాద్‌లమధ్య ఉన్న అన్నిరకాల కమ్యూనికేషన్లను నిలిపేసారు.

**రెండవరోజు 1948 సెప్టెంబర్ 14న** దౌలతాబాద్, జౌల్నా, ఔరంగాబాద్ రాజేశ్వర, ఉస్మానాబాద్, నిర్మలా సూర్యపేట, హుమ్నాబాద్, వరంగల్ జిల్లాలలో ఖమ్మం భారతసేనల వశమైంది. వరంగల్‌లోని మామ్‌నూర్, బీదర్‌లలో బాంబిం జరిగింది.

**మూడవరోజు 1948 సెప్టెంబర్ 15న :** నిజాం సైనికులు పారిపోతూ రోడ్లను, వంతెనల్ని ధ్వంసం చేసారు. అయినా భారతసేనలు ఆగలేదు, సాపర్స్ సాయంతో పునర్నిర్మాణాలు గావించుకుంటూ తమ జైత్రయాత్రను కొనసాగించాయి. లాతూర్, జహిరాబాద్‌లలో నిజాంసైనికులపై బాంబులు కురిపించగా వారు తోకముడిచి హైద్రాబాద్‌కు పారిపోయారు. భారీఎత్తున మందుగుండు సామాగ్రి మరియు రజాకార్లు మన సైన్యానికి చేజిక్కారు.

**సెప్టెంబర్ 17న :** హైదరాబాద్‌లోకి భారతసైన్యాలు రాకుండా పటానచెరువు దగ్గర బ్రిడ్జిని పేల్చేశారు. గచ్చిబౌలి, లింగంపల్లి, మల్కాపూ ప్రాంతాల్లో మందుపాతర్లను పెట్టింది నిజాంసైన్యం. ఎన్ని ప్రయత్నాల్ని చేసి భారతసైన్యాన్ని ఆపలేకపోయింది నిజాం యంత్రాంగం. తలవంచక తప్పలేదు నిజాంరాజు కూడా.

# 19 నిజాం రాజు - గద్దె దిగిన రోజు

1948 సెప్టెంబర్ 17 నాటికి ఐదు రోజుల సైనిక చర్యతో నిజాంకు, ఆయన సైన్యాధికారి ఎడ్రూస్‌కు భారతసైన్యాలను నిలువరించడం తమ తరం కాదనే విషయం పూర్తిగా అర్థమైంది. దాంతో ఆరోజు సాయంత్రం 5 గంటలకు యుద్ధానికి స్వస్తిచెప్పి భారతసైన్యాన్ని హైదరాబాద్ లోకి ఆహ్వానించాడు. ఆరోజు రాత్రి 7 గం॥కు భారత ఏజంట్ సలహామేరకు రేడియోలో ప్రసంగించాడు నిజాం.



*సర్దార్‌పటేల్‌తో మీర్ ఉస్మాన్ అలీఖాన్*

ఇక్కడ ఇంకో విషయం గూర్చి మనం చెప్పుకోవాలి. ఉక్కుమనిషి సర్దార్‌పటేల్ రాజనీతిజ్ఞత బహుధా ప్రశంసనీయమైనది. అదే హైదరాబాద్‌ను ఆదుకున్నది.

- సెప్టెంబర్ 12న జిన్నా మరణించగానే సైనికచర్య ఆలస్యం చేయ రాదని తలంచాడు పటేల్.
- సెప్టెంబర్ 15 దాకా సైనికచర్య ఆపాలని కొంతమంది సూచించినా పటేల్ పట్టించుకోలేదు. ఎందుకంటే ఏమాత్రం సైనికచర్యను ఆలస్యం చేసినా అది భారత వ్యతిరేకశక్తులు తేరుకునేందుకు దోహదం చేస్తుందని అందుకని తాత్సారం కూడదని భావించాడు పటేల్.
- హైదరాబాద్ సమస్యను అంతర్జాతీయం చేయడానికి పారిస్‌లో సెప్టెంబర్ 16న మొదలయ్యే ఐక్యరాజ్యసమితి భద్రతామండలికి ఈ సమస్యను నివేదించడానికి మొయిన్‌నవాబ్ జంగ్ బృందం అక్కడికి చేరుకుని ఉంది.

- కనుక చేయవలసిన పని ఈలోపే చేసెయ్యాలని సర్దార్ నిశ్చయించారు. సెప్టెంబర్ 13న ముహూర్తం పెట్టారు.
- సెప్టెంబర్ 16న మధ్యాహ్నం భద్రతామండలి సమావేశం మొదలయ్యింది. అప్పటికే భారత సేనలు ముప్పావు వంతుల హైదరాబాద్ సంస్థానాన్ని వశం చేసుకున్నాయి.
- హైదరాబాద్ మీద భారతదేశం దాడి చేస్తున్నదని తమ దేశంలో రక్తపాతాన్ని నివారించడానికి భద్రతామండలి జోక్యం చేసుకోవాలని నవాబ్‌జంగ్ ఆవేశంగా ప్రసంగించాడు.
- ఆ తర్వాత భారతదేశం తరపున రామస్వామి మొదలియార్ తన వాదనను వినిపించారు. హైదరాబాద్ మొదటినుండి భారత యూనియన్‌లో అంతర్భాగమేనని, అది ఎన్నడూ స్వతంత్రరాజ్యంగా లేదని, కనుక దానికి ఐక్యరాజ్యసమితికి ఫిర్యాదుచేసుకునే హక్కు లేదని వాదించారు. ఈ వాదనలు 17నాడు కూడా కొనసాగాయి.
- సెప్టెంబర్ 17న వాద ప్రతివాదాలు తీవ్రంగా కొనసాగుతున్నాయి భారతసైన్యాలు హైదరాబాద్ నగరానికి సరిగ్గా ముప్పైమైళ్ళ దూరంలో ఉన్నాయి. ఆరోజు సాయంత్రం 5 గ॥లకు భారతసైన్యాలు హైదరాబాద్‌లో ప్రవేశించాయి. 7 గం॥లకు నిజాం దక్కన్ రేడియో ఇలా ప్రకటన చేసాడు.

  "నా ప్రియమైన ప్రజలారా! గవర్నర్ జనరల్ హిజ్ ఎక్సలెన్సీ రాజగోపాలాచారి పేర ఈ సందేశాన్ని తెలుపుటకు సంతోషిస్తున్నాను. నా ప్రభుత్వం రాజీనామా ఇచ్చింది. ఈ చర్య ఇంతకుముందే తీసుకోనందుకు విచారపడుతున్నాను. ఇప్పటికిచాలా ఆలస్యమయింది నా సైన్యాన్ని యుద్ధవిరమణ చేయాల్సిందిగా ఆదేశించానని గవర్నర్ జనరల్ గార్కి తెలియచేస్తున్నాను. ఐక్యరాజ్యసమితి నుండి కేసు ఉపసంహరించుకుంటున్నాను" అని ప్రకటించాడు, నిజాంమీర్ ఉస్మాన్ అలీఖాన్.

సెప్టెంబర్ 18న భారతసైన్యానికి హైదరాబాద్ ప్రజానీకం హారతులిస్తూ విజయతిలకాన్ని దిద్దుతూ హృదయపూర్వకంగా స్వాగతించారు. మేజర్ జనరల్ చౌదరీ ఎదుట నిజాం సైన్యాధ్యక్షుడు లొంగిపోయాడు. హైదరాబాద్ సంస్థాన యువరాజు ఆజంజాహి అసఫియా పతాకాన్ని దింపి లాంఛనంగా శరణువేడాడు.

హైదరాబాద్ మీద దాడిచేస్తే మద్రాస్, కలకత్తా, ఢిల్లీ, బొంబాయిలపై బాంబుల వర్షం కురిపిస్తానని, కోటికిపైగా ఉన్న హిందువుల్ని ఊచకోత కోస్తానని, హిందూశవాలపై నుండే భారతసైన్యం హైదరాబాద్ సంస్థానంలో అడుగుపెట్టాల్సి ఉంటుందని బీరాలు పలికిన రజాకార నాయకుడు కాశీం రజ్వీ తోకముడిచాడు. ఆయన అనుచరులు పిక్కబలం చూపారు. హైదరాబాద్ సంస్థానం భారతసేనల వశమైంది. భారతసైన్యానికి ఆసాంతం మార్గదర్శనం చేస్తూ, వారికి కావలసిన సమాచారాన్నందిస్తూ, సహకరిస్తూ సైనికచర్యను సుళువుగా చెయ్యడానికి ఆర్యసమాజం అతికీలకమైన పాత్రను పోషించింది. పండిత రుద్రదేవ్‌లాంటి ఎందరో ఆర్యసమాజీయులు ఈ కార్యంలో తమ శక్తికిమించి పనిచేసారు.

- "హైదరాబాద్ సంస్థానంలో ఐదు దశాబ్దాలకు పైగా ఆర్యసమాజం నిజాంకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని కొనసాగించి ఉండకపోతే ఈ సైనికచర్య ఇంత త్వరగా సులభంగా పూర్తయ్యేది కాదు", అన్న సర్దార్ పటేల్ మాటలు ఆర్యసమాజం యొక్క అనితర సాధ్యమైన ఉద్యమానికి ఫలస్వరూపం లాంటివి.
- నిజాం నవాబును లొంగదీసింది ఈనాటి పోలీసు చర్య ఎంతమాత్రం కాదు. గత పది సంవత్సరాల క్రితమే ఆర్యసమాజం నిజాంను లొంగదీసుకున్నది అని వ్యాఖ్యానించింది

  - పాకిస్థాన్ దినపత్రిక, 'కందిల్'.
- "భారతదేశపు ఏజంటుగా నావని విజయవంతం కావడానికి శ్రీవందేమాతరం రాంచంద్రారావు మరియు సాహసోపేతులైన అతని అనుచర ఆర్యసమాజ గణం చేసిన సేవలు ఎంతో కీలకపాత్ర వహించినవి", అని తన కృతజ్ఞత ప్రకటించుకున్నారు భారత ఏజంట్ శ్రీమున్షీ 1949 జనవరి 23న హైదరాబాద్‌లో జరిగిన ఒక బహిరంగ

సభలో ..... ఇలా ..... ఎంతోమంది అత్యద్భుతమైన, ఐతిహాసికమైన ఆర్యసమాజం ఉద్యమంగూర్చి పలురకాలుగా ప్రస్తుతించారు.

- భారతదేశపు ఉక్కుమనిషి సర్దార్ పటేల్ భౌతికంగా నేడు లేరు. అయినా హైదరాబాద్ సంస్థాన ప్రజలు ఆయన్ని తమ సంరక్షకునిగా కలకాలం స్మరిస్తారు. నిత్యశంకితులు తొట్రుపడిన విధంగా పోలీసు చర్య ఫలితంగా రక్తపాతం కాదుగాని ఒక్క హిందువు ప్రాణం కోల్పోలేదు.
- 1724 నుండి 1948 వరకు దాదాపు 224 సంవత్సరాలు కొనసాగిన ఏడుతరాల అసఫ్‌జాహిల పాలన అంతమైంది. అయినా అధికార దాహం తీరని నిజాం తాత్కాలిక ప్రభుత్వ ప్రతిపాదన చేయగా, భారత ఏజంట్ ఆ ప్రతిపాదనని తిరస్కరించాడు.

హైద్రాబాద్ సంస్థానంలో మిల్ట్రీ గవర్నర్‌గా శ్రీచౌదరి బాధ్యతలు స్వీకరించారు. 1947 ఆగస్టు 15న మనకు రాని స్వాతంత్ర్యం 1948 సెప్టెంబర్ 17న వచ్చింది. 1892 నుండి ఆర్యసమాజం ప్రారంభించిన నిజాం వ్యతిరేకోద్యమం, స్వామి రామానందతీర్థ నేతృత్వంలో ఉద్యమించిన స్టేట్ కాంగ్రెస్, వీరోచితంగా సైనికచర్యలో పాల్గొన్న భారతసైన్యం, దీనికంతటి సూత్రధారియైన భారత ఉక్కుమనిషి సర్దార్ పటేల్‌ల కృషియొక్క సత్ఫలిత స్వాతంత్ర్యం. హైదరాబాద్ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఃంచ దగిన ఘట్ట ఇది.

దీంతో నాటి హైదరాబాద్ సంస్థాన కథ కంచికి చేరింది !

కాని నేటి తెలంగాణా ప్రజలకు మాత్రం వంచనే మిగిలింది !!

1948 సెప్టెంబర్ 18న ఏర్పడిన మిల్ట్రీ ప్రభుత్వం నాటి పరిస్థితుల్ని చక్కదిద్దే ప్రయత్నాల్ని మొదలెట్టింది. నాటి పోలీసుశాఖలో 95 శాతం ముస్లింలే ఉండగా అందులో మెజారిటీ రజాకార్ల వర్గమే. అందుకే 1949 డిసెంబర్ దాకా మేజర్ జనరల్ చౌదరి నాయకత్వం వహించారు. ఆ తర్వాత ఎ.కె.వెల్లోడి I.C.S సివిల్ అడ్మినిస్ట్రేటర్‌గా బాధ్యతలు స్వీకరించారు.

1950లో స్టేట్‌కాంగ్రెస్‌కు సంబంధించిన నలుగురు ప్రతినిధులు మంత్రులుగా నియమించబడినారు. 1952 మార్చిలో ఎన్నికలు జరిగాయి. శ్రీ

బూర్గుల రామకృష్ణారావు నేతృత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. శ్రీ వెల్లోడి కొత్త ప్రభుత్వానికి సలహాదారు అయ్యారు. ఇంతవరకు అంతా బాగానే ఉంది గాని, హైదరాబాద్ సంస్థాన ప్రజల్ని అత్యాచారాలకు, హత్యాచారాలకు ఎరచేసిన నియంత నిజాం అతని దుర్మార్గ అనుచరుల సంగతేమిటో తెలుసుకుంటే ఆశ్చర్యంతోపాటు, అవమానం కూడా కలుగక మానదు. సిగ్గుతో తలదించే విధంగా ఉండింది. ఆ పరిస్థితి, ఆ కథా కమామీషు ఏమిటో కాస్తా పరికిద్దామ మరి !




నియంతలైన అడాల్ఫ్ హిట్లర్ జర్మనీ, ముస్సోలిని ఇటలీ, స్టాలిన్ రష్యాలను తలదన్నిన నియంత నిజాం. మిగతా నియంతలు దేశాభివృద్ధి, అధికారం రెండింటి గూర్చి ఆలోచించగా నిజాం మాత్రం కేవలం తన స్వార్థం గూర్చి పేరు ప్రతిష్ఠలగూర్చి మాత్రమే ఆలోచించి తన సంస్థానంలో ప్రజాపాలకునిగా గాక ప్రజాపీడకునిగా మారిన నేపథ్యంలో అతని అనుచర గణం, మతానుయాయులు, ఆయన్ని మించిన విధ్వంసకులుగా మారిన విషయానికి చరిత్రే నిలువెత్తు సాక్ష్యం.

నిజాం రాజరికానికి చరమగీతం పాడిన పిదప ఆ దోపిడీగాండ్రకు తగిన శిక్షపడాలని అందరూ కోరుకున్నారు. అలాగే జరగాలి కూడా - కాని జరిగింది మాత్రం అందుకు విరుద్ధం. అదొక ఘోరతప్పిదం అనిపిస్తుంది ఈ క్రింది విషయాల్ని గమనిస్తే ........

- హైదరాబాద్ సంస్థాన ఆఖరి ప్రధాని లాయక్అలి ఆయన మంత్రివర్గ సహచరులందర్ని గృహ నిర్బంధంలో ఉంచారు.
- అరాచకాల సూత్రధారి లాయక్ అలీపై ఎందుకో ... ఎటువంటి విచారణ జరుగలేదు. పైగా 1950 మార్చిలో ఉన్నట్టుండి ఆయన గృహ నిర్బంధం నుంచి పాకిస్తాన్‌కు పారిపోగలిగాడు.

- రక్తపిపాసి కాశీం రజ్వీ తన బావమరిది ఇంట్లో దాక్కొనిఉండగా అరెస్టు చేశారు. ఆయన చేసిన, చేయించిన వేలాది మానభంగాలకు, హత్యలకు, దోపిడీలకు, దౌర్జన్యాలకు శిక్ష మొత్తంగా కలిపి ఏడు సంవత్సరాలు పడింది. శిక్షానంతరం ఈయన పాకిస్తాన్‌కు పారిపోయాడు.
- ఇక కథానాయకుడు నిజాంకి శిక్షకు బదులుగా బ్రహ్మాండమైన బహుమతి లభించింది. ఆయన ఈ రాష్ట్రానికి రాజప్రముఖ్ (గవర్నర్)గా నియమించబడ్డాడు. 1956 నవంబర్ ఒకటి వరకు ఆయన ఆ హోదాలోనే అన్ని సౌకర్యాలు అనుభవించాడు.

సాధారణంగా నిందితులకు విధించే శిక్షలు ఎప్పుడూ విషాదాంతంగానే ఉంటుంటాయి. కాని ఇంతవరకు పేర్కొన్న విషయాల్ని చూస్తే మరోలా ఉంది కదూ ! ఆ సంఘటనల వెనుక ఉన్న మతలబు ఏమిటో పాఠకులే కనుక్కోవాలి.

**మరిన్ని ఆశ్చర్యకర అంశాలు :**

- ఈ నేలను పీక్కుతిన్న నిజాంకుకాని, రజాకార్లకు గాని ఎందుకు (సరియైన) శిక్షలు పడలేదు ?
- వారు రహస్యంగా దాచుకున్న ఆయుధాలు ఎందుకు పట్టుబడలేదు
- ఇక్కడి ప్రజల చెమటతో సంపాదించిన ధనం ట్రస్టుల పేరిట నిజాం బంధువులే ఎలా ఉంచుకోగలిగారు ?
- కింగ్‌కోఠీ, చార్‌మహల్, పంచమహల్, మహబూబ్ మాన్‌సేన్, అస్మాన్‌గఢ్, జఫర్‌గఢ్, చీరాన్ పాలెస్, ఫలక్‌నుమా ఇలాంటివెన్నో భవనాలు అప్పుడే ప్రభుత్వ కార్యాలయాలుగా ఎందుకు మారలేదు ?
- అత్రాఫ్‌బల్దా (రంగారెడ్డి జిల్లా) లోని అనేక ప్రాంతాలు (భూములు) ఇంకా తమ ఆధీనంలోనే నిజాం వారసులు ఎలా ఉంచుకోగలిగారు ?
- ప్రజల రక్తంతో తన కడుపునింపుకుంటూ, ప్రజాధనాన్నే దోచుకుంటూ నిజాం దాచుకున్న ధనం, వెండి, బంగారం, ముత్యాలు, రత్నాలు ఆభరణాలు నిజాం (వారసులు) తమ దగ్గరే ఎలా ఉంచుకోగలిగారు ?

- హిందూ ప్రజానీకంపై సుదీర్ఘకాలం దమననీతిని కొనసాగించిన నిజాం పోలీసులు, రజాకార్లను మద్దతుదార్లు ఆ పిదప స్టేట్‌పోలీసుల్లో ఎలా చేరగలిగారు ?
- రజాకార్లు దోచిన కోట్లాది రూపాయల సంపద ప్రభుత్వం ఎందుకు స్వాధీనం చేసుకోలేకపోయింది ?
- నిజాం ప్రభుత్వంనాటి ముస్లీం ఉద్యోగులు, పోలీసులు, పటేల్లు, పట్వారీలుగా 1948 సెప్టెంబర్ 17 తర్వాత కూడా అవే ఉద్యోగాల్లో ఎలా కొనసాగగలిగారు ?
- నిజాం పాలన కాలంలో తన అధికార దర్పానికి చిహ్నాలుగా చేసిన సాంస్కృతిక దాడిలో పలుప్రాంతాల పేర్లను మార్చాడు. అయితే నేటికి అవి అలాగే ఉండిపోయాయి. వాటి పాతపేర్లను ఎందుకు పునరుద్ధరించలేదు ?

  ఉదా ॥ హైదరాబాద్ - భాగ్యనగర్
  ఇబ్రహీంపట్నం - వీరపట్టణం
  నిజామాబాద్ - ఇందూర్
  మహబూబ్‌నగర్ - పాలమూర్, ఇలా .....

  వందలాదిగా నిజాం కాలంలో మార్చబడిన వీధులపేర్లు, ఊర్లపేర్లు, నగరాలపేర్లు ఇంకా మన స్వాతంత్ర్యాన్ని వెక్కిరిస్తూ అలాగే ఎందుకు చలామణి అవుతున్నాయి.

  (నియంత నిజాం నిజరూపం - కసిరెడ్డి పుట 44, 45)
- నిజాం కాలంలో తెలుగుభాష యొక్క ఉనికినే కోల్పోయినా నేడు ఉర్దూభాష మాత్రం రెండవ అధికార భాషగా (ఎలా) అయ్యింది ? తెలుగు అధికార భాషే అయినా ప్రభుత్వకార్యకలాపాలు ఇంకా ఇంగ్లీషు మాధ్యమంగానే ఎందుకు కొనసాగుతున్నాయి.
- ఇలా .......... సమాధానాలు దొరుకని సందేహాలెన్నో ............

తెలంగాణాలో పాలన మాత్రమే మారింది!

కాని వెనుక బాటుతనం ఇంకా కొనసాగుతూనే ఉంది !!

- హైదరాబాద్ సంస్థాన ఉద్యమానికి సంబంధించిన సమాచారము వివిధ రచయితల దృక్కోణాల్లోంచి కొంతమేరకు అర్థం చేసుకోవడానికి ఉపకరించే పుస్తకాల వివరాలు పొందుపరుస్తున్నాను. భవిష్యత్తులో రచయితలకు ఇది పనికిరావచ్చును.

## ఉపయుక్త గ్రంథసూచి


- దేవదర్మన్ - దేవదర్మన్
  - నరదేవ్ శాస్త్రి స్వీయచరిత్ర
- హైదరాబాద్‌కా స్వాధీనతా సంఘర్ష్ ఔర్ ఆర్యసమాజ్
  - పండిత నరేంద్రజీ
- పండిత నరేంద్రజీ ఆత్మకథ
  -అనువాదం శ్రీసురమౌళి
- హైదరాబాద్‌కే ఆర్యోంకి సాధనా ఔర్ సంఘర్ష్
  -పండిత నరేంద్రజీ
- పోలీస్ ఆక్షన్ అగేనిస్ట్ హైదరాబాద్
  -వందేమాతరం సోదరులు (1948లో ప్రచురణ)
- కాశీయాత్రా చరిత్ర
  - శ్రీఏనుగు వీరస్వామి
- ఆంధ్రుల సాంఘిక చరిత్ర
  -శ్రీ సురవరంప్రతాపరెడ్డి
- హిస్టారికల్ అండ్ డిస్క్రిప్టివ్ ఆఫ్ హైదరాబాద్ స్టేట్
  -శ్రీ బిల్గ్రామి
- వందేమాతరం టు జనగణమణ
  -శ్రీ పి.హెచ్. దేశాయ్
- ఇంటిగ్రేషన్ ఆఫ్ ఇండియన్ స్టేట్స్
  - శ్రీ వి.పి. మీనన్
- ది ఎండ్ ఆఫ్ ఇరా
  - శ్రీ కె. ఎమ్. మున్షి

- హైదరాబాద్ స్వాతంత్ర పోరాటం నా అనుభవాలు
  - స్వామి రామానందతీర్థ
- హైదరాబాద్ అజ్ఞాత చరిత్ర పుటలు
  - శ్రీ ఖండేరావు కులకర్ణి
- హైదరాబాద్‌పై పోలీసుచర్య
  - శ్రీ బి.ఎన్.శర్మ
- హైదరాబాద్ స్వాతంత్రోద్యమ చరిత్ర
  - శ్రీ ఎల్లూర్తి మాణిక్యరావు
- స్వామి రామానందతీర్థ
  ఎం.ఎల్. నర్సింహరావు
- చారిత్రాత్మక తెలంగాణా పోరాటం
  - శ్రీ చండ్ర రాజేశ్వరరావు
- తెలంగాణా ప్రజల సాయుధపోరాట చరిత్ర
  - దేవులపల్లి వెంకటేశ్వరరావు
- వీరతెలంగాణా విప్లవపోరాటం
  - శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య
- ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ప్రధానఘట్టాలు
  - శ్రీ జి. వెంకట రామారావు
- 50 సంవత్సరాల హైదరాబాద్
  - శ్రీ మందుముల నర్సింగరావు
- ప్రజల మనిషి
  - వట్టికోట అల్వారుస్వామి
- నియంత నిజాం నిజరూపం
  - డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి
- స్వర్ణప్రభ
  - భారత స్వాతంత్ర స్వర్ణోత్సవాల, ఆంధ్రప్రభ విశేష సంచిక

- స్వాతంత్ర్య సమరంలో మరో జలియన్ వాలిబాగ్
  - రేపాక నర్సింహులు
- హిందూ సంఘటన
  - వందేమాతరం రాంచంద్రారావు
- తెలంగాణా
  - మాడపాటి హనుమంతరావు
- డా. హెడ్ గేవార్
  - నానా పాల్కర్

## పండిత నరేంద్రజీ - నరేంద్రమే



*పండిత నరేంద్రజీ*

నిరాశ సంద్రంలో కొట్టుమిట్టాడుతున్న సమాజానికి స్వేచ్ఛను సంపాదించి పెట్టడానికి, సమాజహితం కోసం కుటుంబాన్ని త్యాగం చేయాలనే సూక్తి ప్రకారం ఈయన చేసిన త్యాగం చిరస్మరణీయం. అతి సామాన్య కుటుంబంలో నుంచి వచ్చి, జనమానసాల్లో అనన్య సామాన్యంగా వెలుగొంది, నిజాంకు నిద్రపట్టకుండా చేసి సింహస్వప్నంగా నిలిచాడు.

నరేంద్రుని పేరు వినగానే నిజాంకు చెమటలు పట్టేవి. గుండెల్లో రైళ్ళు పరుగెత్తేవి. సామాన్యుల్లో చైతన్యం కలిగేది, కొండంత ధైర్యం వచ్చేది. హైద్రాబాద్ సంస్థానం గూర్చి ఎవ్వరూ చెప్పదలచిన పండిత నరేంద్రజీ పేరు చెప్పకతప్పదు. హైదరాబాద్ విమోచనోద్యమం నుండి ఆయనను వేరుగా చెప్పడం ఎంతమాత్రం సాధ్యంకాదు. సంస్థానంలోని ప్రజల కడగండ్లు చూసి, వారికి అండగా నిలిచింది, వారిలో స్ఫూర్తిని నింపింది. ఒక్కటిగా చేసింది వారిని ఉద్యమోన్ముఖుల్ని చేసింది, అత్యద్భుతమైన రీతిలో ఉద్యమాన్ని ఉధృతంగా నడిపింది, తమ సంస్థ కార్యకలాపాలకి మాత్రమే ఆర్యసమాజ కార్యకర్తల్ని సీమితం చేయకుండా, కాంగ్రెస్‌లాంటి ఇతర సంస్థలు చేపట్టేకార్యక్రమాలకి తన బలగాన్ని పంపేది ఆర్యసమాజం.

కేవలం స్వతంత్రం మాత్రమేకాక దానితోపాటు విద్య, ఆరోగ్యం, ధర్మం, స్వభాష, దురాచారాల నిర్మూలన, ఆలయప్రవేశం, గోరక్ష, జీవరక్ష ఇలా ...... బహుముఖీనంగా కృషిసల్పింది హైదరాబాద్ సంస్థానంలో ఆర్యసమాజమే అనేది నిర్వివాదాంశం.

హైదరాబాద్ సంస్థానపోరాటం ఆర్యసమాజంతో, ఆర్యసమాజం పండిత నరేంద్రజీతో ముడివడి ఉన్నది. నిజాం వ్యతిరేక పోరాటాన్ని వరంగల్‌లో ఉధృతం చేయడంలో భాగంగా వరంగల్ ఆర్యసమాజ ఆహ్వానంపై ఇక్కడికి వచ్చిన పండిత నరేంద్రజీ గూర్చి కాళోజి నారాయణరావు ప్రతిస్పందన ఈ క్రింది వాక్యాల్లో చూడవచ్చు. ధైర్యము లేని వద్దమ్మలకు. ధైర్యము జెప్పగ ఈనాడు దయానందుని దండిభక్తుడు దయతో వచ్చెను ఈనాడు కుక్కలు మొరగవు, నక్కలు అరవవు కోతులెగరవూ ఈనాడు కారణమా ? నరేంద్ర సింగము గర్జన చేయును ఈనాడు గట్టి గుండెగల పొట్టినాయకుని ఘన సన్మానము ఈనాడు కాళోజి కవి గంటము రాల్చిన కవితాపూవులు ఈనాడు ఈ ఉత్తేజపూరిత అంశాల్ని ఆవేశంగా వృద్ధాప్యాన్ని మరచి నాకిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పినారు. ఉద్యమ నిర్మాతల్లో, నాటినేతల్లో ఆయన అగ్రేసరుడు. ఆయన చూపిన తెగువ, సాహసం, ఆయన అనుభవించిన శిక్షలు, కాలాపానీ శిక్షలు, నిర్బంధాలు, గృహనిర్బంధాలు, వాక్బంధాలు, బహిష్కరణలు, లాఠీలతో, తూటాల్తో దెబ్బలు, ఇలా ..... ఎన్నో .... ఎన్నెన్నో ....... ఎలా చూసిన హైదరాబాద్ చరిత్రలో ఆయనకాయనే సాటి. నాటి ఉద్యమమూర్తి స్వరూపమైన పండిత నరేంద్రజీ జీవితంలో కొన్ని అంశాల్ని ఇక్కడ చూద్దాం.

| | |
|---|---|
| 1907 | ఏప్రిల్ 10 శ్రీరామనవమి రోజున నరేంద్రుని జననం. |
| 1930 | లాహోరు ఉపదేశిక విద్యాలయంలో సిద్ధాంత అధ్యయనం. |
| 1931 | ఆర్యసమాజ కార్యకలాపాల్లో పాల్గొనడం, స్వదేశీ ఉద్యమంలో చురుకుగా పాల్గొనడం. |
| 1932 | దళిత, హరిజన, గిరిజనుల అభ్యున్నతికి కృషి ప్రారంభించారు. |
| 1933 | హైదరాబాద్ ఆర్యసమాజ్ కార్యకలాపాల్లో చురుకైన పాత్ర. |

| | |
|---|---|
| 1935 | వైదికాదర్శ్ పత్రికా నిర్వహణలో కీలకపాత్ర. |
| 1936 | సుల్తాన్‌బజార్ ఆర్యసమాజ్ మంత్రిగా ఎన్నిక. |
| 1937 | పట్టణనిర్బంధం, ఉపన్యాసాలపై, రచనలపై నిషేధం. |
| 1938-40 | ఫిబ్రవరి వరకు మన్ననూరు (కాలాపాని) జైల్లో నిర్బంధం. |
| 1940 | మధ్యదక్షిణ ఆర్యప్రతినిధి సభమంత్రిగా ఎన్నిక |
| 1944 | అంతర్జాతీయ ఆర్యన్‌లీగ్ ఉపాధ్యక్షునిగా ఎన్నిక |
| 1945 | నిజాం ప్రభుత్వద్రోహిగా ప్రకటన, కారాగారం, వాగ్బంధన శిక్ష. |
| 1947 | నిజాం వ్యతిరేకపోరాటం, జైలుశిక్ష. |
| 1948 | నిజాం లొంగుబాటు తర్వాత ఏర్పడిన శాంతి సంఘానికి (ఆయన) కార్యదర్శిగా నియామకం. |
| 1949 | ఆంధ్ర.బి. (నగర) కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నిక పి.సి.సి సభ్యునిగా ఉన్నారు. |
| 1952 | శాసనసభ్యునిగా ఎన్నిక. |
| 1953 | నావల్‌నగర్ ఎఐసిసి మహాసభ ఆహ్వానసంఘ కార్యదర్శి. |
| 1958 | హిందీ ఆందోళన ఉద్యమ నాయకత్వం |
| 1960 | మధురలో జరిగిన దయానంద శతాబ్ది ఉత్సవాల స్వాగతాధ్యక్షుడు. |
| 1963 | హైదరాబాద్ హిందీ ప్రచారసభ అధ్యక్షులు. |
| 1964 | ఆంధ్రప్రదేశ్ ఖాదీబోర్డు కార్యదర్శి. |
| 1966 | గోరక్షా ఉద్యమ నాయకత్వం. |
| 1967 | ఆంధ్రప్రదేశ్ హిందీ సమ్మేళన ఆహ్వానసంఘ కార్యదర్శి. |
| 1972 | అల్వార్ మహాసభల సంయోజకులు. |
| 1973 | మారిషస్ ఆర్యసమ్మేళన సంయోజనము. |
| 1974 | ఢిల్లీలో జరిగిన ఆర్యసమాజ శతాబ్ది ఉత్సవాల సంయోజకులు. |
| 1976 | సన్యాశ్రమ స్వీకారం. |
| 1976 | సెప్టెంబర్ 24న దివంగతులైనారు. |

హైదరాబాద్ సంస్థాన విముక్తి పిదప శాసనసభ్యునిగా ఎన్నికైనాక వరంగల్ ఆర్యసమాజంవారు పండిత్‌జీని ఆహ్వానించారు. అప్పుడు పండిట్‌జీ ప్రసంగిస్తూ ......... "ఇది పాపపు పదవి, ఇట్లాంటి పదవులు నా స్వభావానికి సరిపడవు, ఇకముందు ఇట్లాంటి పనిచేయను" అన్నారు.

పదవీలాలసులతో నిండి ఉన్న కుళ్ళు రాజకీయాల్లో సమాజసేవా తత్పరులైన పండిట్‌జీలాంటివారు ఎలా మనగల్గుతారు. అందుకే 1952లో శాసనసభ్యునిగా ఎన్నికై పదవీకాలం ముగియగానే మళ్ళీ రాజకీయాల జోలికి పోలేదు. 1958 నుండి 1976 వరకు ఆయన తిరిగి సామాజిక ప్రయోజనాలకై కృషిచేసారు.

శ్రీరామనవమినాడు జన్మించినందువల్లనేమో, నరేంద్రుని పేరు పెట్టుకున్నందుకో ఏమో, శ్రీరాముని ఆదర్శం, వివేకానందుని జీవనశైలి, పండిత్ నరేంద్రజీలో మనకు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఆ మహానాయకుని నుండి అనవరతం స్ఫూర్తి పొందడానికే ఈ మధ్యనే ఆర్యసమాజం వారు నాటి భారతప్రధాని శ్రీ ఐ.కె.గుజ్రాల్‌చే హైదరాబాద్‌లోని కోఠీ ఆంధ్రాబ్యాంక్ చౌరస్తాలో పండిత నరేంద్రజీ నిలువెత్తు విగ్రహాన్ని ఆవిష్కరింపచేసి మరోసారి ఆ మహామహునికి హైదరాబాద్ సంస్థాన ప్రజల పక్షాన శ్రద్ధాంజలి ఘటించారు. ఆయన చరిత్ర నాడు, నేడు ఏనాటికైన హైదరాబాద్ చరిత్రలో శాశ్వతంగా అమరధ్యాయంగా నిలిచిపోతుంది.

**వందేమాతరమైన వావిలాల రామచంద్రారావు**

విప్లవజ్యోతి అల్లూరి సీతారామ రాజును బ్రిటీష్ ప్రభుత్వం వంచించి కాల్చి చంపిందని దుఃఖిస్తున్న తన తండ్రిద్వారా వివరాల్ని తెలుసుకున్న ఎనిమిదేళ్ళ పసిబాలుడిలో ....... అల్లూరి వారి దేశభక్తి, త్యాగనిరతి, చెరగని ముద్రవేసింది. బాల్యంలో నాటుకున్న ఆ భావన దినదిన ప్రవర్ధమానమై, ఆయన్ని ప్రఖర జాతీయ వాదిగా మార్చి నిజాం సంస్థాన



శ్రీ వందేమాతరం రాంచంద్రారావు

సంగ్రామంలో నిరుపమానమైన పాత్రను పోషించేట్లు చేసింది. స్వాతంత్ర్యానంతరం కూడా అఃల భారతస్థాయిలో, అంతర్జాతీయ స్థాయిలో ఆర్యసమాజ నాయకునిగా అనితరమైన సేవల్ని సమాజానికి అందించేట్లు చేసింది.

ఆ బాలుడే ....... మన వందేమాతరం రాంచంద్రారావు.

ఏప్రిల్ 25, 1916న లక్ష్మాంబ, రామారావు పుణ్యదంపతులకు జన్మించిన వావిలాల రాంచంద్రారావుకు బాల్యంనుండే ఉద్యమించడం అలవాటైంది. హిందువుల హక్కుల సాధనకై ఏర్పడిన సంస్థ హిందూ మహాసభ. ఇందులో కీలకమైన పాత్రను పోషించాడు. 'హిందూ సంఘటన్' అనే పుస్తకాన్ని రాసారు. హిందూ మహాసభ పక్షాన హైదరాబాద్ నగరంలోని గౌలిగూడ శ్రీరామమందిర్ ప్రాంగణంలో అక్టోబర్ 22న 1938లో వేలాదిమంది సమక్షంలో నిజాంకు వ్యతిరేకంగా సత్యాగ్రహం చేసి అరెస్టయినాడు. చంచల్‌గూడ జైలు సూపరింటెండెంట్ పేరు నవాబ్, ఆయన శ్రీ వందేమాతరాన్ని (Solitary cell) ఏకాంతపు గదిలో ఉంచారని నాకిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారు.

విచారణకని కోర్టుకు తీసుకెళ్ళిన హెడ్‌కానిస్టేబుల్ ఈయన ధరించిన యజ్ఞోపవితాన్ని తీసేయమంటే వందేమాతరం తిరస్కరించాడు. దాంతో కోపంతో ఆ కానిస్టేబులే మీదపడి యజ్ఞోపవితాన్ని తెంపివేసాడు. విచారణకని కోర్టుదాకా తీసుకెళ్ళి, విచారణ లేకుండానే జైలుకి తీసుకు వచ్చారు. యజ్ఞోపవీతం లేనిదే భోజనం చేయనని భీష్మించుకు కూర్చున్నారు. అంతలో ఆజైలులోని మిగతా ఆర్యవీరులంతా రాంచంద్రారావుతో సత్యాగ్రహం చేసారు. గత్యంతరం లేక అదేజైల్లో ఉన్న స్వామి రామానందతీర్థచే తిరిగి ఆర్య వీరులకు జంధ్యాలు వేయించారు. ఆ అవకాశాన్ని సాకుగా తీసుకుని సంస్కృత మంత్రాలతో పాటు ఉద్యమ సమాచారాన్ని కూడా పరస్పరం అందించుకున్నారు. జైలులోని ఆరవవార్డులో అధికంగా ఉన్న ఆర్యసమాజీకులంతా సంధ్యావందనంచేసి వందేమాతర గీతాన్ని ఆలపించేవారు. దాంతో జైలరు మండిపడి ఇది మీ ఇల్లుకాదు అని హెచ్చరించగా అందుకు రామచంద్రారావు సమాధానమిస్తూ 'మేమున్నంత వరకు జైలుకూడా మా ఇల్లే' అన్న సాహసికి 1939 ఫిబ్రవరి 7న సాయంత్రం 6.30 గంటలకు ఆయన్ని 'టిక్‌టిక్' (tri pad) పైనఎక్కించి

కాళ్ళు చేతులు కట్టివేసి, నడుముకు బెల్టుపెట్టి, అదే జైల్లో ఉన్న దావూద్ అనే బందిపోటుచే అంతకుముందే నీళ్ళలో నానబెట్టి ఉంచిన కర్రతో నడుము క్రింది భాగంలో 24 దెబ్బలు బలంగా కొట్టించారు. దెబ్బదెబ్బకు చర్మం పగిలి రక్తం కారుతుంటే వందేమాతరం అని గర్జిస్తూనే ఉన్నాడు. దెబ్బలైనా తిన్నాడు కాని వందేమాతరం అనడం మాత్రం మానలేదు. ఆనాటి దెబ్బల ప్రభావం ఇంకా తనని బాధిస్తూనే ఉందని, తాను ఎక్కువసేపు కూర్చోలేనని ఆయన నాకిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారు.

పండరీపురంలో జరిగిన పెద్ద బహిరంగసభలో స్వాతంత్ర్య వీరసావర్కార్ రాంచంద్రారావుకు వందేమాతరం అనే బిరుదునిచ్చారు. ఆనాటినుండి వావిలాల రాంచంద్రారావు వందేమాతరం రాంచంద్రారావుగా వాసికెక్కారు. 1940లో జైలునుండిబయటికి రాగానే గౌలిగూడ రామమందిరం వద్ద అశేష జనవాహిని నుద్దేశించి ప్రసంగిస్తూ నిజాం నిరంకుశత్వంపై నిప్పులు చెరిగారు, మళ్ళీ అరెస్టయినారు. 1941లో విడుదలైనారు. తెలంగాణా ప్రాంతంలో విస్తృతంగా పర్యటించి పలుప్రాంతాల్లో ఆర్యసమాజ శాఖల్ని ప్రారంభించారు.

1948లో ఢిల్లీవెళ్ళి సర్దార్‌పటేల్‌ను కలిసి హైదరాబాద్ ప్రజల కడగండ్లను కూలంకషంగా వివరించారు.

ఆస్ట్రేలియాకు చెందిన అంతర్జాతీయ స్మగ్లర్ సిడ్నీ కాటన్‌తో నిజాం రహస్య ఒప్పందం చేసుకుని, ఇండియా ప్రభుత్వం నిజాంపై విధించిన ఆంక్షల్ని సాకుగా చూపి, బ్రిటీష్ కన్సర్వేటివ్‌ల సహాయంతో ప్రాణరక్షణ ఔషధాల చేరవేత పేరుతో లైసెన్సుపొంది మారణాయుధాల్ని దిగుమతి చేసుకున్నాడు నిజాం. కరాచి నుండి అతిఎత్తు నుండి కేవలం 20 నిమిషాల్లో హైదరాబాద్ సంస్థానంలోని బీదరు, వరంగల్‌లోని మామునూరు విమానాశ్రయాలకు ఆయుధాలు, వైరుసెట్లు మొదలగువాటిని చేరవేసేవాడు సిడ్నీకాటన్. ఈ ఆయుధాల చేరవేత 1948 మే మొదటి వారంలో మొదలయ్యి జూన్ 12నాటికి సిడ్నీకాటన్ ఆరుసార్లు విమానం తెచ్చాడు. ఈ విద్రోహచర్యకు సంబంధించిన సమాచారాన్ని గూఢచర్యంచేసి తెలుసుకునే అతిప్రమాదకర బాధ్యతను శ్రీవందేమాతరం స్వీకరించి పూర్తి సమాచారాన్ని సేకరించి భారత ఏజంట్‌కు అందించారు. ఈ

కార్యంలో వందేమాతరం సోదరులు, తిమరం రామారావు, (వరంగల్)ల పాత్ర అమోఘమైంది. వీరి ప్రయత్నంవల్లనే అందించిన సాక్ష్యాలవల్లనే భారత ప్రభుత్వం కెనడా, బ్రిటన్, ఆస్ట్రేలియా, పాకిస్థాన్‌లతో చర్చించి ఆయుధాల స్మగ్లింగ్ ఆగేట్లు చేసింది.

వందేమాతరం సోదరులు హిందూ స్వయంసేవక్ సంఘ్ స్థాపించి వేలాది యువకులకు ఆయుధశిక్షను ఇచ్చారు. 'యాంటి కమ్యూనిస్టు మినేస్‌ఫ్రంట్'ను స్థాపించి గ్రామగ్రామాన భూమి పొందాలనే ప్రజల ప్రబలతృష్ణను సంతృప్తిపరిచే విధంగా సహకార వ్యవసాయ సంఘాల్ని స్థాపించి వారి అభివృద్ధికి కృషిచేసారు. అంతేకాక వరకాంతం గోపాలరెడ్డి అనే భూస్వామికి మూడువేల ఎకరాలభూమి ఉండేది. ఆయనకు వ్యతిరేకంగా సుప్రీంకోర్టుకు వెళ్ళి ఆ భూమినంతా పేదలకు పంచినారు. మల్కాపూర్, నల్గొండ మొదలగు అనేక ప్రాంతాల్లో సహకార వ్యవసాయసంఘాల్ని స్థాపించారు.

**1949** జనవరి **23**న హైద్రాబాద్‌లో జరిగిన ఒక బహిరంగసభలో **20**వేలమంది ప్రజల సమక్షంలో "భారతదేశపు ఏజంట్‌గా నా పని విజయవంతం కావడానికి శ్రీ వందేమాతరం రాంచంద్రారావు మరియు సాహసోపేతులైన ఆయన అనుచరగణం యొక్క సేవలు. ఎంతో కీలకమైనవని, అతిప్రమాదకరమైన పనుల్ని సవాలుగా తీసుకుని వారుచేసిన కృషి బాహాటంగా చెప్పడం సాధ్యంకాదని, వారుచేసిన కృషి సఫలీకృతం కావడం, దాన్ని చూడడానికి శ్రీవందేమాతరం ఇంకా మనమధ్య ఎలా బ్రతికి ఉన్నారనేదే ఆశ్చర్యకరమైన విషయమని అన్నారు".

- భారత ఏజంట్ శ్రీ మున్షీజీ.

పై వాక్యాలు వందేమాతరం రాంచంద్రారావు గారి అపురూప త్యాగాలకు నిలువెత్తు దర్పణాలు. వారు భౌతికంగా కొంత బలహీనమైన ...... నాటి వారి సమాజనిష్ఠ, తెగువ వాక్పటిమ నేటికి వారి మాటల్లో ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. రాబోయే తరాలకు స్ఫూర్తి నందిస్తుంది. స్వార్థపరులకు, దేశద్రోహులకు కనువిప్పు కలిగిస్తుంది.

# ఆర్య సమాజం - విరాట్ స్వరూపం

1875 నుండి దినదిన ప్రవర్ధమానమై ఆర్య సమాజం విశ్వజనమానసాల్లో వర్ధిల్లుతోంది.

- మొత్తం ప్రపంచంలో 5000 శాఖలున్నాయి
- ఇందులో భారతదేశంలో 4,500 శాఖలుండగా
- విదేశాల్లో 500 శాఖలున్నాయి
- 200 ప్రాంతీయ సభలున్నాయి
- 300 ఆర్యవీర్‌దళాలు భారత్ నేపాల్, ఆఫ్రికా ట్రినిడాడ్‌లలో ఉన్నాయి
- 500 కాలేజీలు, స్కూల్లు నడుపుతోంది.
- 2,000 ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలున్నాయి
- 60 గురుకులాలున్నాయి
- 300 సంస్కృత పాఠాశాలలున్నాయి.
- 400 నిమ్నజాతులకు ప్రత్యేక పాఠశాలలు నడుపుతోంది.
- 10 సాంకేతిక విద్యాలయాలు
- 500 అతిథిగృహాలు, అన్నశాలలు, క్రీడాస్థలాలు
- 400 వైద్యాలయాలు
- 200 అనాథ శరణాలయాలు
- 300 ముద్రణాలయాలు
- 10,000 సన్యాసులు, ప్రచారకులున్నారు.

2 కోట్ల ఆర్యులున్నారు

5 లక్షల ఆర్యసమాజ సభ్యులున్నారు

5 లక్షల బాలబాలికలు విద్యార్థులుగా ఉన్నారు.

## ఉపసంహారం

సమాజ సంక్షేమం కోసం, స్వాతంత్ర్యం కోసం అపూర్వ త్యాగాలు చేసిన మన పూర్వజుల పరంపరలోని నాటి తరం నాయకులు శ్రీవందేమాతరం రామచంద్రారావు, శ్రీనారాయణరావు పవార్, పండిత కృష్ణదత్ శ్రీకాళోజి నారాయణరావులాంటి మహానుభావులెందరో .......... నాటి సమాచారం ప్రత్యక్షంగా తెలుసుకోవడానికి ఇంకా మన మధ్యన తీపి గుర్తులుగా మిగిలి ఉండడం తెలంగాణా చేసుకున్న అదృష్టం. ఆ త్యాగ మూర్తులు చేసిన అపూరూపమైన కృత్యాల్ని, వారి ప్రఖర దేశభక్తిని స్వధర్మ రక్షణకై వారికి గల ఆసక్తిని మనం నేర్చుకోవాలి. భావితరాలకు నేర్పాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

స్వభాష, స్వభూష, స్వజాతి మొదలగు భావాల పట్ల అవగాహనా రాహిత్యంతో, ఆధునికీకరణ, పాశ్చాత్యీకరణల మోజులో, ఆ ప్రవాహం పడికొట్టు మిట్టాడుతున్న నేటి తరానికి, భావితరాలకు కూడా మన పూర్వ సులక్షణ శోభిత సుగంధాన్ని అందించాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

భారతదేశంతో పాటు మనకూ స్వాతంత్రం వచ్చింది అని అనుకు వారే అధికం. దానికి కారణం ఈ చారిత్రక వాస్తవాలు సమాజాని అందుబాటులో లేకపోవడమే.

- భారతదేశ చరిత్రలో తెలంగాణా స్వాతంత్ర సమరానికి సముచితమైన స్థానాన్నివ్వకపోవడమే.
- నేటి తరాలకు విద్యావిధానం ద్వారా ఈ చారిత్రక సత్యాల్ని అందిం కుండ ఉండడంలోని ఆంతర్యమేమిటో యోచించాల్సిన పనిని పాఠకు వదలి వేస్తున్నాను.
- తెలంగాణా నాటి విదేశీ పాలకుల పాలనలోనే కాక నేటి స్వజాతీయుల పాలనలో కూడా వివక్షకు గురై వెనుక బాటు తనానికి ఎరమై గత ఐదు దశాబ్దాల కాలంగా అనాధలా పడి ఉండడానికి గల కారణాల్ని కూడా అవగాహన చేసుకోవాల్సిందిగా పాఠకుల్ని కోరుతున్నాను.

ఈ దేశ చరిత్రను, ఉనికిని, సంస్కృతీ సభ్యతల్ని తమ వారసత్వంగా భావించి, త్రికరణ శుద్ధిగా జీవించే హిందూప్రజానీకానికి, సెక్యులరిజం పేర

నడుస్తున్న దగాకోరు, దివాళాకోరు రాజకీయాల వల నుండి ఈ
ఆలోచించాల్సిన అవసరం నేడు ఎంతైనా ఉంది.

ఈ దేశంలో హిందువులు మెజారిటీగా ఉన్నంత కాల
సెక్యులరిజంగాని, సోషలిజం గాని, కమ్యూనిజం గాని డెమోక్రసీజ
ఇజమైనా నిజంగా వర్ధిల్లగలుగుతుంది. హిందువులు మైనారిటీల
ఈ దేశంలో మనకు కనిపించేది కేవలం మతోన్మాద నిరంకు
మాత్రమే అనే వాస్తవాన్ని అందరూ ఎంత తొందరగా గమనిస్తే అం
ఇది గతంలో కాని నేడు కాని హిందువేతరులు అధికంగా ఉన్న
పరిస్థితుల్ని గమనిస్తే కనిపించే వాస్తవం. గుడ్డిదెయ్యాలు వేదాల్ని
సెక్యలరిజం గూర్చి హిందూ సమాజానికి పాఠాలు చెప్పడం మాని
ప్రపంచ దేశాల పోకడల్ని గమనిస్తూ వర్తించడం మనకు ఆరోగ్యక

సేవ సాక్షిగా, పేదరికం సాక్షిగా, ఉద్యోగం సాక్షిగా, అధిక
అజ్ఞానం సాక్షిగా అంచెలంచెలుగా, పథకం ప్రకారం ముమ్మరంగా,
దేశవ్యాప్తంగా (వ్యాపారం పేరుతో గతంలో) తమ జనాభా పెం
భవిష్యత్తులో తిరిగి తమ ఆధీనంలోకి దేశాన్ని తెచ్చుకోవాలి అనే ద
విదేశీ ధన ప్రవాహంతో కొనసాగుతున్న మత మార్పిడుల్ని, వి
భగ్నం చేయాల్సిన ఆవశ్యకతను గుర్తించాలి. అన్ని రకాల ఆలోచనా
నుండి బయటకు వచ్చి భారతదేశ మనుగడకై ఆలోచించాల్సిన
గమనించాలి.

మతాలకతీతంగా మన మాతృభూమి యొక్క చారిత్రక ఉ
స్వరూపానికి, స్వాతంత్రానికి, స్వజాతీయతకి, స్వాభిమానానికి భం
దిశలో ఈ దేశ పౌరులుగా భరతమాత సంతానంగా
కొనసాగించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

మనకు హాని కలుగని రీతిలో సర్వమానవ కళ్యాణం
నేర్చుకుందాం !

